శ్రీమతేరామానుజాయనమః



# అభీతిస్తవము

## శ్రీ వేదాన్త దేశిక ప్రణీతము

ఆంధ్ర టీకా తాత్పర్య సంజీవనీ వ్యాఖ్యా సహితము
గార్గ్య శ్రీ వేంకటాచార్య రచిత సంస్కృత వ్యాఖ్యానము

'సంజీవనీ' వ్యాఖ్యాత:- శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు

ప్రకాశకులు : శ్రీ యం. సునీల్ & అనిల్ రెడ్డి సోదరులు



తిరుమల చారిటబుల్ ట్రస్టు - హైదరాబాదు



న్యాయ పథమందు ప్రజ్ఞతో నడుచుకొనుచు
భయము సహజము సంసార బంధమనుచు
దీన జనులను దరిజేర దీయునట్టి
సరసమగు మందల శ్రీవృషావిలాస
రెడ్డి దాంపత్య ధార్మిక ప్రీతి కలరి
శ్రీశ్రియఃపతులు విలాసరెడ్డి నభయ
స్వీయ పదపద్మ సన్నిధి జేర్చుకొనగ
తల్లి యాజ్ఞను తలదాల్చి తనయులిపుడు
శ్రీ సునీల్‌రెడ్డి మఱి యనిల్ రెడ్డి; తండ్రి
స్మృతికి నీ కృతిని ప్రకాశింపజేసి
ధన్యులైన వారికి రంగధాముడెపుడు
సకల సంపదలొసగి ప్రసన్నుడగుత.

శ్రీమతే రామానుజాయ నమః



# అభీతి స్తవము

## శ్రీ వేదాన్త దేశిక ప్రణీతము

ఆంధ్ర టీకాతాత్పర్య సంజీవనీ వ్యాఖ్యా సహితము

గార్గ్య శ్రీ వేంకటాచార్య రచిత సంస్కృత వ్యాఖ్యానము



'సంజీవనీ' వ్యాఖ్యాత :

**శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు**

ప్రకాశకులు : శ్రీ యం. సునీల్ & అనిల్ రెడ్డి సోదరులు

❊ ❊ ❊ ❊ ❊

తిరుమల చారిటబుల్ ట్రస్టు, హైదరాబాదు.

# అభీతి స్తవము

శ్రీ వేదాన్త దేశిక ప్రణీతము

ఆంధ్ర టీకాతాత్పర్య సంజీవనీ వ్యాఖ్యా సహితము

**గార్గ్య శ్రీ వేంకటాచార్య రచిత సంస్కృత వ్యాఖ్యానము**

ప్రకాశకులు : శ్రీ యం. సునీల్ & అనిల్ రెడ్డి సోదరులు



వెల : రూ. 40/-

ప్రథమ ముద్రణ :
వ్యయనామ సం॥ర
మహాశివరాత్రి 16-2-2007

ప్రతులు : 1000

-: ప్రాప్తిస్థానము :-

**శ్రీ మాలోల గ్రంథమాల**
శ్రీ అహోబిల మఠం,
డి.డి. కాలనీ,
హైదరాబాదు-13
ఫోన్ : 040-27423043

**శ్రీ యం. సునీల్ రెడ్డి, అడ్వకేటు,**
సీతారామస్వామి గుడి దగ్గర,
పెద్దపల్లి (రైల్వే స్టేషను),
కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర.)
ఫోన్ : 958728 223016

ముద్రణ :
**వాగ్దేవి ప్రింటర్స్**
నల్లకుంట, హైదరాబాద్-44.
ఫోన్ : 27673772







SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

**JEEYAR EDUCATIONAL TRUST**
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
✆ (08645) 272929, 272353

[illegible] శాస్త్రి స్వామినే!
శ్రీమతే నారాయణాయ నమః
అనేక మంగళాశాసనములు!

Dt.: 16-2-2007

దేవరవారు అనువదించిన "అభీతిస్తవము" గ్రంథాన్ని తద్వ్యాఖ్యను చూశాము. చాలా బాగున్నది. ఏ సమాజానికైనా శక్తిని, చైతన్యాన్ని ప్రసాదించేవి ఆయా సమాజం స్వీకరించిన సంప్రదాయ స్థలాలే. అవి ఆరాధనా కేంద్రాలుగ మాత్రమే కాక పరంపరాగత చరిత్రకు సాక్ష్యాలుగ కూడ నిలుస్తాయి.

అందుకే వాటిని కాపాడుకొంటే ఆజాతి నిలుస్తుంది. అవి చెదిరితే ఆజాతి కలత చెందడమే కాదు తన సహజ విలువలనే కోలుపోతుంది. దీనిని గుర్తించే అన్యమతస్థులు తమ ఆరాధనా స్థలాలను అతిజాగ్రత్తగ రక్షించుకొంటున్నారు. అన్య మతస్థుల ఆలయాలను వివిధ మార్గాలలో విధ్వంసమూ చేస్తున్నారు.

14వ శతాబ్దములో అలాంటి ఉపద్రవాన్నే మన వైదిక మతాను యాయులందరికీ మూలమూ కీలకమూ అయిన శ్రీరంగక్షేత్రం

ఎదుర్కొన్నది. ఉపద్రవాలు ఉన్నతమైన వాటికి ఎప్పుడూ వస్తూనే ఉంటాయి. ఆయా కాలాలలో ఉండే ఉత్తమ సంస్కారం కల మహానుభావులు తమ ఉపదేశములతో వాటిని ఎదుర్కోగలిగేట్టు తమ సమాజాన్ని ఉత్తేజపరుస్తూ ఉంటారు. ముష్కరమూకల బారిపడ్డ మూలకారణుడైన శ్రీ రంగనాథుని సేవలో ముందుకు నడిచేందుకు ముముక్షువులనందరినీ నిర్భయంగ ముందుకు సాగమని ప్రేరేపించే మహోద్యమంలో భగవత్ ప్రభావం అర్చామూర్తిలో ఎంతగ ప్రకటితమౌతుందో ప్రకాశింపచేస్తూ మహానుభావులైన శ్రీ వేదాన్త దేశికులు ప్రసాదించిన అద్భుత స్తోత్రరాజము ఈ అభీతిస్తవము.

ఆనాడు అన్యమతస్థుల ఆగడాలకు ఆలయాలు ఆలవాలమైతే, ఈనాడు మరొకరి అవసరం లేకుండా మనమే మన ఆరాధ్యమూర్తులను అర్చానిలయాలను అన్ని రకాలుగ అనాదరణతో అన్యాక్రాంతము చేస్తూ కొంత, అర్థార్జనపరంగ మరెంతో అవమానిస్తున్నాం. ఆనాటి ఆ దుస్థితిని దూరం చేయడానికి దేశికులు కృపచేసిన ఈ స్తోత్రరాజము, ఈనాటి దైన్య స్థితినుండి మనము ఉత్తేజితులము కాగలిగేట్టు ధైర్యాన్ని శక్తిని ప్రసాదించుగాక!

"హేమ్నః పరమోదః" అన్నట్లు బంగారంలాంటి ఈ అభీతిస్తవానికి మీరందించిన 'సంజీవనీ' కేవలం పరిమళాన్నేకాక పండితపామర వర్గాన్నంతటినీ చైతన్యవంతులను చేయుగాక!

దేవరవారిట్టి మహోపకారాలనెన్నింటినో చేసే శక్తి శ్రీరంగనాథుడనుగ్రహించుగాక!

16/2/2007

శ్రీ లక్ష్మణమూర్తి
ప్రొఫెసర్ (రిటైర్డ్)
వరంగల్లు
తేది : 13-2-2007

# పరివస్య

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।**
**వేదాన్తాచార్యవర్యోమే సన్నిధత్తాం సదాహృది ॥**

శ్రీరంగనాథ స్తుతిపరంగా సంస్కృతభాషలో పరశ్శత స్తోత్రాలు ఉన్నాయి. వానిలో 'అభీతిస్తవం' తలమానికం వంటిది. అమోఘమైన పాదుకాసహస్ర కృతిని అనుగ్రహించిన శ్రీ వేదాంత దేశికులే అభీతి స్తవాన్ని ప్రసాదించినారు.

శ్రీ దేశికులు సర్వతంత్ర స్వతంత్రులు. కవితార్కిక కేసరిగా ప్రసిద్ధినందినవారు. శ్రీమద్రామానుజుల తరువాత విశిష్టాద్వైత సిద్ధాన్త స్థాపకులలో శ్రీ వేదాంత దేశికులదే అగ్రస్థానము. కాళిదాస పద్ధతి ననుసరించి సంస్కృతమున కావ్యరచన చేసి ఆ మహాకవికి దీటని కొనియాడబడిన దేశికులు షట్శాస్త్ర పాండితీ సముద్రమును చుళికీకృతం చేసిన విపశ్చిల్లోక కుంభసంభవులు. దార్శనిక హిమవన్నగం. వారు రచించిన స్తోత్రాలు కవితాపరంగా ఎంత మృదువుగా ఉంటాయో, తత్త్వపరంగా అంత జటిలంగానూ ఉంటాయి. వాటిని వ్యాఖ్యానిరపేక్షంగా చదివి ఆనందించడం సాధ్యంకాదు, స్తోత్రాలు కేవల కవిత్వంకాదు, అవి ఆత్మోద్ధరణ సాధనాలు.

అభీతిస్తవం ప్రపన్నులకు అతిప్రియమైంది. మహానుభావులెందరో అభీతిస్తవాన్ని నిత్యం పారాయణం చేస్తారు. మహామహిమాన్వితమైన ఈ స్తవానికి శ్రీగార్గ్యవేంకటాచార్య స్వామివారు సంస్కృతంలో వ్యాఖ్యానాన్ని రచించినారు. సంస్కృత స్తోత్రాన్ని సంస్కృత వ్యాఖ్యానంతో చదివి ఆనందించేవారు కరువైపోతున్నారు. చదివేవారున్నా అది పండితలోక పరిమితమౌతుంది. అభీతిస్తవాన్ని ప్రపన్న జనావళికి

అందించాలన్న సత్సంకల్పంతో, మహితాత్ములు, తపస్సంపన్నులు ప్రపన్నులు శ్రీరంగనాథ పాదుకా నిహితచేతస్కులు శ్రీమాన్ శ్రీ కారంచేటి తిరుమల వేంకటరాఘవాచార్యస్వామివారు అజ్ఞానతిమిరోపహతులైన అస్మాదృశులను ఉద్ధరించు కోరికతో అభీతిస్తవానికి తెలుగులో "సంజీవని" వ్యాఖ్యానాన్ని అనుగ్రహించినారు. ఇంతకు ముందే వారు శ్రీ దేశికుల పాదుకాసహస్రానికి అనిదంపూర్వమైన తెలుగు వ్యాఖ్యానాన్ని రమణీయంగా విరచించి మహోపకారం చేసినారు. అభీతిస్తవానికి శ్రీమాన్ శ్రీ రాఘవాచార్యులవారి సంజీవని సమకూరడంతో బంగారానికి తావి అబ్బినట్లైంది.

## II

అభీతిస్తవం నిత్యపారాయణ స్తోత్రం. ఏ స్తోత్రమైనా కేవల కవితా సౌందర్యంతో పారాయణ యోగ్యతను సంతరించుకోజాలదు. కఠోర తపస్సు, నిష్కళంక ప్రాపంచిక జీవనం నిస్తుల ప్రపత్తి నిర్మలాంత రంగం భూమికగా ఉద్భవిస్తేనే ఆస్తోత్రం పారాయణ యోగ్యమౌతుంది. శ్రీవేదాంత దేశికుల జీవితమే ఒక తపస్సు. ప్రాపంచికమైన ఏ సుఖాన్నీ ఆశింపక, ఏరాజసత్కారానికీ ప్రలోభ పడక, ఎంతటి నిర్దయ నిరంకుశ ప్రభువుకైనా తలవంచక తమ జీవితాన్ని అసిధారావ్రతంగా ప్రతిక్షణం శ్రీరంగనాథచరణ సమర్పణంగా వెలిగిన మహామనీషి రత్నం శ్రీ దేశికులు. సన్మానాన్ని కాలకూట విషంగా భావించినవారు (సమ్మానమాయస్యహి కాలకూటః) శ్రియః పతియే వారికున్న ధనం (ధనంజయ స్యందన భూషణం ధనమ్) పిడికెడు అటుకులిస్తే కుచేలుణ్ణి కుబేరుణ్ణి చేసిన సకల జగత్పతిని వదిలి, కతిపయ గ్రామాధిపుణ్ణి దీనంగా యాచించడాన్ని నిరసిస్తూ తమ ప్రతిజ్ఞను శ్రీ దేశికులిట్లా తెల్పినారు.

**క్షోణీకోణ శతాంశ సీమితకలా దుర్వార గర్వానల**
**క్షుభ్యత్ క్షుద్రనరేంద్ర చాటు రచనాం ధన్యాం నమన్యామహే ।**
**దేవం సేవితుమేవ నిశ్చినుమహే యోఽ సౌ దయాళుః పురా**
**ధానాముష్టిముచే కుచేలమునయే ధత్తేస్మ విత్తేశతామ్ ॥**

అంతటి మహానుభావులు రచించిన స్తోత్రానికి తెనుగున వ్యాఖ్యానాన్ని సంతరించడానికి కావలసిన అమోఘ గుణాలన్నీ శ్రీ రాఘవాచార్యుల వారియందు నెలకొని ఉన్నాయి. నిశ్చయంగా వారొకరే ఆసత్కార్య నిర్వహణకు అర్హులు. అభీతి స్తవానికి వారు సంజీవనీ వ్యాఖ్యను అనుగ్రహించడం మన అదృష్టం.

# III

సంధి సమాసాదులను విడమర్చి చెప్పడం టీకాతాత్పర్యాలను క్లుప్తంగా వ్రాసి విశేషాంశాలని పాఠకుని ఊహకు వదిలివేయడం వ్యాఖ్యాన రచనలో పరిపాటి. శ్రీమాన్ శ్రీ రాఘవాచార్యులవారి వ్యాఖ్యాన పద్ధతి ఇందుకు భిన్నమైంది, విశిష్టమైంది.

పాదుకాసహస్ర శ్లోకాలను వ్యాఖ్యానించే సమయంలోనూ, అభీతిస్తవ సంజీవనిలోనూ వారు అనుసరించిన పద్ధతి గొప్పది. ఏ స్తోత్రాన్ని వ్యాఖ్యానించినా ఆ స్తోత్రానికి మూలభూతమైన సిద్ధాంతాన్ని సంప్రదాయాన్ని తేటతెల్లం చెయ్యాలి. అందుకే శ్రీ ఆచార్యులవారు విశిష్టాద్వైత సంప్రదాయ విశేషాలనెన్నింటినో పాదుకా సహస్ర రమణీయ వ్యాఖ్యలో, సంజీవనిలో విశదీకరించినారు. అనూచానంగా లభించే ఈ విశేషాలు గ్రంథస్థమైతే తరతరాలకు నిల్చిపోతాయి. అది గొప్ప సేవ.

భక్తి, ప్రపత్తి, భరన్యాసం, మోక్షం, షాడ్గుణ్య సంపత్తి ఆచార్యానుగ్రహం మొదలైన విషయాలను ప్రసన్నంగా వివరించినారు. ప్రతి శ్లోకంలోనూ నిబద్ధమైన శబ్దప్రయోగ ఔచిత్యాన్ని, సంప్రదాయ వైశిష్ట్యాన్ని తెలియపరచినారు. వారి వ్యాఖ్యాన శైలి సులభంగా సరళంగా సాగిపోతూ మనల్ని చివరిదాకా అప్రయత్నంగా చదివిస్తుంది. దివ్య ప్రబంధాల నుండి పుంఖాను పుంఖంగా ఎన్నో పంక్తులను ఉదహరించి వాటి సౌందర్యాన్ని వెలార్చినారు. వారికి మనమంతా శాశ్వతంగా అధమర్ణులం.

# IV

అభీతిస్తవంలో 29 శ్లోకాలున్నాయి. అవి పృథ్వీ వృత్తంలో వ్రాయబడ్డాయి. మొదటి శ్లోకంలో మొదటి పదం 'అభీతి'. ఈ స్తోత్రానికి అందుకే అభీతి స్తోత్రమని పేరు కలిగింది. శ్రీ దేశికులు దీనిని "శ్రీరంగభర్తుః స్తుతిః" అనే అన్నారు. చివరి శ్లోకంలో చివరిపదం 'గోపాయతి'. అభీతి - గోపాయతి కలిపి భావిస్తే భయం లేకుండా చేసి రక్షిస్తాడు (శ్రీరంగనాథుడు) అని తెలుస్తుంది,

శ్రీరంగక్షేత్రానికి దుర్మార్గుల వలన భయముత్పన్నమైన వేళ శ్రీ దేశికులు, శ్రీరంగనాథులకు శ్రీరంగక్షేత్ర రక్షణార్థమై, చేసిన విన్నపమీ స్తవం.

అభీతి స్తవాన్ని పారాయణ చేస్తే శ్రీరంగక్షేత్రానికి అభయప్రదానం చేసిన విధంగా, శ్రీరంగనాథ స్వామివారు ప్రపన్నులను రక్షిస్తారనడంలో సందేహం లేదు.

అభీతి స్తవాన్ని ముగించేముందు 28వ శ్లోకంలో (మొత్తం 29 శ్లోకాలు) శ్రీరంగనాథస్వామివారికి శ్రీ దేశికులు చేసికొన్న విన్నపం హృదయావర్జకంగా ఉంటుంది.

**యతి ప్రవరభారతీ రసభరేణ నీతం వయః**
**ప్రఫుల్ల పలితం శిరః పదమిహాక్షమం ప్రార్థయే ।**
**నిరస్తరిపుసంభవే క్వచన రంగముఖ్యేవిభో!**
**పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ॥**

శ్రీ ఆచార్యుల వారి తాత్పర్యం : "యతీశ్వరులైన భగవద్రామానుజుల శ్రీ సూక్తుల యందలి రసాన్ని ఆస్వాదించడం చేతనే వయస్సు గడిచింది. తల ముగ్గు బుట్ట అయింది. సముచిత స్థానమందు నివసింపకోరుతున్నాను. శత్రు భయంలేని శ్రీరంగక్షేత్రమందు పరస్పర శ్రేయస్సును అభిలషించే వారున్నచోట నన్ను వర్తింపజేయవయ్యా! శ్రీ రంగనాథా!"

ఁ

# V

శ్రీమాన్ శ్రీ రాఘవాచార్యులుగారు ఈ వ్యాఖ్యాన రూపంగా శ్రీరంగనాథ కైంకర్యం చేసి ధన్యులైనారు. తమ తండ్రిగారి సంజీవనీ వ్యాఖ్యను ముద్రించి శ్రీ కె.వి. రమణాచార్యులు ఐ.ఏ.ఎస్. గారు పుష్కలమైన సుకృతాన్ని పొందినారు. నాకీ నాలుగు మాటలు వ్రాసే అవకాశాన్ని కల్పించి నన్ను కృతార్థుణ్ణి చేసినారు. శ్రియఃపతి శుభోదర్క సంపత్సమృద్ధితో వారిని అనుగ్రహించుగాత.

"శ్రీమన్ శ్రీరంగశ్రియమనుపద్రవాం అనుదినం సంవర్ధయ"

**శుభం భూయాత్**

ప్రొఫెసర్ ఎస్. లక్ష్మణమూర్తి (రిటైర్డ్)

5-11-674, విద్యారణ్యపురి,

వరంగల్ - 506 009

ఫోన్ : 0870-2579852

సెల్ : 9440162585



శ్రీశోఌవ్యాత్

# భూమిక

"ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతికు తశ్చన" (తై. ఉపనిషత్తు)

శ్రీ వ్యాస మహర్షి వేదాచార్యులని, వేద ప్రతిపాద్యుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాచార్యుడని కీర్తింపబడినారు. సంస్కృత ద్రావిడ ఉభయ వేదాన్త రహస్యాలను చక్కగా నిరూపించడంచేత శ్రీమద్వేంకటనాథార్యులకు 'వేదాన్తాచార్య వర్యు'లని యోగరూఢమైన నామధేయం. అర్చామూర్తియైన శ్రీరంగనాథుని శ్రీముఖంగా 'వేదాన్తాచార్య' సంజ్ఞతనకు సిద్ధించిందని 'అధికరణసారావళి' అనే తమ గ్రంథంలో విశదపరచారు.

శ్రీ వేదాన్త దేశికులు అనుగ్రహించిన స్తోత్రాలలో 'అభీతిస్తవం' విశిష్టలక్షణం కలిగియున్నది. నిరీశ్వరవాదులు ప్రబలి, సనాతన ధర్మాలకూ, సాధువులకూ భయోత్పాతంకలుగుతున్న సమయాన మానవాళికి అభయాన్ని - భయనివృత్తిని - ప్రసాదించుమని శ్రీరంగనాథ భగవానుణ్ని ప్రార్థించే స్తోత్ర గ్రంథమిది.

క్రీ.శ. 14వ శతాబ్దిలో 'ఢిల్లీ' నుంచి 'మాలిక్ కఫూర్' అనే ముష్కర తురుష్కుడు దక్షిణా పథానికి దండెత్తి వచ్చాడు. మధుర శ్రీరంగంపైన దాడిజరుపడానికి సమీపిస్తున్నాడనే వార్త తెలిసింది. శ్రీరంగక్షేత్రంలో ఉత్సవం జరుగుతున్న సమయమది. ఆచార్యులు సమావేశమై తమ ప్రాణాలను ఒడ్డియైనా, శ్రీరంగమందిరాన్ని రక్షించుకోవాలని నిశ్చయించి, మూడు వర్గాలుగా ఏర్పడినారు.

శ్రీ సుదర్శన సూరి నాయకత్వాన శ్రీరంగశాయి మూలవరులను భద్రపరచుకోవడానికి గర్భగృహద్వారాన్ని రాతిగోడతో మూసియుంచతలచారు. రెండవ వర్గం శ్రీ పిళ్ళైలోకాచార్యుల నాయకత్వంలో ఉత్సవ విగ్రహాలను (నంబెరుమాళ్ళను) పల్లకిలో వేంచేపించి దక్షిణదిశకు తీసుకొని పోయి భద్రపరచాలి. మూడవ వర్గం, ఉత్తర దిశకు వెళ్ళి, రెండవ వర్గంవారు పల్లకితో దూరప్రాంతం చేరే వరకైనా, శత్రుమూకను మార్కొన దలచింది.

భగవద్రామానుజుల వారి శ్రీభాష్యానికి విపుల వ్యాఖ్యను "శ్రుత ప్రకాశిక"ను వ్రాసిన శ్రీ సుదర్శన సూరి, తన వ్రాత ప్రతిని, ఇంక తన ఇద్దఱు పుత్రులను రక్షించుమని వేదాన్త దేశికులకు అప్పగించారు.

తురుష్కుల దండయాత్రలో మహానుభావులెందరో అసువులు బాసినారు. శ్రీ సుదర్శనసూరి మొదలైన ప్రసిద్ధ పండితులు శత్రువుల కత్తులకు బలి అయ్యారు. శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు దారిలో 'జ్యోతిష్కుడి' అనే క్షేత్రంలో పరమపదించారు. శ్రీ వైష్ణవులు దూరంగా సంచరిస్తూ నంబెరుమాళ్ళను తిరుమలకు చేర్చారు. ఉత్సవ మూర్తులు చాలా కాలం తిరుమలలోనే తిరువారాధనను స్వీకరించారు. ఇప్పుడా స్థలానికి 'రంగమంటపం' అని పేరు.

శ్రీ దేశికులవారు అత్యంత ధైర్యంతో ఉత్తర కావేరి ఆవలి తీరం వెంట శత్రువలయం నుంచి తప్పించుకొంటూ, పడమటి దిక్కున పయనించారు.

**"ఆచ్ఛాద్య స్వతనుం శవైశ్చ తదధః సంస్థాప్య తత్ పుస్తకం,**
**వేదాన్తార్యగురూ ররక్షచ పునః సంచారయామాసతత్ ॥"**

దేశికులు, పగలు సూరి పుత్రులను ఇసుకలో పడుకోబెట్టి, ఆకులును కొమ్మలును కప్పివేసేవారు. తాము మాత్రం ఆ పుస్తకాన్ని ఇసుకలో పెట్టి, దానిపై పడుకొని, తమపైన శవాలను కప్పుకొని, చీకటి పడగానే లేచి మళ్ళీ పయనించేవారు. ఘోర విపత్సమయాన ఈ విధానాన్ని ఆపద్ధర్మంగా భావించి, బృహద్గ్రంథాన్ని సూరి పుత్రులనూ కాపాడి దేశికులు శ్రీమద్రామానుజ దర్శనాన్ని వృద్ధిపరచిన మహోపకారకులు.

దేశికులు కొన్ని రోజులు పయనించి (కర్నాటకం) 'సత్యకాలం' అనే గ్రామానికి చేరినారు. అది పవిత్ర తీర్థ క్షేత్రం. గ్రామస్థులు ధార్మికులు అక్కడ ప్రవహిస్తున్న ఏటి తేట నీటిలో స్నానం చేసి, గట్టున ఉన్న రెండు అశ్వత్థ వృక్షాలమధ్య ప్రదేశమందు ఆసీనులై నిత్యానుష్ఠానం ఆచరించేవారు. ఆ ఊరి దేవాలయంలో శ్రీ వరదరాజ పెరుమాళ్ళను నిత్యం ఆరాధించేవారు. ఆ 'సత్యకాల' క్షేత్రమందే 'అభీతి స్తవం' దేశికులచే రచింపబడింది.

'అభీతి స్తవం'లో 29 శ్లోకాలు ఒక్క 'పృథ్వీ' వృత్తంలోనే రచింపబడినాయి. మొదటి 10 శ్లోకాలలో పరంజ్యోతీ రూపుడైన శ్రీ రంగనాథుని కల్యాణ గుణాలను

స్మరిస్తూ కీర్తిస్తున్న వారిని రక్షించే దయాళువు స్వామి అని స్తుతించారు.

11-19 శ్లోకాలలో ప్రాపంచిక విషయానుభవాల వల్లనూ, ఆభాన బంధువులవల్లనూ, స్వర్గనరకాల వల్లనూ కలిగే భయం నుంచి విముక్తిని ప్రసాదించుమని నుతించారు. 20-25 శ్లోకాలలో విభవావతారమందు స్వామి శరణాగత ధర్మాన్ని ప్రకటించి, సకల జనులకు అభయ ప్రదానం చేసినవాడనీ, ప్రహ్లాదాది భక్తులను రక్షించినవాడనీ, లోకంలో కలిగిన ఉపద్రవాన్ని తొలగించుమని ప్రార్థించారు. ముఖ్యంగా, 22 వ శ్లోకంలో విజృంభించిన శత్రువులను నశింపజేసి శ్రీరంగమందు శ్రీ వైష్ణవశ్రీని వృద్ధిపరచుమని స్వామిని ప్రార్థించడం వల్ల ఈ స్తోత్ర కావ్యం ఆవిర్భవించడానికి ప్రాధాన్యం గమనింపబడుతుంది.

మిగత శ్లోకాలలో భగవద్రామానుజుల శ్రీసూక్తులను ఆవృత్తి చేయడంతో తమ వయస్సంతా గడిచిందనీ, శేష జీవితం పరస్పర హితైషుల సాంగత్యంతో గడిచే విధంగా అనుగ్రహించుమని వేడుకొన్నారు. 'అభీతి' పదంతో ఆరంభమై 'గోపాయతి' పదంతో స్తోత్రం పూర్తి అయింది.

దేశికులు ఈ స్తోత్రాన్ని రచించిన తర్వాత స్వయంగా నిత్యం పారాయణం చేసేవారు. 'సత్యకాల' క్షేత్రంలో దేశికుల కాంస్య విగ్రహం, శుభవార్త అందగానే శ్రీరంగానికి పయనమయ్యే రీతిగా నిల్చియున్నట్లున్నదట.

ఆగ్రామస్థులు యాత్రికులకు దేశికుల స్నానఘట్టం మొదలైన వ్రత నియమస్థలాలను సాదరంగా చూపిస్తుంటారు.

ఒక తపం అంటే 12 ఏండ్ల కాలం గడచిన తర్వాత శుభవార్త అందింది. చెంజి నాయకుడైన 'గోపణ్ణ' అనే యాదవరాజు దేశికుల ఆదేశానుసారంగా శ్రీరంగంనుంచి శత్రువులను పారద్రోలాడు. పరమభక్తురాలైన ఒక దేవదాసి తురుష్కనాయకుణ్ని తన చాతుర్యంతో వశపరుచుకొన్నది. గోపురమెక్కించి అతణ్ని క్రిందికి త్రోసివేసి, తానుకూడా దూకి తనువును చాలించిందట. దక్షిణ భారతంలో తురుష్కుల దండయాత్ర ఒకతపంకాదు, ఒక తరం అంటే 24 ఏండ్లు జరిగింది.

క్రీ.శ. 1365లో శుభవార్తను విన్న దేశికులవారు 'సత్యకాలం' నుంచి పయనమై గోపన్న సాయంతో తిరుమల నుంచి నంబెరుమాళ్ళను శ్రీరంగానికి తెచ్చి, రాతి గోడను తొలగించి, పునః ప్రతిష్ఠ చేశారు.

శ్రీరంగనాథునికి గోపన్న చేసిన గొప్ప కైంకర్యానికి కృతజ్ఞతా సూచకంగా అనుగ్రహించిన శ్రీరంగమందిరంలో వెలుపలి గోడపైన చెక్కబడిన రెండు శ్లోకాలను నేడు కూడా మనం చూడవచ్చు. అవే ఇవి.

1. ఆనీయానీలశృంగ ద్యుతిరచిత జగద్రంజనా దంజనాద్రేః
చెంజ్యామారాధ్య కంచిత్సమయమథనిహత్యోద్ధనుష్కాన్ తురుష్కాన్ ।
లక్ష్మీక్ష్మాభ్యాముభాభ్యాం సహ నిజనగరేస్థాపయన్ రంగనాథం
సమ్యగ్వర్యాం సపర్యాం పునరకృత యశోదర్పణో గొప్పణార్యః ॥

2. విశ్వేశం రంగరాజం వృషభగిరి తటాత్ గొప్పణక్షోణి దేవో
నీత్వాస్వాం రాజధానీం నిజబల నిహతోత్సిక్త తౌరుష్క సైన్యః ।
కృత్వా శ్రీరంగ భూమిం కృతయుగ మహితాం తంచ లక్ష్మీమహీభ్యాం,
సంస్థాప్యాస్యాం సరోజోద్భవ ఇవ కురుతేసాధుచర్యాం సపర్యాం॥

(1) తా॥ కీర్తిదర్పణమైన గొప్పనార్యుడు నీలశిఖరాల కాంతిచే లోకాన్ని రంజింపజేస్తున్న అంజనాద్రి నుంచి శ్రీరంగనాథస్వామిని చెంజి దుర్గానికి వేంచేపింపజేసి కొంతకాలమక్కడనే తిరువారాధన సమర్పింపజేశాడు. సాయుధ తురుష్కులను తరిమి వేసిన తర్వాత శ్రీ భూపత్నులతో సహ శ్రీరంగనాథ పెరుమాళ్ళను రంగమందిర మందు ప్రతిష్ఠించి యథావిధి పూజలు జరిపించిన మహోపకారకుడు.

(2) తా॥ గోపన్న అనే ద్విజుడు విశ్వాధీశుడైన శ్రీరంగనాథస్వామిని తిరుమల నుంచి తన రాజధానికి చేర్చాడు. తన సైన్యంతో శత్రువులను హతమార్చాడు. లక్ష్మీభూపిరాట్టులతోపాటు స్వామిని శ్రీరంగక్షేత్రమందు కృతయుగ మహిమలాగా పునః ప్రతిష్ఠించి బ్రహ్మదేవునివలె అతడు శాస్త్ర విహితంగా ఉత్సవాది పూజలను చేశాడు.

ఈ విపత్కర స్థితిలో 'అభీతిస్తవం' అవతరించి, లోకంలో సకల భయాలను తొలగించింది. ఆనందహేల వెల్లివిరిసింది. దేశికులు స్వయంగా ఈ స్తవాన్ని పారాయణచేసి ఫలం పొందినట్లే, ప్రజలను (పఠత) 'పఠించండి' అంటూ సంసార జనిత భయం నుంచి విముక్తిని పొందగలరనే అధ్యవసాయంతో ప్రోత్సహించారు.

ఇంత గొప్ప మహిమగలిగిన అభీతిస్తవానికి సంజీవనీ వ్యాఖ్య భగవద్భాగవతాచార్య కృపచేత రచింపబడింది. గార్గ్య శ్రీ వేంకటాచార్యులచేత

రచింపబడిన సంస్కృత వ్యాఖ్యను కూడా భద్రపరచి భావితరం వారికి అందజేయడం స్వధర్మమనే విశ్వాసంతో చివరకు జతపర్చబడమయినది. పారాయణం చేసినవారు భగవదనుగ్రహానికి పాత్రులై 'అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి, చేత సుఖమయ జీవితాన్ని అనుభవిస్తారు.

కరీంనగరం జిల్లా, పెద్దపల్లి నివాసులు, ప్రసిద్ధ న్యాయవాదిగా కీర్తిశేషులైన శ్రీ మందల విలాసరెడ్డిగారి దివ్యస్మృత్యర్థం, వారి ధర్మపత్ని శ్రీమతి వృషాదేవి సత్సంకల్పం వల్ల వారి సంతానం శ్రీ యం. సునీల్‌రెడ్డి మరియు శ్రీ యం. అనిల్ రెడ్డి (సోదరులు) తమ పవిత్ర ధనాన్ని వినియోగించి 'అభీతి స్తవ' గ్రంథాన్ని ప్రకాశింపజేశారు. వారికి శ్రీరంగనాథుడు ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించి, సకలాభీష్ట సిద్ధిని కలిగించుగాక.

అహో భగవతః కృపాభర సమీక్షణే నోత్థితా
గురో శ్చరణ సేవయా విలసితైవ సంజీవనీ।
అభీతినుతి మాశ్రితా కృపణ రాఘువార్యేణసా
ముదేసుకృతినాం సతాం విరచితా సుఖప్రాప్తయే॥

"దోషాన్ క్షంతుమర్హంతి సంతః"

మహాశివరాత్రి, 2007

భాగవత చరణరేణువు
**కె.వి. రాఘవాచార్యులు**



# కృతజ్ఞతా నివేదనము

శ్రీమదహోబిల మఠం 45వ పీఠాధిపతులు శ్రీవణ్ శఠకోప శ్రీ నారాయణ యతీంద్ర మహాదేశికులవారు ఈ 'అభీతి స్తవము'నకు శ్రీముఖపత్రమును కృపజేసినారు. వారి పాదపద్మములకు సాష్టాంగ ప్రణామములర్పిస్తున్నాను.

సకల జనోద్ధరణార్థం గ్రామైకరాత్రంగా సంచరిస్తూ బహుకార్య ధురంధరులై యున్ననూ కృపతో మంగళాశాసనములు అనుగ్రహించిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి దివ్యచరణారవింద సన్నిధిలో సప్రశ్రయ ప్రణామములర్పిస్తున్నాను.

అవ్యాజకృపాపూర్ణులు, మహావ్యాఖ్యాతలు, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల సాహిత్యోపన్యాసకులు, డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు, ఎన్ని ఒత్తిడులున్ననూ, గార్గ్య శ్రీ వేంకటాచార్య విరచిత సంస్కృత వ్యాఖ్యాన (వ్రాత) ప్రతిని కృపజేసినారు. వారి సన్నిధిలో వినయ పూర్వకముగా కృతజ్ఞతాంజలులను నివేదించుకొంటున్నాను.

అస్మచ్ఛ్రేయోభిలాషులైన విద్వద్వరులు, శ్రీ లక్ష్మణమూర్తి ప్రొఫెసర్ (రిటైర్డ్) వరంగల్ గారు సంజీవనీ వ్యాఖ్యను పరిశీలించి, తమ అమూల్యమైన (వరివస్య) అభిప్రాయమును అతి త్వరగా అందజేసినారు. ఆస్వామివారి సన్నిధిలో పరశ్శత ప్రణామములను సప్రశ్రయముగా సమర్పించుకొంటున్నాను.

నా రచనా వ్యగ్రతకు సానుకూలముగా స్పందిస్తున్న చి॥ తమ్ములకు, తనయులకు కృతానేకాశీస్సుమనస్సులు.

గ్రంథమును త్వరగా ముద్రించుటకై అన్ని విధాలా సహాయపడిన చి॥ రామిడి వేంకటరాంరెడ్డికి అనేక మంగళాశాసనములు.

తక్కువ సమయమున ఎక్కువగా శ్రమపడి గ్రంథమును అందముగా ముద్రించిన 'వాగ్దేవి ప్రింటర్స్' అధినేతలు చి॥ పి. వాసుదేవరావు, శ్రీధర్‌రావు, వారి సిబ్బందికి హార్దిక ధన్యవాదములు.

వ్యయ, మహాశివరాత్రి
శుక్రవారం, 16 ఫిబ్రవరి 2007

బుధజనవిధేయుడు
**కె.వి. రాఘవాచార్యులు**
C/o Sri K.V. Ramanachary IAS
B.H. 3/6 IAS Officers Qts.
Road No.10, Banjara Hills, Hyd-34.
Ph : 23350258 Cell : 98480 98990





श्री:

श्रीमते श्री लक्ष्मीनृसिंह परब्रह्मणेनम:

श्रीमते रामानुजाय नम:

श्रीमते वेदान्त गुरवे नम:

श्रीमदहोबिल मठे पंचचत्वारिंश पदे मूर्धाभिषिक्तानां

श्रीमतां श्रीलक्ष्मी न्हसिंह दिव्यपादका सेवक

श्रीवण् शठकोप श्री नारायण यतीन्द्र महोदशिकानां

# श्रीमुखपत्रम्

श्रीमद्भगवत: कृपया सकलचेतनोज्जीवनाय अवतीर्णै: श्रीमद्वेदान्त देशिकाचार्यै: अनुगृहीतेषु स्तोत्रग्रन्थेषु एकैकग्रन्थ: चतुर्विधपुरुषार्थान् ददातीति जानंति तत्त्व दर्शिन:। तेषु अन्यतमोऽयमभीतिस्तव: चारित्रकांशविशिष्ट: ''यदाह्येवैष एतस्मिन्नदृश्येऽनात्म्येऽ निरुक्ते ऽ निलयने ऽ भयं प्रतिष्ठां विन्दते, अथसो ऽ भयं गतो भवति। यदाह्येवैष एतस्मिन्नुदरमंतरं कुरुते, अथ तस्य भयं भवति'' इत्युपनिषदर्थं प्रतिपादयति।

अभीतिस्तव: श्रीरंगनाथस्य अभयमुद्राया: महिमानम् प्रकाशयति। प्रसिद्धै: पंडितै: उ.वे.श्री.के.वि. राघवाचार्यै: अभीतिस्तवस्य 'संजीवनी' नाम्नी समीचीना व्याख्या आन्ध्र व्यवहार भाषायां विरचिता। ग्रन्थोऽय मेधतां शरदां शतम्। इमे आचार्या: ईदृशेषु आध्यात्मिक ग्रन्थरचनेषु लब्धवकाशा: विराजन्तु।

व्याख्यासहितमिमं अभीतिस्तवं सर्वे जना: अनुदिनम् पारायणं कुर्वन्त: अभयं प्राप्नुवन्तु, सर्वमंगल भागिनश्च भवन्त्वि त्याशास्महे।

**Sd/-**

**HIS HOLINESS**

**45th JEER OF SRI AHOBIL MATT.**

1. అభీతి రిహ యజ్జుషాం యదవ ధీరితానాం భయం
భయా భయ విధాయినో జగతి యన్నిదేశే స్థితాః ।
తదేత దతి లంఘిత ద్రుహిణ శంభు శక్రా దికం
రమా సఖ మధీమహే కి మపిరంగ ధుర్యం మహః ॥

2. దయా శిశిరితా శయా మనసి మే సదా జాగ్రుయుః
శ్రియాఽఽద్యుషిత వక్షసః శ్రిత మరుద్వృధా సైకతాః ।
జగద్దురిత ఘస్మరా జలధి డింభ దంభ స్పృశః
సకృత్ప్రణత రక్షణ – ప్రథిత సంవిద స్సంవిదః ॥

3. యదద్య మితబుద్ధినా బహులమోహ భాజామయా
గుణగ్రథిత కాయ వాఙ్మనస వృత్తి వైచిత్ర్యతః ।
అతర్కిత హితాహిత క్రమ విశేష మారభ్యతే
తదప్యు చిత మర్చనం పరిగృహాణ రంగేశ్వర ॥

4. మరుత్త రణి పావక త్రిదశ నాథ కాలాదయః,
స్వకృత్య మధికుర్వతే త్వదపరాధతో బిభ్యతః ।
మహత్ కిమపి వజ్ర ముద్యత మివేతి యచ్ఛ్రూయతే,
తరత్యనఘ ! తద్భయం య ఇహ తావకఃస్తావకః ॥

5. భవంత మిహయః స్వధీ – నియత చేతనా చేతనం,
పనాయతి నమస్యతి స్మరతి వక్తి పర్యేతివా ।
గుణం కమపి వేత్తి వా తవ గుణేశ! గోపాయితుః,
కదాచన కుతశ్చన క్వచన తస్యన స్యాత్ భయమ్ ॥

6. స్థితే మనసి విగ్రహే గుణిని ధాతు సామ్యేసతి
స్మరేదఖిల దేహినం య ఇహ జాతుచిత్ త్వామజమ్ ।
తయైవ ఖలు సన్దయా తమథ దీర్ఘ నిద్రావశం
స్వయం విహిత సంస్మృతి ర్నయసి ధామ నైశ్రేయసమ్ ॥

7. రమాదయిత ! రంగభూ రమణ ! కృష్ణ! విష్ణో ! హరే!
త్రివిక్రమ ! జనార్దన ! త్రియుగ నాథ ! నారాయణ !
ఇతీవ శుభదాని యః పఠతి నామధేయానితే
న తస్య యమవశ్యతా నరకపాత భీతిః కుతః ॥

8. కదా చిదపి రంగభూరసిక! యత్ర దేశే వశీ
త్వదేక నియతా శయ స్త్రిదశ వందితో వర్తతే ।
తదక్షత తపోవనం తవచ రాజధానీ స్థిరా
సుఖస్య సుఖమాస్పదం సుచరితస్య దుర్గం మహత్ ॥

9. త్రివర్గ పథవర్తినాం త్రిగుణ లంఘనోద్యోగినామ్
ద్విషత్ ప్రమథనార్థినా మపిచ రంగదృశ్యోదయాః ।
స్ఖలత్ సమయకాతరీ హరణ జాగరూకాః ప్రభో
కరగ్రహణ దీక్షితాః క ఇవతే న దివ్యా గుణాః ॥

10. బిభేతి భవభృత్ ప్రభో! త్వదుపదేశ తీవ్రౌషధాత్
కదధ్వ రస దుర్విషే బడిశ భక్షవత్ ప్రీయతే।
అపథ్య పరిహారధీ విముఖ మిత్థ మాకస్మికీ
తమ పృవసరేక్రమా దవతి వత్సలా త్వద్దయా ॥

11. అపార్థ ఇతి నిశ్చితః ప్రహరణాది యోగస్తవ
స్వయం వహసి నిర్భయ స్తదపి రంగపృథ్వీ ధర !
స్వరక్షణ మివాభవత్ ప్రణత రక్షణం తావకం
యదాత్థ పరమార్థవిత్ నియత మంతరాత్మేతి తే ॥

12. లఘిష్ఠ సుఖ సంగతైః స్వకృత కర్మ నిర్వర్తితైః
కళత్ర సుత సోదరానుచర బంధు సంబంధిభిః ।
ధన ప్రభృతికై రపి ప్రచుర భీతి భేదోత్తరైః
న బిభ్రతి ధృతిం ప్రభో! త్వదనుభూతి భోగార్థినః ॥

13. న వక్తుమపి శక్యతే నరక గర్భ వాసాదికం
వపుశ్చ బహుధాతుకం నిపుణ చింతనే తాదృశమ్ ।
త్రివిష్టపముఖం తథా తవ పదస్య దేదీప్యతః
కి మత్ర న భయాస్పదం భవతి రంగ పృథ్వీ పతే ॥

14. భవంతి ముఖ భేదతో భయని దానమేవ ప్రభో !
శుభాశుభ వికల్పితాః జగతి దేశకా లాదయః ।
ఇతి ప్రచుర సాధ్వసే మయి దయిష్యసే త్వంనచేత్
క ఇత్థ మనుకంపితా త్వదను కంపనీయశ్చకః?

15. సకృత్ ప్రపదన స్పృశా మభయ దాన నిత్యవ్రతీ ।
నచ ద్విరభి భాషసే త్వమితి విశ్రుతః స్వోక్తితః ।
యథోక్త కరణం విదుః తవతు యాతుధానాదయః ।
కథం వితథమస్తు తత్ కృపణ సార్వభౌమేమయి ॥

16. అనుక్షణ సముత్థితే దురితవారిధౌ దుస్తరే
యది క్వచన నిష్కృతి ర్భవతి సాఽపిదోషావిలా ।
తదిత్థ మగతౌ మయి ప్రతి విధాన మాధీయతాం
స్వబుద్ధి పరికల్పితం కిమపి రంగధుర్య! త్వయా ॥

17. విషాద బహుళాదహం విషయవర్గతో దుర్జయాత్
బిభేమి వృజినోత్తర స్త్వదనుభూతి విచ్ఛేదతః ।
మయా నియత నాథవాన్ అయ మితిత్వమర్థాపయన్
దయాధన! జగత్పతే! దయితరంగ సంరక్షమామ్ ॥

18. నిసర్గ నిరనిష్టతా తవ నిరం హసః శ్రూయతే
తత స్త్రియుగ! సృష్టివత్ భవతి సంహృతిః క్రీడితమ్ ।
తథాఽపి శరణాగత ప్రణయ భంగ భీతో భవాన్
మదిష్ట మిహయద్భవేత్ కిమపి మాస్మత జ్జీహపత్ ॥

19. కయాధు సుత వాయస ద్విరదపుంగవ ద్రౌపదీ
విభీషణ భుజంగమ వ్రజగణాంబరీషా దయః ।
భవత్పద సమాశ్రితా భయ విముక్తి మాపుర్యథా
లభేమహి తథా వయంసపదిరంగధుర్య! త్వయా ॥

20. భయం శమయ, రంగధామ్న్యని తరాభిలాష స్పృశాం
శ్రియం బహుళయ ప్రభో! శ్రిత విపక్షము న్మూలయ ।
స్వయం సముదితం వపుస్తవ నిశా మయంతః సదా
వయం త్రిదశ నిర్వృతిం భువి ముకుంద! విందే మహి ॥

21. శ్రియః పరబృఢే త్వయి శ్రిత జనస్యసంరక్షకే
సదద్భుత గుణోద ధావితి సమర్పితోఽ యంభరః ।
ప్రతిక్షణ మతః పరం ప్రథయ రంగధామాదిషు
ప్రభుత్వమను పాధితం ప్రథిత హేతిభిర్వైతిభిః ॥

22. కలిప్రణిధి లక్షణైః కలిత శాక్య లోకాయతైః
తురుష్కయవనాదిభి ర్జగతి జృంభమాణం భయమ్ ।
ప్రకృష్ట నిజశక్తిభిః ప్రసభ మాయుధైః పంచభిః
క్షితి త్రిదశ రక్షకైః క్షపయ రంగనాథ! క్షణాత్ ॥

23. దితిప్రభవ దేహభి ద్దహన సోమ సూర్యాత్మకం,
తమః ప్రమథనం ప్రభో ! సముదితాస్త్ర బృందం స్వతః ।
స్వవృత్తి వశవర్తి తత్రి దశవృత్తి చక్రం పునః,
ప్రవర్తయతు ధామ్నితే మహతి ధర్మ చక్ర స్థితిమ్ ॥

24. మనుప్రభృతి మానితే మహతి రంగధామాదికే,
దనుప్రభవ దారుణైర్దర మదీర్యమాణం పరైః ।
ప్రకృష్ట గుణక! శ్రియా వసుధయా చ సంధుక్షితః,
ప్రయుక్త కరుణోదధిః ప్రశమయ స్వశక్త్యా స్వయమ్ ॥

25. భుజంగమ విహంగమ ప్రవర సైన్య నాథాః ప్రభో !
తథైవ కుముదాదయో నగర గోపుర ద్వారపాః ।
అచింత్య బల విక్రమా స్త్వమివ రంగ సంరక్షకాః,
జితంత ఇతి వాదినో జగదనుగ్రహే జాగ్రతి ॥

26. విధిస్త్రి పురమర్దనస్త్రిదశ పుంగవః పావకో,
యమప్రభృతయోఽపి యద్విమత రక్షణే నక్షమాః ।
రిరక్షిషతియ త్రచ ప్రతి భయం నకించిత్ క్వచిత్,
స నః ప్రతిభటాన్ ప్రభో ! శమయ రంగధామాదిషు ॥

27. సకైటభ తమో రవి ర్మధుపరాగ ఝంఝామరుత్,
హిరణ్య గిరి దారణ స్త్రుటిత కాలనేమి ద్రుమః ।
కిమత్ర బహునా! భజత్ భవ పయోధి ముష్టింధయః
త్రివిక్రమ! భవత్క్రమః క్షిపతుమంక్షు రంగద్విషః ॥

28. యతి ప్రవర భారతీ రసభరేణ నీతం వయః
ప్రపుల్ల పలితం శిరః పద మిహాక్షమం ప్రార్థయే ।
నిరస్త రిపుసంభవే క్వచన రంగ ముఖ్యే విభో!
పరస్పర హితైషిణాం పరిసరేషు మాంవర్తయ ॥

29. ప్రబుద్ధ గురు వీక్షణ ప్రథిత వేంకటేశోద్భవాం,
ఇమామభయ సిద్ధయే పఠతరంగ భర్తుః స్తుతిమ్ ।
భయంత్యజత భద్ర మిత్యభిదధత్సవః కేశవః,
స్వయం ఘనఘృణానిధి ర్గుణ గణేన గోపాయతి ॥



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమన్ని గమాంత మహాదేశికాయ నమః

శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః

శ్రీ రంగనాయకీ సమేత శ్రీ రంగనాథ పరబ్రహ్మణే నమః

## శ్రీ వేదాన్త దేశిక ప్రణీత అభీతి స్తవః (సంజీవనీ వ్యాఖ్యా విలసితః)

శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాన్తా చార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది ॥

1. **అభీతి రిహ యజ్జుషాం యదవ ధీరితానాం భయం**
**భయా భయ విధాయినో జగతి యన్నిదేశే స్థితాః ।**
**తదేత దతి లంఘిత ద్రుహిణ శంభు శక్రా దికం**
**రమా సఖ మధీమహే కి మపిరంగ ధుర్యం మహః ॥**

**అభీతిః - ఇహ = ఈ లోకమందు**; **యత్+జుషాం** = ఎవరిని సేవించిన వారికి; **అభీతిః = భయము లేకుండునో**; **యత్+అవధీరితానాం** = ఏ దేవదేవునిచే ఉపేక్షింపబడిన **వారికి, భయం = భయం** కలుగునో; జగతి = ప్రపంచంలో; భయ+అభయ, **విధాయినః = భయాన్ని**, అభయాన్ని కలిగించే వారు; యత్+నిదేశే = ఎవని ఆయిజ్ఞ యుందు; **స్థితాః** = ఉన్నారో; తత్ = అట్టి; ఏతత్ = ఈ; అతిలంఘిత, ద్రుహిణ, **శంభు**+శక్ర+ఆదికం = అతిక్రమించబడిన, చతుర్ముఖుడైన బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, మొదలైన దేవతలు గల; రమాసఖం = శ్రియఃపతియైన; రంగధుర్యం = శ్రీరంగ మందధి వసించిన; కిమపి = ఒకానొక; మహః = తేజస్సును; అధీమహే= స్తుతిస్తున్నాము.

**తా॥** శ్రియఃపతిని నిత్యం భజించే వారికి భయమే ఉండదు, సర్వేశ్వరుణ్ని స్మరించని, లోక కంటకులకు మాత్రం భయం అవశ్యంగా ఉంటుంది. లోకంలో భయా భయాలను కలిగించే మహాభూతాలూ భగవంతుని ఆజ్ఞకు లోబడి ప్రవర్తించడం నైసర్గికం. బ్రహ్మ రుద్రేంద్రాదుల కంటెనూ మించిన వైభవం కలిగినట్టి శ్రీమన్నారాయణుడే

శ్రీరంగమందు అద్భుతంగా వెలసియున్న పరంజ్యోతిని స్తోత్రం చేస్తున్నాము.

సంజీవనీ వ్యాఖ్య :- శ్రీ రంగనాథుడు అనిర్వచనీయ పరంజ్యోతి అని స్తోత్రం ప్రారంభింపబడింది.

**"అథయదతః పరో దివోజ్యోతిర్దీవ్యతే"**

**"నారాయణః పరంజ్యోతిః"** అని ఉపనిషద్వాణి.

**1. అభీతిరిహ యజ్జుషాం :-** ఆ పరంధాముడు లక్ష్మీదేవితో పాటు ఈ లోకంలో శ్రీరంగమనే దివ్య క్షేత్రమందు విరాజమానుడై ఉన్నాడు. ఆ దివ్య తేజోమూర్తిని ఆశ్రయించి నిరంతరం భక్తితో ధ్యానించే చేతనులకు-దాసులకు- సంసార బంధాలవల్ల కలిగే భయం తొలగి పోతుంది. వీరు నిర్భయులై ఉంటారు. "అంబుజోదర దివ్య పాదార వింద చింతనామృతపాన విశేష మత్త చిత్తుడైన భక్త ప్రహ్లాదుడు బాల్యం నుంచి నిర్భయుడుగా ప్రవర్తించాడు కదా!

"యదాహ్యే వైష ఏతస్మిన్నదృశ్యేஉ నా త్మ్యేஉ నిరుక్తే உ నిలయనేஉ భయం ప్రతిష్ఠాం విందతే, అథసోஉ భయం గతో భవతి" (తైత్తిరీయోపనిషత్తు)

"ఈ చేతనుడు ఎప్పుడైతే, ఈ రీతిగా ఉంటాడని చెప్పరాని పరమాత్మయందు ధ్యాన నిష్ఠను పొందియుంటాడో, (అప్పుడు అభయాన్ని - భయం లేని స్థితిని - పొందియుంటాడు" అని ఈ వేదాంత వాక్యానికి అర్థం.

**2. యదవ ధీరితానాం భయం :-** సర్వేశ్వరుడు, తన యందు శ్రద్ధా భక్తులు లేని వారి పట్ల విచార పడుతూ, న్యక్కార భావంతో ఉంటాడు. 'హరి ఏత ద్విశ్వములోన లేదు' అని స్వతంత్రంగా ప్రవర్తించే హిరణ్యకశ్యపుని లాంటి చేతనులు 'ఆత్మాపహారం' అనే దోషం కలవారు. కొందరు శిశుపాలునిలాగా సర్వశేషియైన భగవంతుణ్ణి అపలపిస్తారు. ఇట్టి సర్వ దోష భూయిష్ఠులకు భయం అవశ్యంగా కలుగుతుంది.

**"యదాహ్యే వైష ఏతస్మిన్ను దరమంతరం**
**కురుతే, అథతస్య భయం భవతి" -**

ఈ చేతనుడు భగవద్ధ్యానమందు కొంచెం విముఖుడైనా, అప్పుడతడు భయాక్రాంతుడవుతాడని ఈ (తై.ఉ) వాక్యానికి అర్థం.

3. భయా భయ విధాయినః – స్థితాః – ప్రపంచమందు భయా భయాలను కలిగించే వారెందరో ఉన్నారు.

దేవ తిర్యఙ్మనుష్య స్థావరాలలోనూ భయంకరులూ, అభయంకరులూ, ఉండడం ప్రకృతి సిద్ధం. యముడు, రుద్రుడు, ఉగ్రవాదులు, సంహర్తలు కాబట్టి భయంకరులే కదా! సూర్యుడు, చైతన్యాన్ని, అగ్ని వేడిమిని కలిగించడం, వరుణుడు జీవన (జల) దాత, వాయువు జగత్ప్రాణుడే, పాలకులు ప్రకృతి (ప్రజా) రంజకులనడం జగద్విదితమే.

విశ్వానికి భయా భయ విధాయి ఆ విష్ణు భగవానుడే కాబట్టి, ఈ మహా భూతాలు, గ్రహాలన్నీ అతని శాసనానికి భయపడి సక్రమంగా ప్రవర్తిస్తున్నాయని శ్రుతి వల్ల బోధపడుతున్నది.

"భీషాஉ స్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాஉ స్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమతి (తై. ఉ)

ఆ పరంధాముని భయం వల్లనే కదా గాలి వీచుతున్నది. సూర్యుడు ఉదయిస్తున్నాడు. అగ్నిహోత్రుడు జ్వలిస్తున్నాడు. ఇంద్రుడు వర్షం కురిపిస్తున్నాడు. అయిదవవాడైన యముడు సమవర్తి అవుతున్నాడు – అని (తై) ఉపనిషదర్థం.

**తత్, ఏతత్ :– అది, ఇది.**

"తద్దూరే తద్వదంతికే"– (ఈశావాస్యోపనిషత్)

"అగలిల్ అగలుమ్, అణుగిల్ అణుగుమ్". (తి.వా.మొళి 1–7–10)

చేతనుడు స్వామి నుంచి దూరమైతే, స్వామి కూడా దూరమవుతాడు. శ్రీరామ చంద్ర స్వామి పైన ద్వేషం పెంచుకున్న రావణుడు "ద్విధాభజ్యేయమప్యేనం ననమేయం"– నేను రెండుగా ఖండింపబడిననూ నమస్కరించను, అన్న స్థితికి వచ్చినప్పుడు స్వామి అతనిని ఆదరించక, అంతం చేశాడు.

కేవలం ఆత్మ లాభం కోసం శరీర విముక్తిని మాత్రం కోరి పరమాత్మకు దూరమవుతారు. పరమాత్మ కూడా వారికి దూరమవుతాడన్నారు నమ్మాళ్వార్లు. "తద్వదంపతికే"– "అణుగిలణుగుమ్" – అనన్య ప్రయోజనులై తనను ఆశ్రయించిన

వారిని దగ్గరగా స్వామి చేర్చుకొనియుంటాడు.

లంకను విడిచి వచ్చి సముద్రతీరాన తనను ఆశ్రయించిన విభీషణుణ్ణి, సుగ్రీవాదులు అతణ్ణి చేర్చుకోరాదన్నప్పుడు "ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యా భయం మయా". వానర శ్రేష్ఠ! సుగ్రీవా! అతనికి నేను అభయమిచ్చాను, అతణ్ణి తీసుకొని రమ్మని శ్రీరామచంద్ర స్వామి చెప్పి అతనితోనే రప్పించి తనతో చేర్చుకొని యున్నాడు. ఆ సమయాన "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చయాచతే! అభయం సర్వ భూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ॥" "ఒక్కసారి "నీ దాసుడను" అని శరణు పొందిన వ్యక్తికి సర్వ ప్రాణులనుంచి భయం లేకుండా రక్షిస్తానని అభయమిస్తున్నాను; ఇది నా నియమ" మని శ్రీరామ చంద్ర స్వామి ప్రకటించాడు కదా!

శ్లోకంలో 'ఇహ' అనే పదం, భయ భరితమైన ఈ సంసారంలో శ్రీరంగధాముడు భక్తులకు భయరహిత స్థితిని కలిగిస్తాడని చాటుతున్నది. రక్షించడానికి శ్రీరంగ ప్రభువు అభయహస్తుడై వేంచేసియున్నాడు కాబట్టి, ఈ లోకంలో ఆ ప్రభువును ఆశ్రయించిన చేతనులను ఏ ప్రబలశక్తి భయపెట్ట సాహసించదనీ కూడా వెల్లడిస్తున్నది.

"ప్రాయః ప్రపదనే పుంసాం పౌనః పున్యం నివారయన్ । హస్తః శ్రీరంగ భర్తుర్మామవ్యాదభయ ముద్రితః ॥" (న్యాసతిలకం) ప్రపన్నులు ఒక్కసారి ప్రపత్తి చేస్తుంటే, 'ఇక మళ్ళీ మళ్ళీ ప్రపత్తి చేయకండి' అని సూచిస్తున్నాడో అన్నట్లు శ్రీరంగరాజు చేతియందు అభయ ముద్రను ధరించియున్నాడు. అట్టి శ్రీ హస్తం నన్ను రక్షించుగాక- అని దేశికులు ప్రార్థించారు.

**4. అతిలంఘిత ద్రుహిణ శంభు శక్రాదికం :-** అందరికి భయా భయాలను కలిగించే శ్రీమన్నారాయణుడు బ్రహ్మరుద్రేంద్రాదులకంటె గొప్పవాడు. "వేదాప హార గురుపాతక దైత్య పీడా ద్యాపద్విమోచన మహిష్ఠ ఫలప్రదానైః". (ఆళవందార్ స్తోత్రరత్నం)

తన నుంచి వేదాలు అపహరింపబడినందువల్ల బ్రహ్మ చాలా బాధపడ్డాడు. అపుడు శ్రియఃపతి మత్స్యావతారమెత్తి సోమకాది రాక్షసులను వధించి వేదాలను తెచ్చి మళ్ళీ బ్రహ్మకు ఇచ్చాడు.

పరమ శివుడు బ్రహ్మతలను ఛేదించగా అది అతని చేతికంటుకొన్నది. కపాలి ప్రార్థించినందువల్ల, లక్ష్మినివసించియున్న తన వక్షఃస్థలాన పొట మరించిన స్వేదజలాన్ని కపాలమందు ప్రసాదించిన వెంటనే ఆ కపాలం శతధాభిన్నమయింది. ఈ విధంగా శంభువుకు కలిగిన బ్రహ్మహత్యా పాతకాన్ని నశింపజేసిన వాడు నారాయణుడే కదా! ఇంద్రసేనుణ్ని (బలిని) అణచివేసి, రావణాది రాక్షసులను హతమార్చి దేవేంద్రునికి స్వర్గాధిపత్యం కల్పించాడు. ఇలాగా బ్రహ్మాది దేవతలకు కల్గిన ఆపదలను పోగొట్టి, వారికి గొప్ప ఫలాలను ప్రసాదించడం వల్ల, లక్ష్మీనాథుడు బ్రహ్మాదుల కంటె అధికుడై వెలసియున్నాడు. అందువల్ల "నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే" – అతనితో సాటివాడు గానీ, అతనికంటే అధికుడు గానీ కనబడడనీ శ్రుతి పలుకుతుంది.

**5. రమాసఖం :–** సర్వదా లక్ష్మీదేవితో కూడి యుండేవాడు. ఇది నారాయణ స్వరూప స్వభావాలకు ముఖ్య లక్షణం. లక్ష్మీదేవి 'అజ్ఞాత నిగ్రహ'. అంటే మూర్తీ భవించిన అనుగ్రహమే కాబట్టి, చేతనులపట్ల – ముఖ్యంగా హరిదాసుల విషయమై– నిగ్రహమన్నదే తెలియక, వాత్సల్యాన్నే వర్షిస్తుంది. "రంగాధీశ! రమాపతిత్వ సుభగం నారాయణత్వం తవ". (శ్రీన్యాస తిలకం) అని స్తుతించారు దేశికులు. రమించేది రమా. జగద్వ్యాపార క్రీడలో తోడ్పడుతూ రమించే లక్ష్మీదేవితో కూడియుండడమే నారాయణునికి ఆనందం.

**6. రంగధుర్యం :–** శ్రీరంగ భారాన్ని వహించేవాడు రంగధుర్యుడు "ధురోయడ్డకౌ" (పా.సూ.4.4.77) ధూర్శబ్దం మీద యత్ప్రత్యయం రాగా, ధుర్యః అనే శబ్దం సిద్ధిస్తుంది. ధురం వహతీతి ధుర్యః. విశ్వం ఒక క్రీడారంగం. ఆ రంగభారాన్ని నిర్వహించేది అని 'మహః' పదానికి విశేషణమిది.

**7. కిమపి మహః :–** ఆశ్చర్య జ్యోతీరూపుడు. దేశికులు" అంతర్జ్యోతిః కిమపియమినాం". అని "భగవద్ధ్యాన సోపాన" మందు మొదటనే సుశ్లోకించారు. మహస్సు, జ్యోతిస్సు, తేజస్సు, ఓజస్సు, వర్చస్సు, భర్గస్సు అనే పదాలకు సామాన్యంగా 'కాంతి' అనే అర్థమున్నా, ప్రత్యేకంగా, విశేషార్థమూ ద్యోతకమవుతుంది.

"యదాదిత్యగతం తేజో జగద్భాసయ తేఽ_ఖిలమ్ ।
యచ్చంద్రమసియచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్॥"

విశ్వంలో ఎక్కడనైనా భాసించే తేజస్సు తనదే అని భగవానుడే 'గీత' లో ఉపదేశించాడు.

మహర్లోక మనే కాక "మహ ఇతి చంద్రమాః" అనే శ్రుతిరీత్యా 'ఆహ్లాదకరమైన శీతలకాంతి' అనే అర్థం కలది. 'మహ'శ్శబ్దం.

"వందా మహే సరసి జేక్షణ మద్వితీయం వేదాన్త వేద్య మనిదం ప్రథమం మహస్తత్" ॥

'పుండరీక నయనాలు కలిగియున్నట్టి, వేదాంత విద్య చేతనే తెలుసుకోదగి యున్నట్టి, సనాతనమైన మహస్సుకు (ఈ శీతలకాంతికి) ప్రణమిల్లుతున్నాము' అని శ్రీ కూరేశులూ స్తుతించారు.

**8. అధీమహే :-** 'అధి' పూర్వకమైన 'ఇజ్-అధ్యయనే' ధాతువు యొక్క 'లట్' వర్తమాన కాలిక ఉత్తమ పురుష బహువచనాంత రూపమైన క్రియాపదం. ఈ స్తుతి వైదిక పద్ధతిలో ఉన్నది. బహువచన ప్రయోగాన్ని బట్టి, ఇది వేద శబ్దాలను గురువు యొక్క ఉచ్చారణను అనుసరించి శిష్యులు ఉచ్చరించే రీతిని తెల్పుతున్నది. వేద మధ్యేయమే కదా!

వేదాంత దేశికులు, తమ ఆశ్రితులతో కలిసి స్తుతిస్తున్నట్లు భాసిస్తున్నది.

"నా ముమక్కు అటియచ్చొన్నోమ్" అని నమ్మాళ్వార్లు తమ విషయంలోనే బహువచనాన్ని "ఆత్మని బహువచనం" అన్నట్లు ప్రయోగించుకొన్నారు. సాత్త్వికాహంకారం శ్లాఘనీయమే కదా! ఆళ్వారుల ఆచార్యుల ఆశ్రయణమనే విశిష్ట సంబంధం కలిగిన దేశికులు తమను బహువచనంలో నిర్దేశించుకొన్నారని భావించవచ్చును.

ఈ మొదటి శ్లోకమందు శ్రియఃపతి యొక్క సర్వస్మాత్ పరత్వమూ, మోక్షప్రదత్వమూ చెప్పబడింది. పూర్వార్థంలో ఓంకారార్థం, ఉత్తరార్థంలో 'నమో నారాయణాయ' అని తిరుమంత్రార్థం స్ఫురిస్తుంది.

"ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాఽ_పి తన్ముఖే" అన్నట్లు స్తోత్రారంభమందు వస్తువును నిర్దేశించి, నమస్కరించిన శ్లోకమిది. "అక్షరాణా మకారోఽ_స్మి". (భ.గీత)

అన్నట్లు వేదం యొక్క ఆద్యంతమందు ఉచ్చరించబడే ఓంకారానికి ప్రకృతియైన 'అకారం' మొదట నిర్దేశింపబడినందువల్ల మంగళంగా స్తోత్రమారంభించినట్లయింది.

"మంగళా దీని మంగళమధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణి ప్రధంతే" అని మహాభాష్య సూక్తి కదా!

'ఆదిత్యో వైతేజ ఓజో మండలం' అని శ్రుతి పలికినట్లు తీక్ష్ణమై, దుర్నిరీక్ష్యమైన సూర్యుని తేజస్సు వంటిది కాక, చేతనులందరికి ఉపసర్పణీయమై, ఆశ్రితులకు మనోజ్ఞమై, ప్రపత్తి చేయదగిన శ్రీరంగచంద్రుని మహః పదార్థానికి శ్లోకంలోని విశేషణ పదాల ప్రయోగం హేతువే కాబట్టి, పదార్థ హేతుక కావ్య లింగాలంకారం.

'అభీతి' అని ఆరంభించి 'గోపాయతి' అని ముగించిన ఈ 'స్తవం' లోని 29 శ్లోకాలు పృథ్వీ వృత్తంలోనే రచింపబడినాయి.

**2. దయా శిశిరితా శయా మనసి మే సదా జాగృయుః**
**శ్రియాఽ_ద్యుషిత వక్షసః శ్రిత మరుద్వృధా సైకతాః ।**
**జగద్దురిత ఘస్మరా జలధి డింభ దంభ స్పృశః**
**సకృత్ప్రణత రక్షణ – ప్రథిత సంవిద స్సంవిదః ॥**

అర్థం :– దయా, శిశిరిత+ఆశయాః = కృపచేత చల్లగా జేయబడిన మనస్సు కలవియైన; శ్రియా+అధ్యుషిత, వక్షసః = లక్ష్మీదేవి చేత నివసింపబడిన వక్షఃస్థలం కలవియైన; శ్రిత, మరుద్వృధా, సైకతాః = ఆశ్రయింపబడిన కావేరీనది యొక్క ఇసుక తిన్నెలు కలవియైన; జగత్+దురిత, ఘస్మరాః = లోకాల పాపాలను భక్షించేవియైన; జలధి, డింభ, దంభ, స్పృశః = సముద్రపు బిడ్డ యొక్క ఆటోపాన్ని స్పృశించేవియైన; సకృత్ – సంవిదః । సకృత్ = ఒక్కసారి, ప్రణత = నమస్కరించిన వారిని, రక్షణ = రక్షించడమందు; ప్రథిత = ప్రసిద్ధమైన; సంవిదః = ప్రతిజ్ఞ కలవియైన; సంవిదః = (భగవత్సం బంధమైన) జ్ఞానాలు; మే = నా యొక్క; మనసి= చిత్తమందు; సదా = ఎల్లప్పుడు; జాగృయుః = మేల్కొనియుండుగాక.

తా॥ దయచే చల్లనైన అంతఃకరణం కలవియై, లక్ష్మీదేవి ఆశ్రయించిన వక్షః స్థలం కలవియై, కావేరి మధ్యనున్న ఇసుకతిన్నెలు కలవియై, లోకాల పాపాలను

నశింపజేసేవిదియై, సముద్ర సంతానమైన చంద్రుని మహత్త్వాన్ని తాకేవిదియై, ఒక్కసారి ప్రపత్తిని జేసినంతనే వారిని కాపాడే దీక్షను కలవిదియైన శ్రీ రంగనాథునికి సంబంధించిన జ్ఞానాలు ఎల్లప్పుడు నా హృదయమందు మేల్కొని ఉండుగాక.

వ్యాఖ్య:- శ్రీరంగనాథునికి సంబంధించిన జ్ఞాన విచారాలే తన మనస్సు స్థిరంగా ఉండాలని కవి ప్రార్థించే శ్లోకమిది.

వేదాంత దేశికులు యావజ్జీవం తన మనస్సులో నిల్చియుండడానికి స్తుతించే భగవత్స్వరూప స్వభావాలు ఈ శ్లోకమందు ఆరు (6) ఉన్నాయి.

1. దయా శిశిరితా శయాః :- ఈ పదం జ్ఞానశక్త్యాదులను సూచిస్తుంది.

భగవానుడు అనంత కల్యాణ గుణ పూర్ణుడైననూ, ఆ గుణాలలో అగ్రగణ్యమైనది దయా గుణమే. ఆ దయా దేవి భగవంతుని హృదయాన్ని చల్లపరచుతూ ఉంటుంది.

**"అతి లంఘిత శాసనేష్వభీక్ష్ణం వృషశైలాధిపతి ర్విజృంభితోష్మా ।**
**పునరేవదయే ! క్షమా నిదానైఃమభవతీ మాద్రియతే భవత్యధీనైః" ॥**

(దయా శతకం 27)

భగవానుని ఆజ్ఞా రూపాలైన శ్రుతి స్మృతులను ఉల్లంఘించి, చేతనులు చేయదగిన పనులను చేయకుండా, చేయరాని పనులను చేస్తూ భగవంతునికి కోపతాపాలను కలిగిస్తుంటారు. అప్పుడు జ్ఞానబలాది గుణాల సాహాయ్యం చేత అపరాధులను దండించకపోతే భగవానుని కోపతాపాలు శమించవు. భగవంతునికి కోపమేర్పడినప్పుడు దయాదేవి జీవులకు తెలియకుండా యాదృచ్ఛిక సుకృతం మొదలుకొని క్రమంగా సదాచార్య సంబంధం ద్వారా భగవంతుని సన్నిధిలో ప్రపత్తి చేసే వరకున్న పరిస్థితులను కలుగజేస్తుంది. తత్ఫలితంగా అపరాధులయందు భగవంతునికేర్పడిన కోపతాపాలను ఉపశమింపజేసి, వారికి దండనను తొలగించి, ఉత్తమ పురుషార్థాన్ని లభింప జేస్తుంది. ఇలా (ఓర్పు) క్షమకు కారణమైన దయను భగవానుడు ఆదరిస్తాడు. అంటే దయార్ద్ర హృదయుడవుతాడు.

అపరాధులైన జీవులు తనను సేవించినట్లైతే, వారి పాపాలన్నీ తొలగిపోయి

సద్గతిని పొందగలరనే పరమ దయచే శ్రీరంగాది దివ్యక్షేత్రాలయందు అర్చా సమాధిని పొందియున్నాడు. కాబట్టి అవతారాలకు దయయే మూలకారణం. శ్రీరంగేశుని హృదయం చల్లనిది కాబట్టి, ఆయన కృపను పొందడానికే చేతనులు సర్వదా మనసార స్తోత్రం చేస్తుంటారు. దయా రస నిర్భరుడు కదా!

2. శ్రియాஉ_ధ్యుషిత వక్షసః :– ఇది 'శ్రీమత్' శబ్దార్థాన్ని తెల్పుతుంది. లక్ష్మీదేవి విష్ణు వక్షః స్థలమందు నివసించియున్నది. భగవానుడు లక్ష్మీదేవిని కోరలేదు. క్షీర సముద్ర మథన సమయాన జనించిన లక్ష్మీదేవి మనస్సును విష్ణుమూర్తి తన దివ్యయౌవన శోభచే హరించాడు. అందువల్ల "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షః స్థలం హరేః" ! (విష్ణు పురాణం) దేవతలూ, పూర్వ దేవతలూ, అందరు చూస్తుండగా లక్ష్మీదేవి తనకు తానుగా వచ్చి, వరించి, హరి వక్షః స్థలమందు కుడి ప్రక్కన నివసించినది. పెరియాళ్వార్ "వడివాయ్ నిన్వల మార్బినిల్ వాళ్గిన్ఱ మంగై". అని స్తుతించారు.

"అగల గిల్లే నిఱైయు మెన్ఱలర్ మేల్మంగై యుఱై మార్బా". 'ఒక్క క్షణమైనా నిన్ను విడిచి ఉండజాలను' అంటూ లక్ష్మీదేవి నివసించే వక్షః స్థలం కలవాడా! అని నమ్మాళ్వార్లు స్తుతించారు. "అంతఃపురం జలధి రాజకుమారికాయాః" (అప్పయ దీక్షితులు వరదరాజ స్తవం). "తిరుమకళ్ శేర్‌మార్బన్". లక్ష్మీదేవి వక్షఃస్థలమందు కలవాడు. 'రమాసఖమ్' అని మొదటి శ్లోకమందే స్తుతింపబడింది. అయినా, ఇక్కడ శ్రీరంగధామునిని హృదయం చల్లగా, ఆర్ద్రంగా ఉండడానికి ఇది మరో కారణం. దయా దేవి శ్రీరంగ ప్రభువు హృదయం లోపల ఉంటే, లోక శోక వినాశినియైన జగన్మాత, లక్ష్మీదేవి వెలుపల ఉంది. ఇలా ధ్యానించే జ్ఞానం చిత్త ద్రుతిని కలిగిస్తుంది కదా!

3. శ్రిత మరుద్వృధా సైకతాః :– ఈ పదం సౌశీల్య సౌలభ్యాలను బోధిస్తుంది.

"ఇమం మేగంగే యమునే సరస్వతి శుతుద్రిస్తోమగ్ం సచతా పరుష్ణియా ।

అసిక్నియా మరుద్వృధే" – (శ్రుతి) "మరుద్వృధా" అని కావేరీ నదికి వేద ప్రసిద్ధమైన పేరు. రెండు పాయలై పారిన కావేరికి నడుమ ఉన్న ద్వీపమందు

శ్రీరంగ క్షేత్రం (మందిరం) ఉన్నది. ఈ ద్వీపం ఆ నదియొక్క సైకత ప్రదేశంగా భావింపబడింది. ఎల్లప్పుడు ప్రవాహంతో నిండియుండే కావేరీ జలం గాలికి వృద్ధి అవడం వల్ల 'మరుద్వృధా' అని ఆ నదికి పేరు కలిగింది.

"ప్రవహతి జగద్ధాత్రీ భూత్వేవరంగ - పతేర్దయా, శిశిర మధురాౖ గాధా సా నః పునాతు మరుద్వృధా"। 'శ్రీరంగనాథుని దయలాగా జగమంతటికి పెంపుదు తల్లియై ప్రవహిస్తున్నది. అట్టి చల్లని, తియ్యని, లోతైన కావేరీనది మనలను పవిత్రం చేయుగాక. అని శ్రీ పరాశర భట్టర్ 'శ్రీరంగరాజస్తవం' (23) చేశారు. కావేరీ నది భగవద్దయతో రూపింపబడింది.

దాది ఎల్లప్పుడు మేల్కొనియుండి బిడ్డను కంటికి రెప్పవలె కాపాడుతుంది.

భగవద్దయ సదా జాగరూకయై 'ఆర్తేషు ఆశుఫలా' (న్యాసతిలకం 10) అన్నట్లు సద్యః ఫలితాన్ని ఇస్తుంది.

"గంగైయిల్ పునిదమాయకావిరి"- గంగా నది కంటెనూ పవిత్రమైనది కావేరి, అని తొండరడిప్పొడి యాళ్వార్ (తిరుమాలై. 23) ప్రస్తుతించారు.

"శందినోడు మణియుమ్ కొళిక్కుమ్ పునల్ కావిరి"

చందనపు కట్టెలను, ముత్యాలను తీసుకొని ప్రవహించే జలం కలిగియున్నది కావేరి - అని (పెరి-తిరుమొళి. 5-4-1) అని తిరుమంగైయాళ్వార్ కీర్తించారు.

త్రివిక్రమావతారమందు గంగానదికి విష్ణు పాదంతో గల సంబంధం తాత్కాలికమే కదా! "తెణ్నీర్ పొన్ని తిరైక్కైయా లడివరుడ" (పెరుమాళ్ తిరుమొళి. 1-1) తేట నీటిని కల్గి 'పొన్ని' అనే పేరు ఉన్న కావేరీనది తన కెరటాలనబడే చేతులతో పాదాలను స్పృశిస్తున్నదని కులశేఖరాళ్వార్ స్తుతించారు.

కావేరీనదికి భగవత్పాదాలతో నిత్య సంబంధం కలదని తెలుస్తున్నది.

సహ్యాద్రియందు పుట్టి నిండుగా ప్రవహిస్తూ ఇసుక తిన్నెలు గల ఉభయ కావేరీ మధ్యన శయనించియున్న శ్రీరంగవిభుడు సౌశీల్య సౌలభ్య స్వభావుడని విశదమవుతున్నది కదా!

4. జగద్దురిత ఘస్మరాః :- ఈ శబ్దం వాత్సల్యాన్ని ప్రకటిస్తుంది.

లోకాల పాపాలు అంటే, చేతనులు జనన మరణాల మధ్యనున్న స్థితిలో దుష్కృతాల వల్ల సంపాదించుకొన్నవే. పాపరాశి ఒక్కొక్క వ్యక్తి యందు మేరు, మందర పర్వతాలంత పరిమాణంతో ఉన్న "మేరు మందర మాత్రోపిరాశిః పాపస్య కారణః ! కేశవం వైద్య మా సాద్య దుర్వ్యాధిరివ నశ్యతి" (విష్ణు ధర్మం) వైద్యుని ఆశ్రయిస్తే తీవ్ర వ్యాధి నశించే రీతిగా కేశవుణ్ని ఆశ్రయిస్తే ఆ పాపాలు నశించి పోతాయి.

"కెడు మిడరాయ వెల్లాం కేశవా వెన్న" - కేశవా! అని పలికి నంతనే పూర్వోత్తరాఘాలన్నీ నశిస్తాయని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి.

'యథేషీక తూలమగ్నౌ ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే' ॥

(ఛాందోగ్యోపనిషత్తు)

దూది కుప్ప మీద నిప్పు పడితే భస్మమయ్యే లాగా, భగవంతుణ్ని సేవిస్తే వెంటనే ప్రాచీన పాపాలన్నీ దగ్ధమవుతాయి.

'ఘస్మరు' డంటే (a voracious consumer) తిండిపోతు. ఎన్నిసార్లు, ఎంత తిన్నా, ఆకలితో నుండు వాడని అర్థం. "భక్షకో ఘస్మరోఽద్మరః" (అమరం) వేదాన్త దేశికులు దయాదేవిని చిత్రంగా ప్రార్థిస్తారు.

"ఔత్సుక్య పూర్వము పహృత్య మహా పరాధాన్! మాతః! ప్రసాద యితు మిచ్ఛతి మే మనస్త్వామ్ ! ఆలిహ్యతాన్ నిరవశేష మలబ్ధతృప్తిః । తామ్యస్యహో। వృషగిరీశ ధృతా దయేత్వమ్॥" (దయాశతకం. 97)

ఓ తల్లీ! దయాదేవీ! నా మనస్సు చాల ఆశతో మహాపరాధాలను కానుకగా ఇచ్చి నిన్ను సంతోషింప జేయకోరుతుంది. అయినా, శ్రీనివాసుని ఓ దయాదేవీ! నీకాహారమైన నా అపరాధాలను ఎన్నిసార్లు మూటలు మూటలుగా నేను సమర్పించినప్పటికీ వాటిని ఆరగించి కూడా నీవు తృప్తిని పొందనిదానవై తహతహ పడుతునే ఉన్నావు. ఆశ్చర్యమే!

శరణాగతి చేసిన వారి అపరాధాలకు ఫలమియ్యక భగవానుడు కృపచేత

క్షమిస్తుంటాడు. 'అలబ్ధతృప్తిః' అనడం వల్ల భగవద్దయకు గల కడుపు ఎంత పెద్దదో అని చిత్రోక్తి. దయా పరాధీనుడైన భగవానుడు ఎంతో ఉదార స్వభావుడని సారాంశం.

**5. జలధి డింభ దంభ స్పృశః :-** ఇది నారాయణ చరణ శబ్దార్థాన్ని స్పృశిస్తుంది.

చంద్ర బింబంలాగా కాంతి, శైత్యమూ, ఆహ్లాదమూ కలిగినట్టి అని అర్థం చెప్పవచ్చు. 'జలధి డింభ' అంటే (miniature sea) పిల్ల సముద్రమని అర్థం. విశాలమైన సముద్రాన్ని ఒక్కసారి సంపూర్ణంగా చూడజాలం. సముద్రమందు ఉండే పగడాల వంటి ఎఱ్ఱని అధరం, పాణి పాదాలు గల్గి, నీలవర్ణంతో చల్లని, గంభీరమైన ఆశ్చర్యకరమైన సముద్ర పోతం లాంటి శ్రీరంగనాథుని దివ్య మంగళ విగ్రహాన్ని ఒక్కసారి 'ఆపాద చూడం' చూచి ఆనందించవచ్చు కదా!

"ఇదు ఒరు శిత్తురు వమ్‌కొకడలో ఎన్ను తోన్ను గిఱదు" – అని తమిళవ్యాఖ్య.

"గంభీరాద్భుత ఇవ తర్ణకో౾ర్ణవస్య" (శ్రీరంగ రాజస్తవం – పూ.శ.81)

"కడలొప్పార్ కణ్ణిడినుమ్ కాణాక్కూత్తాల్, (హస్తిగిరి మాహాత్మ్యం).

**6. సకృత్ ప్రణత రక్షణ ప్రథిత సంవిదః :-** ఇందు శరణ, శబ్దార్థంతో పాటు ఉత్తరవాక్యార్థం లక్షితం.

ఒక్కసారి 'నీవాడను స్వామీ' అని ప్రపత్తి చేస్తే రక్షించే స్వభావం కలవాడు భగవానుడు. విభీషణుడు సముద్రతీరాన శరణాగతుడైనప్పుడు శ్రీరామచంద్రుడు ప్రతిజ్ఞ చేశాడు కదా!

**7. సంవిదః :-** "సంవిత్ జ్ఞానేప్రతిజ్ఞాయాం సంకేతాచార నామసు సంభాషణే తోషణే చక్రియా కారేచ సంగరే". (నిఘంటువు) 'సంవిత్' అంటే సమ్యక్ జ్ఞానం. "సంజ్ఞానం, విజ్ఞానం, ప్రజ్ఞానం, జానత్, అభిజానత్". జ్ఞానం అయిదు విధాలుగా ఉంటుందని శ్రుతి బోధిస్తుంది. కాబట్టి, బహువచనం ప్రయుక్తం. అంతర్బహిర్ జ్ఞానరూపమన్నమాట ఈ శ్లోకంలో 'ద్వయమంత్రం' ధ్వనిస్తున్నది.

శ్రీరంగనాథుని స్వరూప స్వభావాలకు సంబంధించిన జ్ఞానాలు (విచారాలు, తెలివితేటలు) తనకు తన ప్రయత్నం లేకుండా, యావదాత్మభావి ఉండాలని దేశికులు ప్రార్థించారు.

శ్రీరంగనాథుని దివ్య రూప గుణాలను మనోజ్ఞంగా, యథాతథం వర్ణించడంవల్ల స్వభావోక్త్యలంకారం. ఛేకాను ప్రాస అనే శబ్దాలంకారం.

**3. యదద్య మితబుద్ధినా బహులమోహ భాజామయా**
**గుణగ్రథిత కాయ వాఙ్మనస వృత్తి వైచిత్ర్యతః ।**
**అతర్కిత హితాహిత క్రమ విశేష మారభ్యతే**
**తదప్యు చిత మర్చనం పరిగృహాణ రంగేశ్వర ॥**

**అర్థం :**- రంగేశ్వర = ఓ రంగనాథా! మితబుద్ధినా = స్వల్పమైన బుద్ధి కలిగిన; బహుల మోహభాజా = మితి లేని అజ్ఞానాస్పదుడనైన; మయా = నా చేత; గుణ-వైచిత్ర్యతః । గుణ = త్రిగుణాలచే; గ్రథిత = కూర్చబడిన; కాయ = శరీరం యొక్క; వాక్ = మాటయొక్క; మనస = మనస్సు యొక్క; వృత్తి = చేష్టలకు సంబంధించిన; వైచిత్ర్యతః = వింతవల్ల; అద్య = ఇప్పుడు; అతర్కిత-విశేషం । అతర్కిత = ఆలోచింపబడని, హిత = మంచి, అహిత = చెడు యొక్క; క్రమ విశేషం = పద్ధతి యందలి భేదం; యత్ = ఏది; ఆరభ్యతే = ప్రారంభించబడుతున్నదో; తత్+అపి = దాన్ని (ఆ స్తోత్రాన్ని) కూడా; ఉచితం = తగిన; అర్చనం = ఆరాధనగా; పరిగృహాణ= స్వీకరింపుము.

**తా॥** ఓ రంగనాథా! నేను అల్ప బుద్ధి కలవాడను. మోహమధికంగా ఉన్నవాడను. త్రిగుణాలకు కట్టుబడియున్న వాఙ్మనః కాయాల వ్యాపారాలు విచిత్రంగా ఉన్నాయి. ఇట్టి స్థితి వల్ల, మంచి చెడు పద్ధతులను ఆలోచించకుండా, దేన్ని ఆరంభిస్తున్నానో ఆ స్తోత్రాన్ని కూడా నీకు ఉచితమైన ఆరాధనగా స్వీకరించుము.

వ్యాఖ్య:- ఈ రచనను "నీకు యోగ్యమైన స్తోత్రంగా పరిగ్రహించు" మని కవి కేసరి రంగనాథుణ్ని ప్రార్థించాడు.

ఈ శ్లోకంతో రంగనాథుణ్ని సంబోధిస్తూ, స్తోత్రమారంభింపబడుతున్నది. (మొదటిది - భక్తులకు భయాన్ని తొలగించి, అభయాన్ని ప్రసాదించే లక్షణాలు కలిగియున్న పరంజ్యోతి సుశ్లోకితం. రెండవ శ్లోకం - భగవానుడు మన రక్షకుడని అతని ఆరు లక్షణాలను శ్లాఘించింది.

వాస్తవంగా, స్తోతలోనూ, స్తోత్రంలోనూ లోపాలున్నా, శ్రీరంగనాథుని అర్చనకు ఉచితమైనదిగా ఆ స్వామి స్వీకరించాలనే ప్రార్థనతో, స్తోత్రం మొదలయింది.

**1. మితబుద్ధిః :-** కవి తన బుద్ధికి మితి కలదని భావిస్తున్నాడు. మితమైన బుద్ధితో అమితం, అనంతమైన భగవద్వైభవంలో కొంతనైనా గ్రహించే సామర్థ్యం తనకు లేదంటున్నాడు. "బుద్ధిర్మనీషాధిషణాధీః ప్రజ్ఞా శేముషీ మతిః". (అమరం)

**2. బహుల మోహభాక్ :-** బుద్ధి కొంచెమే ఉంది. మోహం మాత్రం ఎక్కువగా ఉందట. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాతర్యాలనే ఆరింటిని 'అరిషడ్వర్గం' అంటారు. ఇవి ప్రతి వ్యక్తి హృదయం లోపల ఉండి, అతనిని ఉద్విగ్నునిగా జేసి పతనానికి హేతువులవుతాయి. కాబట్టి, 'అంతః శత్రువు' లని పేరు కలిగింది. 'మోహం' అనేది అరిషడ్వర్గంలో ఒకటి. అజ్ఞానం, అన్యధాజ్ఞానం, విపరీత జ్ఞానం అనే త్రివిధా జ్ఞానాలకు 'మోహం' అని పేరు. జ్ఞానం కలిగే అవకాశం లేని బాల్యాదులవంటి స్థితిని 'అజ్ఞానం' అంటారు.

వస్తు స్వరూపం తెలియక వేరొక విధంగా భ్రమించడం అన్యధా జ్ఞానం. దేహాన్ని ఆత్మగానూ, త్రాడును పాముగానూ, ఎండమావులను జూచి నీటి ప్రవాహంగానూ భ్రమించడం అన్యదా జ్ఞానమే.

'విపరీత జ్ఞాన' మంటే క్షుద్ర సుఖాలమీద దుర్వ్యసన రూపమైన ప్రవృత్తికి కారణమైన వివేకరాహిత్యం. ఇట్టి మోహం విస్తారంగా కలవాడట.

**3. గుణగ్రథితకాయ వాఙ్మనస వృత్తి వైచిత్ర్యం :-** మనస్సులో ఉన్నది మాటల్లో ఉండదు; మాటల్లో ఉన్నది చేష్టల్లో కనబడదు. మనస్సు, వాక్కు, కాయం, ఈ మూడింటికి కరణత్రయమని పేరు. "మనస్యన్యత్, వచస్యన్యత్, కర్మణ్యన్యత్" - అన్నట్లు, త్రికరణాలలో దేని త్రోవ దానిదే. కరణత్రయ సారూప్యంగానీ, సామాన్యంగానీ లేదు. ప్రకృతియందలి సత్త్వరజస్తమో గుణాలచే త్రికరణాలు బంధింపబడి యుండడం వల్ల ఋజువుగా ప్రవర్తించడం లేదు. భగవదాజ్ఞా రూపాలైన శ్రుతి స్మృతులను పాటించక, భగవదపచార, భాగవతాపచార, అసహ్యాపచారాలను చేస్తే, కరణత్రయ వ్యాపారం విచిత్రంగా ఉంది. కాబట్టి,

**4. అతర్కిత హితా హితక్రమ విశేషం :-** మంచి చెడుల పద్ధతిని ఊహించక, రచింపబడుతున్న స్తోత్రమిది. హితమూ తెల్యదు 'హిత' మంటే మోక్షానికి – భగవత్ప్రాప్తికి – సాధనంగా అనుష్ఠించే ఉపాయం. ఇది భక్తి, ప్రపత్తి అనే భేదంతో రెండు విధాలు. కర్మజ్ఞానయోగాలు అంగాలుగా ఉండే భక్తిని మోక్షం పొందేవరకు అనుష్ఠిస్తూ ఉండాలి.

ప్రపత్తి షడంగ యోగమనబడుతుంది.

1. ఆనుకూల్య సంకల్పం 2. ప్రాతికూల్య వర్జనం 3. మహా విశ్వాసం
4. గోప్తృత్వవరణం. 5. కార్పణ్యం 6. ఆత్మ సమర్పణం.

ప్రపత్తినే శరణాగతి, భరన్యాసమంటారు.

భక్తి ప్రపత్తులు ధర్మార్థ కామాలనూ, మోక్షాన్నీ ఇవ్వగలవు. ప్రపత్తిని ఫలాన్ని ఉద్దేశించి అనేక పర్యాయాలుకాక, ఒక్కసారే అనుష్ఠించాలి. ప్రపత్తికి దేశ, కాల, జాత్యాది నియమాలు లేవు. ప్రాణులన్నీ అనుష్ఠించవచ్చు. ప్రపత్తి చేసిన ప్రాణికి, శ్రియఃపతి దేహావసానమందు స్మరించి, తానే అర్చిరాది మార్గంగా వైకుంఠానికి తీసుకొని పోయి సాయుజ్యాన్ని ప్రసాదిస్తాడు.

'అహితం' అంటే సంసారమే. దీని వల్ల చేతనులకు గర్భవాస దుఃఖం, ఇంద్రియ వికారాదులవల్ల కలిగే దుఃఖమూ, భయమూ నిరంతరం కలుగుతుంటాయి. ఆజ్యం పోస్తున్న కొలది, అగ్ని ప్రజ్వరిల్లుతున్నట్లే, సంసారంలో భోగాలు అనుభవిస్తున్న కొలది, వాటిని ఇంకా అనుభవిచాలనే కామం పెరుగుతూనే ఉంటుంది. ఇలాంటి హితా హిత క్రమాన్ని విచారించక, పురుగు తొలిచినదేదో అది అక్షరంగా ఏర్పడినట్లే, ఈ స్తోత్రం రచింపబడుతున్నది. "నన్మై తీమైగళొన్ఱుమఱియేన్" (5-1-3) అన్నారు పెరియాళ్వార్లు.

(మంచిదేదో చెడ్డదేదో తెలియనివాడను అని అర్థం). చిన్న పిల్లవాని మాటలు కన్న తల్లిదండ్రులకు సంతోషాన్ని కలిగించే రీతిగా, ఈ స్తోత్రం శ్రీరంగనాథునికి ఆనందం కలిగించాలని ప్రార్థన.

రచనలోనూ, రచయితలోనూ ఎన్ని దోషాలున్నా 'భగవద్గుణాను సంధానం

అభయ హేతుః' (శ్రీవచన భూషణం-366) కాబట్టి ఈ స్తోత్రాన్ని 'ఉచితమైన అర్చన' గా స్వీకరించుమని ప్రార్థించారు దేశికులు.

'అర్చనం' అంటే షోడశోపచార పూజ. భగవత్కైంకర్యంలో 'ధ్యానం' ప్రధానమైనది. స్తోత్రం వాచిక కైంకర్యం కదా! ధ్యేయ మూర్తి యొక్క కల్యాణ గుణాలను అనుసంధానం చేయడంవల్ల భగవదనుగ్రహం అవశ్యంగా కలుగుతుంది.

ఈ శ్లోకంతో దేశికులు, జ్ఞాన వైరాగ్య భూషణులైనా, నైచ్యాను సంధానం చేశారు. స్తోత్రాలలో, ఆరంభంలోనైనా, అంతంలోనైనా నైచ్యానుసంధానం చేయడం సంప్రదాయంగా ఉంది.

"అనిచ్ఛన్నప్యేవం యదిపునరితీచ్ఛన్నివ,
రజస్తమశ్ఛ న్నచ్ఛద్మస్తుతి వచన భంగీమ రచయమ్
తథాఽపీత్థం రూపం వచన మవలంబ్యాపికృపయా, త్వమే వైవంభూతం ధరణిధర! శిక్షయమనః ॥" (ఆళవందార్ స్తోత్రం-59)

(భయా భయ బంధ మోక్షాలను తెలియని వాడనై, యుక్తా యుక్త వివేక శూన్యతనూ, సకలార్థాలను విపరీతంగానూ, తలిగింప జేసే రజస్తమో గుణాలచే ఆవరింపబడినవాడనై, ఇష్టం లేకున్నా, ఇష్టమున్నవానిలాగా, కపట స్తోత్రం చేశాను. సముద్రం నుంచి భూమిని ఉద్ధరించి సర్వసహుడవైన ఓ దేవా! కృపతో ఈ కపట స్తోత్రాన్ని సత్యమైన దానిగా స్వీకరించి, మనోవాక్కాయాలు ఋజువుగా లేక కృత్రిమంగా వర్తించే నా మనస్సును శిక్షింపుము. అంటే నాకు ఇతర విషయాలయందు ఆసక్తి లేకుండా కేవలం నీ కైంకర్య రూపమైన పురుషార్థమందు ప్రేమాధిక్యాన్ని కలిగించుమని ఈ శ్లోకభావం). శ్రీయామున మునులు స్తోత్రంలో చివరకు నైచ్యాను సంధానాన్ని చేయగా, శ్రీ దేశికులు మొదటనే చేశారు కదా!

బుద్ధి కొద్దిగా ఉండడం వల్ల మోహం ఎక్కువయింది. దాని కారణంగా కరణత్రయం ఏకాకారంగా లేదు. తన్మూలకంగా హితా హిత వివేకం శూన్యమయింది. ఇవి అన్నీ అనుచితమైన స్తోత్రాన్ని ఆరంభించదానికి ఒక కారణమాలగా వర్ణింపబడ్డాయి.

"దోషోయ ద్యపితస్యస్యాత్" అన్నట్లు, జగన్నాటక రంగానికి ప్రభువు కాబట్టి, దోషపూరితమైన వస్తువును కూడా దయతో భోగ్యంగా అంగీకరిస్తాడు, అని దేశికుల అధ్యవసాయం.

**4. మరుత్త రణి పావక త్రిదశ నాథ కాలాదయః,**
**స్వకృత్య మధికుర్వతే త్వదపరాధతో బిభ్యతః ।**
**మహత్ కిమపి వజ్ర ముద్యత మివేతి యచ్ఛ్రూయతే,**
**తరత్యనఘ ! తద్భయం య ఇహ తావకఃస్తావకః ॥**

**అర్థం :-** అనఘ = దోషం లేని ఓ రంగనాథా! త్వత్+అపరాధతః = నీ పట్ల కలిగే అపరాధాలవల్ల; బిభ్యతః = భయపడుతున్నవారైన; మరుత్- ఆదయః। మరుత్ = వాయువు, తరణి = సూర్యుడు, పావక = అగ్ని, త్రిదశనాథ = దేవేంద్రుడు, కాల = యముడు, ఆదయః = మొదలైన దేవతలు; స్వకృత్యం = తమ కర్తవ్యాన్ని, అధికుర్వతే = సమర్థంగా చేస్తున్నారు. ఇతి = అని; ఉద్యతం = ఎత్తబడిన; వజ్రం+ ఇవ = వజ్రాయుధం వలె; కిం+అపి = ఒకానొక; మహత్ = గొప్ప; భయం = భీతి; యత్ = ఏదైతే; శ్రూయతే = (ఉపనిషత్తులో) వినబడుతున్నదో; తత్ = ఆ భయాన్ని; ఇహ = ఈ లోకమందు; యః = ఎవడు; తావకః = నీ సంబంధమైన; స్తావకః = స్తోత్రం చేసేవాడో; (సః = అతడు) తరతి = దాటుతుంటాడు.

**తా॥** దోషరహితుడవైన ఓ రంగనాథా! నీ విషయమై అపరాధం కలుగుతుందో అని భయపడుతున్న వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, యముడు మొదలైన దేవతలు తమ తమ పనులను చక్కగా నిర్వహిస్తున్నారు. ఎత్తబడిన వజ్రాయుధాన్ని పోలియున్న ఆ గొప్ప భయాన్ని నిన్ను స్తోత్రం చేసే వాడు దాటుతాడు- పొందలేడని భావం.

**వ్యాఖ్య :-** శ్రీరంగనాథుణ్ని స్తుతించిన వ్యక్తి నిర్భయుడవుతాడు.

అనఘుడు రంగనాథుడు. అఖిల హేయ ప్రతిభటమైన వాడు. సమస్త కల్యాణ గుణ సముద్రుడు. ఆయన ఏ పనిచేసినా, పాప పుణ్యాలు ఆయనను అంటుకోవు. ఆయన పరమ చేతనుడు. 'న కర్మణా లిప్యతే పాపకేన' అని శ్రుతి

పలుకుతుంది. "నమాంకర్మాణి లింపంతి" నన్ను పాపాలు తగుల్కోవు అన్నాడు భగవానుడు. (భ.గీ.4-14) ఈ జగత్తే ఆయన నాటక రంగం. ఆయన నిరంకుశ, స్వతంత్ర ప్రభువు. శ్రుతులూ, స్మృతులూ ఆ ప్రభువు యొక్క శాసనాలు. వాటిని ఉల్లంఘించిన ద్రోహులను 'నక్షమామి' - ఏనాటికిని క్షమించను - అని క్రోధంతో తిరస్కరిస్తాడు. ఆశ్రితులు సాపరాధులైననూ 'నత్యజేయమ్' - వారిని విడువ జాలను - అని రక్షించి తీరుతాడు. "పరద! సకలమే తత్ సంశ్రితార్థంచకర్థ"- అన్నట్లు, ఆశ్రిత రక్షణ కోసం తన సర్వస్వాన్ని ఉపయోగిస్తాడు. కాబట్టి 'నతస్యేశేకశ్చన' అని శ్రుతి వాక్యం చెబుతున్నట్లు, సర్వ నియామకుడైన ఆయన వంటివాడు గానీ, ఆయనకు నియామకుడు గానీ మరొకడు లేని శుద్ధ సత్త్వ మయ విగ్రహుడు, ఉభయ విభూతి సనాథుడు శ్రీరంగనాథుడు.

**1. మరుత్తరణి - బిభ్యతః :-** అయా కార్యాలను నిర్వహించడానికి అధిపత్యం కల్పించబడిన దేవతలు కూడా, శ్రీ రంగనాథుని ఆజ్ఞను మీరి, అపరాధులమవుతామో అని, భయపడి తమ తమ పనులను యథావిధి నెరవేరుస్తున్నారని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.

**"భయాదస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః ।**
**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥"** (కఠోపనిషత్తు 2-3-3)

అగ్న్యాది దేవతలూ, యముడు కూడా భగవంతునికి భయపడి తమ విధులను అతి జాగ్రత్తగా నెరవేరుస్తుంటారని కఠోపనిషత్తు కూడా చెప్పింది.

మహత్ - శ్రీయతే :- వారి గుండెల్లో గూడు కట్టుకొనియున్న గొప్ప భయం, ఎత్తబడిన వజ్రాయుధమే. "మహద్భయం వజ్ర ముద్యతం" అని (కఠోపనిషత్తు 2-3-2) చెప్పింది. 'పిడుగు' ఎప్పుడు పడుతుందో తెలియకున్నా, అది ఎంత భయంకరమైనదో అందరికి తెలిసిందే.

ఈ ప్రాబల్యాలన్నీ ఈ శ్లోకంలో హృదయావర్జకంగా సంపదింపబడినాయి. "సంవాదిన్యో మేధావినాంబుద్ధయః" అని కదా సూక్తి.

**2. తరతి-స్తావకః :-** శ్రీరంగనాథుణ్ని భక్తి ప్రపత్తులతో స్తుతించే వారికి, దేవతలకు

కలుగుతున్న ఆ మహాభయంకూడా సంక్రమించదు. భయకారకుడే అయినా, ఆ శ్రియఃపతి 'స్తవ ప్రియుడు' కాబట్టి అనుగ్రహించి అభయ ప్రదుడవుతాడు. "భయం కుతస్స్యాత్ త్వయిసానుకంపే". (అష్టభుజాష్టకం. 5) నీవు సదయుడవై యుండగా,నాకు భయం ఎక్కడి నుంచి, ఎందుకు కలుగుతుంది? అని దేశికులన్నారు.

"భయం భయానా మపహారిణి స్థితే
మనస్య నంతే మమకుత్రతిష్ఠతి?"

అన్ని భయాలను పోగొట్టే భగవానుడు నా చిత్తమందున్నప్పుడు ఇక భయమెక్కడ ఉంటుంది? తన యందు భయం ఉండడానికి చోటు - అవకాశమే లేదన్నాడు ప్రహ్లాదుడు. భగవంతుని నిరంకుశైశ్వర్యాన్ని తెలిపే ఈ శ్లోకంలో 'ఉత్ప్రేక్ష' అనే అర్థాలంకారం ఉన్నది. 'వృత్త్యనుప్రాస' అనే శబ్దాలంకారమూ ఉన్నది.

**5. భవంత మిహయః స్వధీ - నియత చేతనా చేతనం,**
**పనాయతి నమస్యతి స్మరతి వక్తి పర్యేతివా ।**
**గుణం కమపి వేత్తి వా తవ గుణేశ! గోపాయితుః,**
**కదాచన కుతశ్చన క్వచన తస్యన స్యాత్ భయమ్ ॥**

**అర్థం :-** గుణేశ = గుణాలకు అధిపతివైన ఓ రంగనాథా! స్వధీ-తనం । స్వ = స్వీయ (నీ); ధీ = సంకల్పం చేత; నియత = నియమింపబడిన, చేతన = జీవులు, అచేతన = జడవస్తువులు గల; భవంతం = నిన్ను; యః ఎవడు; ఇహ = ఈ లోకమందు; పనాయతి = స్తుతిస్తాడో; నమస్యతి = నమస్కరిస్తాడో; స్మరతి = ధ్యానిస్తాడో; వక్తి = కీర్తిస్తాడో; పర్యేతి, వా = ప్రదక్షిణ చేస్తాడో; గోపాయితుః = రక్షకుడవైన; తవ = నీ యొక్క; కం+ఆపి = ఏదో ఒక; గుణం = గుణాన్ని; వేత్తి,వా= తెలుసుకుంటాడో; తస్య = వానికి; కదాచన = ఎప్పుడుగానీ, కుతశ్చన = ఎవని వల్లగానీ, క్వచన = ఎక్కడగానీ; భయం = భీతి; న,స్యాత్ = కలుగదు.

**తా॥** సకల కల్యాణ గుణసనాథా! శ్రీరంగ నాథా! నీ సంకల్పంతో చరాచర పదార్థాలను నియమించిన నిన్ను ఈ లోకంలో ఎవడు స్తోత్రం, నమస్కారం, ధ్యానం, సంకీర్తన, ప్రదక్షిణమూ చేస్తాడో, రక్షకుడవైన నీ అనంత కల్యాణ గుణాలలో ఏదో

ఒక గుణాన్ని తెలుసుకొంటాడో, అతనికి ఏ వేళగానీ, ఏ చోటగానీ, ఎవని వల్లగానీ భయం కలుగదు.

వ్యాఖ్య:- భగవద్విషయ పరిజ్ఞానం కల వ్యక్తికి భయం కలుగదని వర్ణితం.

రంగనాథుడు గుణాలకు ఈశుడు. అనంత కల్యాణ గుణాలు భగవంతుణ్ని ఆశ్రయించి ఉన్నాయి.

యది సంతి గుణాః పుంసాం వికసంత్యేవ తే స్వయం ।
నహికస్తూరి కామోదః శపథేన నివార్యతే ॥" (కువలయానందం)

వ్యక్తికి గుణాలున్నాయని చెప్పనక్కర లేదు. ఉంటే, అవి తమంతతామే వెల్లడి అవుతాయి. కస్తూరి ఉన్నచోట అది లేదని శపథం చేసినా, దాని వాసన దాగదు కదా!

భగవద్గుణాలన్నీ ఆయన స్వరూపాన్ని నిరూపించేవే కదా! గుణాలే వ్యక్తిని ప్రకాశింపజేస్తాయి. "గుణాః పూజ్యాః" కాబట్టి, ఆది కవియైెన, వాల్మీకి శ్రీరామచంద్రమూర్తిని చారిత్రిక పురుషునిగా వర్ణించాడు.

**1. స్వధీ నియత - అచేతనం :-** "ధీః ప్రజ్ఞా శేముషీమతిః" (అమరం) భగవానుడు ప్రజ్ఞాన ఘనుడు. సత్యసంకల్పుడు. సత్యకాముడు. "సోఽ కామయత, బహుస్యాం ప్రజాయేయ, తత్సృష్ట్వా"- (తైత్తిరీయమ్) "నేను అనేక విధాలవుతాను", అనే సంకల్పంతో చేతనులను, అచేతనాలను సృష్టించి, వాటికి తాను నియామకుడయ్యాడు.

'చేతన' మంటే జీవాత్మ. జీవునికి జ్ఞానం ఒక గుణంగా ఉంటుంది. ధర్మ భూత జ్ఞానమని దీనికి పేరు. ధర్మియైన జీవాత్మ జ్ఞానమయుడు, ఆనందుడు, అమలుడు కూడ. జీవాత్మ తనకు తానే ఎప్పుడూ ప్రకాశిస్తుంటాడు. అణువుగా ఉండే జీవుడు స్వస్వరూపాన్ని, సమస్త వస్తువులను ధర్మ భూత జ్ఞానం చేతనే తెలుసుకొంటాడు. శరీరేంద్రియాలకంటె భిన్నుడైన జీవుడు ఉత్పత్తి వినాశ రహితుడు. భగవంతునికి శేష భూతుడు. త్రివిధ స్వభావాలు జీవునికి ఉన్నాయి.

**1. అనన్య శేషత్వం :-** ఇతరులకు కాక, తాను శ్రియఃపతికే శేషభూతుడనని విశ్వసించడం.

**2. అనన్య శరణత్వం :-** ఇతరులు రక్షకులు కారు, సర్వేశ్వరుడే సర్వ శరణ్యుడని భావించడం.

**3. అనన్య భోగ్యత్వం :-** ధారక, పోషక భోగ్యాలు, సర్వం శ్రీమన్నారాయణుడే అని తృప్తి పడుతూ, అతని యందే ప్రేమ కలిగియుండడం.

ఇట్టి జీవాత్మలు అసంఖ్యేయాలు. ఈ జీవులు మూడు విధాలుగా ఉంటారు.

**1. బద్ధులు :-** అనాది కర్మ బంధం చేత జన్మిస్తూ, మరణిస్తూ ఈ సంసారంలో పరిభ్రమించేవారు.

**2. ముక్తులు :-** ఈ కర్మ భూమిలోనే ఉండి, సదాచార్య సంబంధం ద్వారా మోక్షోపాయాన్ని అనుష్ఠించి, వైకుంఠ లోకాన్ని పొందిన వారు.

**3. నిత్యులు :-** భగవానుని లాగా ఎప్పుడూ కర్మ సంబంధం లేనివారై, పరమ పదమందే లక్ష్మీనాథునికి సర్వవిధ కైంకర్యం చేస్తూ, ఆయననే అనుభవిస్తూ ఉండే అనంత, గరుడవిష్వక్ సేనాదులు.

'అచేతనం' అంటే జ్ఞాన శూన్యమైన వస్తువు. ఈ అచేతనం చేత ఏర్పడే ఫలం సర్వేశ్వరుని సంకల్పాధీనంగా చేతనుడు అనుభవిస్తాడు.

'అచేతనం' కూడా త్రివిధంగా ఉంటుంది.

**1. త్రిగుణం :-** దీన్నే 'మూలప్రకృతి' అంటారు. సత్త్వరజస్తమో గుణాలు కల ప్రకృతి సతత పరిణామవతి. ఈ మూడు గుణాలు సమానంగా ఉన్నప్పుడు మహా ప్రళయ మేర్పడుతుంది. ఈ గుణాలు ఎక్కువ తక్కువగా ఉన్నప్పుడు ప్రకృతి అనేక తత్త్వాలుగా మారుతుంది.

ఈ ప్రకృతి యే 'మహాన్' తత్త్వంగా పరిణమిస్తుంది. మహత్తత్త్వం నుంచి త్రివిధమైన 'అహంకార' మనే తత్త్వం కలుగుతుంది.

1) సాత్త్వికాహంకారం నుంచి ఏకాదశేంద్రియాలు (కర్మ జ్ఞానేంద్రియాలు (5+5), మనస్సు (1) సంభవిస్తున్నాయి.

2) తామసాహంకారం తన్మాత్రల ద్వారా పంచ భూతాలను కలుగజేస్తుంది. తామసాహంకారం నుంచి క్రమంగా శబ్ద తన్మాత్రచే ఆకాశం; స్పర్శతన్మాత్ర చేత

వాయువు; రూప తన్మాత్ర చేత తేజస్సు; రసతన్మాత్రద్వారా జలం; గంధ తన్మాత్ర ద్వారా పృథివి కలుగడం ప్రాపంచికం.

3) ఈ రెండు అహంకారాలు తమ పనులను చేస్తున్నప్పుడు సహాయంగా ఉండేది రాజసాహంకారం.

'తన్మాత్ర' అంటే, పూర్వ రూపం పూర్తిగా నశించకుండా, ఉత్తర రూపం పూర్తిగా కలుగకుండే మధ్యమావస్థ. శరీరాది అచేతన వస్తువులన్నీ పాంచ భౌతికాలే.

**2. కాలం :-** ఇది జడమే, కాని విభువుగా ఉంటుంది. దీనిలో సత్త్వాది గుణాలు లేవు. భూత భవిష్యద్వర్తమానాది వ్యవహారాలకు కాలమే కారణం. లోకంలోని మార్పులన్నీ భగవంతుని సంకల్పాధీనంగా కాలం చేత ఏర్పడుతుంటాయి. వైకుంఠంలో మాత్రం ఈ కాల పరిణామం లేదు. అక్కడ అంత భగవత్సంకల్పాధీనమే.

**3. శుద్ధ సత్త్వం :-** రజస్తమో గుణాలతో ఏ మాత్రమైనా సంబంధం లేని విలక్షణ ద్రవ్యమే శుద్ధ సత్త్వం. ఇది కేవలం పరమ పదమందే ఉంటుంది. వైకుంఠంలో ఉండే వారి శరీరాలు మొదల్కొని గడ్డిపోచ వరకు, సకల వస్తువులన్నీ శుద్ధ సత్త్వమయమైనవే.

ఈ అచేతనమైన ప్రకృతితో సంబంధం కలిగియున్న జీవునికి సాధారణంగా మమతాహంకృతులు కలుగుతాయి. భగవంతునికి అభిముఖంగా ఉండనీయక జీవునికి ప్రాకృత విషయాలయందు ఆసక్తిని కలిగించడం ప్రకృతి లక్షణం.

ఈ చేతనా చేతన మయమైన జగత్తునే శరీరంగా కలిగిన పరమాత్మను స్తుతించడమే జీవాత్మలకు పరమార్థం.

**2. పనాయతి :-** "పన-స్తుతౌ" అనిధాత్వర్థం.

"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే " (ఋక్కు) దివ్య సూరులు (నిత్యాత్మలు, ముక్తాత్మలు) పరమ పదనాథుణ్ని సేవిస్తూ, "హా ఉ హా ఉ హా ఉ" అని సామగానం (స్తోత్రం) చేస్తూ వెలుగుతుంటారు.

**3. నమస్యతి :-** "భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ". (శ్రుతి). "నమో విష్ణవే బృహతే కరోమి" (శ్రుతి). "నమో నమోఽనంతదయైక సింధవే". వేద మూర్తులూ,

ఆచార్యులూ ఆశ్రిత వాత్సల్యైక జలధియైన శ్రియఃపతికి స్వరూపానుగుణమైన నమస్కారాలను పదే పదే చేస్తుంటారు.

**4. స్మరతి :–** తన స్మారం స్మారం గుణగణమితీ చ్ఛామి గతభీః". దయా సింధువైన ఓ స్వామి! నీ గుణాలను స్మరించి స్మరించి జ్ఞాన తిరోధాయకమైన సంసార మందున్న భయంతొలగిన వాడనై కైంకర్య విరోధి నివృత్తిని కోరుతున్నాను. అన్నారు శ్రీ యామున మునులు.

"తిరునారణన్తాళ్ శిన్దిత్తుయ్ మినో" శ్రీమన్నారాయణ పాద పద్మాలను ధ్యానం చేస్తూ జీవించడం శ్రేయస్కరమన్నారు నమ్మాళ్వార్లు.

"స్మిత ఫుల్లా ధర పల్లవం స్మరామి" (గోపాలవింశతి)

చింతయామి హరి మేవ సంతతం, మంద మంద మాసితాన నాంబుజమ్" (ముకుందమాల)

**5. వక్తి :–** "యథా రత్నాని జలధేరసంఖ్యేయాని పుత్రక! తథా గుణాహ్యానం తస్యాప్య సంఖ్యేయా మహాత్మనః"॥

సముద్రంలో లెక్కింప రానన్ని రత్నాలు ఉన్నట్లే, భగవంతునికి లెక్కపెట్ట లేనన్ని కల్యాణ గుణాలున్నాయి. "నామాని గౌణాని విఖ్యాతాని". అనంత గుణాలను బట్టి ఏర్పడిన భగవంతుని అనేక నామాలను మహర్షులు కీర్తించారు.

"స్వాభావికా నవధి కాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజస్సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సౌమ్యకారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్య కామ సత్య సంకల్ప కృతిత్వ కృతజ్ఞతాద్య సంఖ్యేయ కల్యాణ గుణగణౌఘ మహార్ణవ". (శరణా గతి గద్యం) అని భగవద్రామానుజులు గుణ సంకీర్తనం చేశారు.

"సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం విముక్త దుఃఖాః సుఖినోభవంతి".

'నారాయణ' అనే ఒక్క నామాన్ని కీర్తించినంతనే సర్వ దుఃఖాలు (భయాలు) తొలగి సుఖవంతులవుతారు. (వి.స.నా. ఉత్తర పీఠిక) ఇలా, భక్తి ప్రభావం వివరింపబడుతున్నది.

**6. పర్యేతి :-** భగవత్సన్నిధిలో, నిండు గర్భవతి నీరు నిండిన కుండ నెత్తుకొని మెల్లగా నడిచినట్లే, బద్ధాంజలులై ప్రదక్షిణం చేయాలి.

**7. గుణం, కమపి వేత్తి :-** అనంత గుణాలలో ఏదైన ఒక గుణాన్ని తెలుసుకోవడం "పిణంగి యమరర్ పిదత్తుమ్, కుణజ్గెషు కొళ్గైయినానే". (తి.వా.మొ) భగవద్గుణాలలో ఒక్కొక్క గుణమందు ఆకృష్టులైన నిత్యసూరులలో ఒక్కొక్కరు ఆ గుణమే సర్వ శ్రేష్ఠమని వివాదపడుతూ, అనంతంగా సంకీర్తన చేసే కల్యాణ గుణాలు అమరిన స్వభావం కలవాడు శ్రియఃపతి, అని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి.

"యదేకైక గుణప్రాన్తే శ్రాన్తా నిగమ వందినః" ఏ గుణం చేత ఆకృష్టులైన వారు ఆ గుణమే అన్నిటిలో శ్రేష్ఠమైనదంటారు, అని దేశికులవారదే భావాన్ని ప్రకటించారు.

**8. గోపాయితుః :-** "స్వాధీన త్రివిధ చేతనా చేతన స్వరూప స్థితి ప్రవృత్తి భేదమ్" అని భగవద్రామానుజులు 'గద్యం' లో అనుగ్రహించారు. సకల చేతనా చేతనుల స్వరూపం, స్థితి, ప్రవృత్తి నివృత్తులు భగవంతుని అధీనాలే. కాబట్టి సర్వ రక్షకుడు శ్రీహరియే. "ఏకస్తిష్ఠతి విశ్వాత్మా సతునారాయణః పరః". అవాంతర ప్రళయకాలంలోనూ ఒక్కడే, బ్రహ్మ రుద్రేంద్రాది చరాచర జగత్తును కబళీకరించి, తన గర్భమందు ఉంచుకొని రక్షించేవాడు శ్రియఃపతియే.

**"తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్" (తై.ఉ)**

**"త్యజంత మాహరంతంచ శ్వాసోచ్ఛ్వాస ద్వయేనచ ।**

**ఆ బ్రహ్మ భువనం సర్వం కర్మ ప్రాధానికం యత్ ॥"**

కర్మ ప్రధానమైన అండకోటి బ్రహ్మాండాన్ని శ్వాస చేత బయటకు వదలుతాడు. ఉచ్ఛ్వాస చేత లోనికి తీసుకొంటాడని స్మృతి చెబుతుంది కదా! మళ్ళీ సృష్టికాలాన విశ్వాన్ని సృజిస్తాడు. తాను జీవం ద్వారా వాటిలో ప్రవేశిస్తాడు. నామ రూపాలతో కూడిన వస్తువులుగా చేస్తాడు. ఇలా విశ్వరూప కల్పన భగవదధీనమే.

స్థితి :- సృష్టించిన జగత్తులో బలవంతులు దుర్బలులను బాధించకుండే రీతిగా వారి వారికి ఇష్టప్రాప్తిని, అనిష్ట నివృత్తిని కలుగజేస్తూ కాపాడుతుంటాడు.

ప్రవృత్తులు :- నిల్చుండడం, కూర్చోవడం, పడుకోవడం, తిరుగడం మొదలైనవి. నివృత్తులు :- నిలువకుండడం, కూర్చుండకుండడం, పడుకోకుండడం, తిరుగకుండడం ఇత్యాదులు భగవదధీనాలే.

**"న సంపదాం సమహారే విపదాం వినివర్తనే ।**
**సమర్థో దృశ్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్ ॥"**

సంపదల నివ్వడానికి గానీ, ఆపదలను పోగొట్టడానికి గానీ పురుషోత్తముడే తప్ప వేరొక సమర్థుడు కనబడడు.

ఇతర దేవతలనాశ్రయించిన వారికి కోరిన ఫలాలను ఆ దేవతలిస్తున్నట్లు పైకి కనబడుతుందే కాని, నిజంగా వాటిని ఇచ్చేది ఆ దేవతలకు అంతర్యామిగా ఉన్న శ్రీమన్నారాయణుడే.

"నహి పాలన సామర్థ్యం ఋతే సర్వేశ్వరం హరిమ్". శ్రీహరికే తప్ప రక్షించే సామర్థ్యం ఏ దేవతకు కూడా లేదు.

"అవర వర్ విదివషియడైయ నిన్ఱనరే" (తి.వా.మొ) ఆయా దేవతలకు అంతరాత్మగా ఉండి, అదృష్టానుసారంగా, వారికి ఫలప్రదాన శక్తి కలిగించి, వారినీ, వారిని ఆశ్రయించిన వారినీ రక్షిస్తుంటాడని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి. కాబట్టి శ్రియః పతియే గోపాయిత.

'పనాయతి, వక్తి' అనేవి వాచిక కైంకర్యాన్ని; 'స్మరతి' అనేది మానసిక కైంకర్యాన్ని; నమస్యతి; పర్యేతి' అనే పదాలుకాయిక కైంకర్యాన్ని తెల్పుతున్నాయి.

'వా' అనే అవ్యయం వికల్పార్థకం.

**9. కదాచన, కుతశ్చన :-** "యతోవాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ. ఆనందం బ్రహ్మణో విద్వాన్. నబిభేతి కదాచనేతి". అని మరొక చోట "నబి భేతి కుతశ్చనేతి" అని తైత్తిరీయోపనిషత్తు బోధిస్తున్నది.

వేదాలు వాక్కుచే, మనస్సు చేత కూడా తెలుసుకోలేని అనంతమైన పరబ్రహ్మ యొక్క ఆనందగుణాన్నీ, ఆనందదమైన పరబ్రహ్మనూ, పరిశుద్ధమైన మనస్సుతో తెలుసుకొన్న వ్యక్తి ఎప్పుడూ, ఎవరివల్లనూ భయపడడు - అని ఉపనిషదర్థం.

ఈ శ్లోకంలో వేద శబ్దాలు అక్షరాలా ప్రయుక్తమై సామాన్యంగా ఆ భావమే ప్రకటింపబడింది. (వేదాంత దేశిక) కవి నామం అన్వర్థమవుతున్నది కదా! 'గుణేశ' అనే సంబోధనాన్తపదం శ్లోక భావాన్ని సమగ్రంగా ఆవరించి, రచనా సౌందర్యాన్ని వెల్లడిస్తున్నది. అంతేకాదు, ఆ పదం శ్లోకంలో తృతీయ పాదమందున్నది. త్రిపాద్విభూతియందు సమస్త కల్యాణ గునపరిపూర్ణుడైన ఉన్న పరవాసుదేవుడే తన గుణాలను ప్రకాశింపజేయడానికి కృపతో భూమండలానికి వేంచేసి, ఉభయ కావేరీ మధ్యన అర్చా రూపంతో వెలిసియున్న రంగనాథుడని, అర్థాంతర సంక్రమిత వాచ్యంగా ధ్వనిస్తున్నది. "భవంత మిహ,- నస్యాద్భయమ్" అనే ఆద్యంత పదాలు 'ఇక్కడ నిన్ను గూర్చి మాకు భయం ఉండకపోవుగాక' అని ఆనాటి చరిత్రనూ స్ఫురింపజేస్తున్నాయి.

**6. స్థితే మనసి విగ్రహే గుణిని ధాతు సామ్యేసతి**
**స్మరేదఖిల దేహినం య ఇహ జాతుచిత్ త్వామజమ్ ।**
**తయైవ ఖలు సన్ధయా తమథ దీర్ఘ నిద్రావశం**
**స్వయం విహిత సంస్మృతి ర్నయసి ధామ నైశ్రేయసమ్ ॥**

**అర్థం :-** ఇహ = ఈ లోకమందు; యః = ఏ వ్యక్తి, మనసి = మనస్సు, స్థితే = దృఢమైయుండగా; గుణిని = గుణాలు కల్గిన, విగ్రహే = శరీరం; ధాతుసామ్యే సతి= సమధాతువైయుండగా; అఖిల దేహినం = సమస్తం శరీరంగా కలిగియున్న; అజం = పుట్టుక లేనివాడనై; త్వాం = నిన్ను, జాతు చిత్ = ఒకప్పుడైనా; స్మరేత్ = స్మరిస్తాడో; తయా = ఆ; సన్ధయా, ఏవ = స్మరణ మాత్రం చేతనే; అథ = (ఆయుః కాలం ముగిసిన) తర్వాత; దీర్ఘ నిద్రావశం = పెద్ద నిద్దురకు వశుడైన; తం = ఆ వ్యక్తిని; స్వయం = స్వయంగా (నీవే) విహిత సంస్మృతిః = చేయబడిన సంస్మరణ గలవాడవై; నైశ్రేయసమ్ = మోక్ష సంబంధమైన; ధామ = స్థానాన్ని; నయసి, ఖలు= చేర్చుతున్నావు కదా!

**తా॥** రంగనాథా ! ఈ ప్రపంచంలో ఏ వ్యక్తి, మనస్సు నిశ్చలంగా ఉండి, దేహం తన అదుపులో ఉన్నప్పుడు జగమంత శరీరంగా కలిగియున్న, అజుడవైన నిన్ను ఒక్కసారియైనా స్మరిస్తాడో, అతని మరణకాల మందు నీవే అతణ్ని స్మరించి వైకుంఠానికి చేర్చుతున్నావు.

వ్యాఖ్య:- ప్రపత్తి ప్రభావం వర్ణితం.

తనను తలచిన వ్యక్తి మరణించే సమయాన తానే తలచి అతనికి ముక్తిని ప్రసాదించే దయాళువు భగవానుడు. దేహం క్షణ భంగురం. ఇంద్రియాలు విషయాసక్తి కలవి. మనస్సు చంచలం కదా! ఈ పాంచ భౌతిక దేహమందు బద్ధుడైన జీవుడు "వాసుదేవ మనారాధ్యకో మోక్షం సమవాప్స్యతి?" అంతట వ్యాపించియున్న భగవంతుణ్ని ఆరాధించకుండా ముక్తిని పొందగలడా? పొందలేడు. ఆరోగ్యంగా ఉన్న కాలాన ప్రాపంచిక విషయాలను-భోగాలను- అనుభవిస్తూ, ముసలితనం వచ్చినప్పుడు సదాచార్యుల నాశ్రయించి, మంత్రోపదేశాన్ని పొంది భగవంతుణ్ని ధ్యానిస్తే మోక్షం పొందలేమా? అని జనులు కాలయాపన చేస్తారు.

అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్ । యఃప్రయాతి సమద్భావం యాతినాన్యత్ర సంశయః ॥ (7-5) మరణ సమయమందు కూడా నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచే వ్యక్తి నన్నే పొందుతాడని గీతాచార్యుడు ఉపదేశించాడు కదా! అని కొందరంటారు. నిజమే. (చ = కూడా, అనే పదాన్ని గమనించాలి)

నారాయణ మంత్రమూ ఉన్నది. నోట మాటా ఉన్నది. కాని, జీవితంలో ఎన్నడూ స్మరించే అభ్యాసమే లేకపోతే చావ సిద్ధమైనప్పుడు భగవన్నామం జ్ఞాపకం రాదనీ చెప్పాడు. మరణ సమయాన దేన్ని స్మరిస్తే ఆ రూపంతోనే మళ్ళీ పుట్టుతాడనీ వెంటనే సుశ్లోకింపబడింది కదా!

మృత్యువు కంటె భయంకరమైన ఆ పత్తు లేదు కదా! ధాతువులు విషమిస్తాయి. అంటే కఫ పాత పిత్తాదులు సమంగా ఉండక విజృంభిస్తాయి. చిత్తం చెత్తగా మారుతుంది. కనుగ్రుడ్లు మెలిక లేస్తాయి. నోరు పడిపోతుంది. గుండె బండరాయి అవుతుంది. మెయ్యి కొయ్య బారుతుంది. చుట్టాలందరు బావురుమని ఏడుస్తారు. ఆమహా విపత్తులో దయామయుడైన చక్రం గల దేవుడు తప్ప ఈ జీవుణ్ని కాపాడే సమర్థుడెవడు ? (సం.సూ. 10-33) అంటారు దేశికులు.

ఈ శ్లోకం, వరాహస్వామి భూదేవికి ఉపదేశించిన చరమశ్లోకాన్ని అక్షరాలా స్మరింపజేస్తుంది.

**"స్థితే మనసి సుస్వస్థే శరీరే సతియో నరః ।**
**ధాతు సామ్యే స్థితే స్మర్తా విశ్వరూపంచ మామజమ్ ॥**
**తతస్తం మ్రియమాణంతు కాష్ఠ పాషాణ సన్నిభమ్ ।**
**అహంస్మరామి మద్భక్తం నయామి పరమాంగతిమ్॥".**

"మనస్సు నిలుకడగా ఉండి (కఫవాత పిత్తాది) ధాతువులు సమానంగా ఉండి, శరీరం స్వాధీనంలో ఉన్నప్పుడు నన్ను స్మరిచే మానవుడు మరణ సమయాన కొయ్యబారి, పాషాణంలాగా పడిపోయి నన్ను స్మరించలేనప్పుడు నేనే అతణ్ని స్మరించి పరమ పదానికి తీసుకొని పోతాను" అని చరమ శ్లోకార్థం.

భగవానుడు ఈ లోకమందవతరించి ప్రపత్తి విద్యను ప్రకాశింపజేసినా, దానివలన "ధర్మపుత్రాది గళుక్కు ఫలం రాజ్యం, దౌపదిక్కు ఫలం వస్త్రం" (శ్రీవచన భూషణం.1-33) యుధిష్టిరాదులు రాజ్యాన్ని, ద్రౌపది వస్త్రాన్ని, కాకాసురుడు, కాళీయుడు ప్రాణాలను - అంటే, ఇహలోక ఫలాలనే పొందారు కదా!

పర, వ్యూహ, విభవాంతర్యామి అనే నాలుగు రూపాలలో ముముక్షువులై ఆశ్రయించనందువల్లనే కావచ్చు, భగవానుడు

**"సులభం మోక్ష సిద్ధ్యర్థం భవామ్యర్చా స్వరూపవాన్ ।**
**నివసిష్యా మిసర్వత్ర జనానాం ముక్తి హేతవే ॥"**

జనులందరు సులభంగా మోక్షం పొందడానికి అంతట అర్చామూర్తిగా వెలసియుండగలనని ప్రకటించాడు.

మొట్టమొదటి అర్చారూపుడైన శ్రీరంగనాథుడు కూడా -

**"మామే వాను స్మరస్వ త్వం, త్వామహం సంస్మరామిచ ।**
**ఉపాయ మ పర్గస్య రహస్య మపి మే శ్రుణు ॥**
**సర్వకర్మాణి సంత్యజ్య సర్వకర్మ ఫలానిచ ।**
**శరణం మాంప్రపద్య స్వ, సర్వ బంధ విముక్తయే ॥"**

నీవు నన్ను స్మరించు, నేను కూడా నిన్ను స్మరిస్తాను. "రక్షకుడవు నీవే' అని ప్రపత్తి చేయు. పుణ్య పాపకర్మల ఫలమైన బంధాలన్నీ తొలగిపోయి, మోక్షానందాన్ని

పొందుతావు – అని చరమ శ్లోకాన్ని ప్రకటించాడు.

అఖిల దేహీ :– భగవానుడు విశ్వరూపుడు. "య ఆత్మనితిష్ఠన్ ఆత్మనో అంతరోయం ఆత్మాన వేద, యస్యాత్మా శరీరమ్". (బృహ. ఉప) పరమాత్మ జీవునిలో ఉన్నాడు. జీవుడాతనికి శరీరం. అయినా జీవుడాయన నెరుగడు.

"యస్య పృథివీ శరీరం యఃపృథివీ మంతరే సంచరన్; యం పృథివీ నవేద". (సుబాలోపని) శ్రీమన్నారాయణునికి భూమి శరీరం. ఆయన ఆ భూమిలో సంచరిస్తున్నా భూమి ఆయన నెరుగదు. "తిడవిశుంబెరివళి" (తి.వా.మొ. 1–1–7) జీవ ప్రకృతులకు, పరమాత్మకు గల సంబంధం శరీరాత్మ భావమని ఉభయ వేదాంతాలు విశదీకరిస్తున్నాయి.

అజుడు :– కర్మ సంబంధమైన జన్మలేని వాడు.

జాతుచిత్ :– జీవితంలో ఒక్కసారి స్మరించినా – పూర్ణ ప్రపత్తి చేసినా – చాలు. ఆ స్మర్త యొక్క అవసానదశలో ఆశ్రియఃపతియే అతనిని బాగా జ్ఞాపకముంచుకొని అర్చిరాది మార్గంగా పరమపదానికి కొని పోతాడు.

"అప్పొషుదుక్కు ఇప్పొషుదేశొల్లివెత్తైన్" అప్పటి కోసం ఇప్పుడే స్మరించి యున్నాను, అన్నారు నమ్మాళ్వార్లు.

"తాయ్ నినైన్ద కన్టే యొక్క, ఎన్నైయుమ్ తన్నైయే నినైక్కచ్చెయ్దు,
తానెనక్కాయ్ నినైన్దు అరుళ్ శెయ్యుమప్పన్" (పెరియ తిరుమొళి. 7–3–2)

అని తిరుమంగై మన్నన్ సర్వేశ్వరుడే తనను స్మరించి అనుగ్రహించాలని ప్రార్థించారు. భగవద్విషయక రతి భక్త్యంగకం కాబట్టి ప్రేయోఽలంకారం.

**7. రమాదయిత ! రంగభూ రమణ ! కృష్ణ! విష్ణో ! హరే!**
**త్రివిక్రమ ! జనార్దన ! త్రియుగ నాథ ! నారాయణ !**
**ఇతీవ శుభదాని యః పఠతి నామధేయానితే**
**న తస్య యమవశ్యతా నరకపాత భీతిః కుతః ॥**

అర్థం :– రమా దయిత = శ్రీ వల్లభా! రంగ భూ రమణ = రంగ భూ నాయకా! కృష్ణ = దేవకీ నందనా! విష్ణో = విష్ణు దేవా! త్రివిక్రమ = త్రివిక్రమా! జనార్దన =

జనార్దనా! త్రియుగనాథ = మూడు జతల గుణాలు గల ప్రభూ ! నారాయణ = సర్వ ద్రవ్యాలకు స్థానమైన వాడా! ఇతి+ఇవ =ఇలాగా; శుభదాని = మంగళప్రదాలైన; తే = నీ యొక్క; నామధేయాని = నామాలను, యః = ఎవడు; పఠతి = పఠిస్తాడో; తస్య = అతనికి; యమవశ్యతా = యమునికి వశుడై ఉండడమే; న = లేదు; నరక పాత భీతిః = నరకంలో పడే భయం; కుతః = ఎక్కడిది?

**తా॥** లక్ష్మీ వల్లభా! రంగ భూపతీ! కృష్ణా! విష్ణూ! హరీ! త్రివిక్రమా! జనార్దనా! షడ్గుణ నాయకా! నారాయణా! అని ఈ విధంగా శ్రేయోదాయకాలైన నీ నామాలను పఠించే వ్యక్తి యమునికే పట్టుబడడు. ఇక అతనికి నరక లోకంలో పడియుండే భయమెందుకుంటుంది?

**వ్యాఖ్య:-** భగవన్నామ సంకీర్తన మహిమ వర్ణితం.

గత శ్లోకం స్మరణను తెల్పింది. ఈ శ్లోకం కీర్తనను బోధిస్తున్నది. సాధారణంగా జ్ఞానేంద్రియాలు. కన్నులు, చెవులు - రెండేసి ఉన్నా, చేసే పని ఒక్కటే. నాలుక ఒక్కటే అయినా భుక్తి, ముక్తి - రెండింటికి సాధనం. “సాజిహ్వాయా హరిం స్తౌతి” హరి నామాన్ని కీర్తించే నాలుకకే గురుత్వముంటుంది. భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు స్మరణ, కీర్తనలను మొదట ప్రకటించాడు.

నామ పఠనమంటే గళమెత్తి, అందరికి నోరూరగ, రుచులు పుట్టేరీతిగా, గానం చేయడం.

“సఖాయ ఆనిషీదత! సవితాస్తోమ్యోను నః ! దాతా రాధాంసి శుంభతి॥” (ఋక్కు) - మిత్రులారా! వచ్చి కూర్చోండి. మనలను పోషించే భగవానుడు సామూహికంగా కీర్తింపదగినవాడు. (రాధాంసి) సర్వసిద్ధులను ఇచ్చేవాడు. (శుంభతి) పవిత్రులనూ చేస్తాడని అర్థం.

శుభదాని :- “అశుభాని నిరాచష్టే, తనోతి శుభ సంతతిమ్” (వి.పు) భగవంతుని ఒక్క నామధేయాన్ని కీర్తించినంత అది అశుభాలను తొలగిస్తుంది, శుభ పరంపరలను కలిగిస్తుంది.

**"హానః పూర్వం వాక్ ప్రవృత్తా న తస్మిన్,**
**తేన ప్రాప్తం గర్భ వాసాది దుఃఖమ్॥"**

పూర్వ జన్మలలో మన వాగింద్రియం (నాలుక) పరబ్రహ్మను గూర్చి నామగాన సంకీర్తనం చేయనందువల్లనే ఈ జనన మరణ రూప సాంసారిక దుఃఖం ప్రాప్తమయిందని కులశేఖర మహారాజు పశ్చాత్తాపడి ముకుందుణ్ని స్తోత్రం చేశాడు.

**"ప్రాయశ్చిత్తాన్య శేషాణి తపఃకర్మాత్మ కానివై ।**
**యాని తేషా మశేషాణాం కృష్ణాను స్మరణం పరమ్ ॥"** (వి.పు)

తపస్సంబంధమైన, కర్మ సంబంధమైన ప్రాయశ్చిత్త కర్మల కంటె - మనం చేసిన ఆయా కర్మలలోని లోపాలను తొలగడానికి చేసే కర్మల కంటెను - శ్రీ కృష్ణాను స్మరణం సర్వశ్రేష్ఠమైనదన్నాడు శ్రీ పరాశర మహర్షి.

భగవ ద్దివ్య నామాలలో కొన్నింటిని ఈ శ్లోకంలోని పూర్వార్ధం కీర్తించింది.

**1. రమాదయితుడు :-** లక్ష్మీదేవికి ప్రియుడు, జగదుద్భవస్థితి ప్రళయాలు క్రీడా ప్రాయాలైన రమా దేవి-లక్ష్మి-యే ప్రేయసిగా కలవాడని రెండర్థాలు.

**2. రంగ, భూ, రమణుడు :-** శ్రీరంగ నాథుడు ఇక్ష్వాకుల రాజధానియైన అయోధ్యయందు ఏండ్లకొలది పూజింపబడినాడు. శ్రీరామ చంద్ర స్వామి తన కుల ధనమైన శ్రీరంగనాథుణ్ని తనకు ఇష్టుడైన విభీషణునికి 'నీవు లంకలో పూజించు' మని ఇచ్చాడు. కాని దారిలో, కావేరీ ద్వీపమందే శ్రీరంగనాథుడు వేంచేసియున్నాడు. అయినా "తెన్ దిశై ఇలంగై నోక్కి" (తొండరడిప్పొడి యాళ్వార్లు సాయించినట్లు) విభీషణుని రాజధానియైన దక్షిణ దిక్కే తన దృష్టిని ప్రసారించియున్నాడు. కాబట్టి శ్రీరంగ భూ నాయకుడు' అని పేరు.

**3. కృష్ణుడు :-** నల్లనివాడు. గోప జనుల చిత్తాలను ఆకర్షించిన వాడు. "జగౌ గోపీజన స్త్వేకం కృష్ణ నామ పునః పునః" (వి.పు.5-13-52) గోపీజనం కృష్ణుని నామాన్ని పునశ్చరణ చేసింది.

"కృషిర్భూవాచకః శబ్దో, ణశ్చనిర్వృతి వాచకః"- 'భూ' శబ్దానికి ఉత్పత్తి అని అర్థం. సృష్టిలో ఉన్న చరాచర వస్తువులన్నిటికి సుఖాన్ని, ఆనందాన్ని ప్రసాదించే

వాడనే ఈ శుభ నామం, కృష్ణావతారం కంటె ముందే, ప్రసిద్ధమైనది.

**4. విష్ణువు :-** విశతీతి - విష్ణుః.

"వివేశ భూతాని చరాచరాణి".

జంగమస్థావరాత్మకమైన తన విభూతి యందంతటం ప్రవేశించేవాడు.

వివేష్టీతి - విష్ణుః. ప్రాణులకు కావలసిన వాటిని ఇచ్చి అంతట వ్యాపించియుండేవాడు.

**5. హరి :-** "హరిః హరతి పాపాని".

తనను కీర్తించే భక్తుల తాపాలనూ, పాపాలనూ హరించే- పోగొట్టేవాడు.

"వర్ణశ్చమే హరిఃశ్రేష్ఠః తస్మాద్ధరిరహం స్మృతః". (భారతం) నా రూపం ముదురాకు పచ్చ వన్నె కలది. కాబట్టి నా పేరు 'హరి'.

"బ్రహ్మాణమీశం రుద్రంచ యమం వరుణమేవచ ।
ప్రసహ్య హరతే యస్మాత్, తస్మాద్ధరిహోచ్యతే ॥"

బ్రహ్మరుద్రేంద్రాది దేవతలను బలవంతంగా స్వాధీనం చేసుకొనేవాడు. హరి, దేవతలందరి కంటెను అధికుడని ధ్వని.

**6. త్రివిక్రముడు :-** బలి చక్రవర్తిని యాచించి ప్రతిగ్రహించబడిన మూడడుగుల భూమిని కొలిచే నెపంతో బ్రహ్మాండాంత సంవర్థియైన రూపాన్ని స్వీకరించాడు. "ఇదం విష్ణుర్వి చక్రమే. త్రేధానిదధేపదం" (శ్రుతి) చేతనా చేతనమనే విభాగం లేకుండా విష్ణు పాద ముద్ర పడి సర్వం వైష్ణవమయింది. "అధిక్షియంతి భువనాని విశ్వా" (ఋక్కు). సమస్త భువనాలు ఆ బృహత్పాద పద్మం క్రింద ఇమిడి పోయాయి. మరొక అడుగుచే ఊర్ధ్వ లోకాలను కొలిచాడు. సత్య లోకంలో ఆ పాదాన్ని బ్రహ్మదేవుడు ధర్మ తీర్థంచే అభిషేకించాడు. అప్పుడు ఆ వామపాదన ఖాగ్రం నుంచి ముల్లోకాలను పవిత్రం చేసే గంగానది ఉద్భవించింది, ఉద్గమించింది. "యావదస్థి మనుష్యాణాం గంగాతో యేషు తిష్ఠతి । తావ ద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥" అనే కీర్తికి పట్టయింది గంగ.

భగవద్దయచే ప్రపంచం తత్పాదాంకిత మవడమే ప్రధాన ప్రయోజనం

కాగా, బలి గర్వాన్ని అపహరించడం ఆనుషంగికమైనది. "చరాచరమ చీకర శ్చరణ పంకజేనాంకితమ్" అని దేశికులు స్తుతించారు. (దయాశతకం. 85) "ఓంగి యులగళన్ద ఉత్తమన్" అని గోదా దేవి కీర్తించింది. "త్రిరి త్యేవం త్రయోవేదాః కీర్తితాముని సత్తమైః। క్రమో పేతాన్ తథా సర్వాన్ త్రివిక్రమ ఇతిస్మృతః॥" (భారతం) మూడు వేదాలను ఆక్రమించినవాడు త్రివిక్రముడు. ఋగ్యజుస్సామ వేదాలు భగవానుని మహిమను ప్రకటించాయి. "సర్వే వేదాయత్రైకం భవంతి" భగవన్మహిమను చెప్పడంలో వేదాలన్ని ఐక్యం చెందాయి కదా!

**7. జనార్దనుడు :-** భగవానుడు భక్తులను బాధించే జనులను (అర్దయతి) అణచి వేసేవాడు కాబట్టి, ఆయనకు ఆ నామ ధేయం.

**8. త్రియుగుడు :-** (3×2 =6) మూడు జంటలు- జ్ఞాన-శక్తి; బల-ఐశ్వర్య; వీర్య-తేజస్సులు- అనే షడ్గుణాలు కలవాడు.

వాల్మీకి శ్రీరామచంద్ర స్వామిని షడ్గుణుడన్నాడు.

"ఆనృశంస్యం, అనుక్రోశః శ్రుతం, శీలం, దమః, శమః।

రాఘవం శోభయంత్యేతే షడ్గుణాః పురుషోత్తమమ్॥" (అయోధ్యాకాండ. 33-9)

**9. నాథుడు :-** ఉభయ విభూతులను - ఇహ పరలోకాలను - నియమించే ప్రభువు.

(త్రియుగ నాథుడు - అని ఒకే పదంగా చెప్పవచ్చు)

**10. నారాయణుడు :-** "అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (యాజ్ఞిక్యుపనిషత్తు) చూడబడేదీ, వినబడేదీ అయిన బ్రహ్మాండమందు, మండుతుండే ఇనుపగుండులో అగ్నివలె, లోపటా, బయటా, అంతట నిండియుండేవాడు.

సర్వ భూతాలయందు తానుండే వాడు, తనయందు భూతాలు కలవాడు నారాయణుడని అన్వర్థనామం.

న, తస్యయమవశ్యతా :- "పరిహర మధుసూదన ప్రపన్నాన్"

"పుండరీకాక్షునికి ఏకాంత భక్తులైన వైష్ణవులకు కాలపాశం వేయకుండా

దూరంగా నీవు తొలగిపోవాలి సుమా!" అని యమ ధర్మరాజు తన భటునికి చెవిలో చెప్పినాడంటే, ఇక యముడు వచ్చి భగవన్నామ సంకీర్తన పరులను స్వాధీనం చేసుకొనే ప్రాభవం లేనివాడే కదా!

నరకపాత భీతిః కుతః? -

యముని చేతికైనా చిక్కక నారాయణ నామాన్ని బాహాటంగా భజన చేసే వారికి, అథోలోకమైన నరకంలోపడే భయమెక్కడిది? అనే భావం కైముత్యన్యాయ సిద్ధం. కావార్థాపత్త్యలంకారం.

**8. కదా చిదపి రంగభూరసిక! యత్ర దేశే వశీ**
**త్వదేక నియతా శయ స్త్రిదశ వందితో వర్తతే ।**
**తదక్షత తపోవనం తవచ రాజధానీ స్థిరా**
**సుఖస్య సుఖమాస్పదం సుచరితస్య దుర్గం మహత్ ॥**

**అర్థం :-** రంగ భూరసిక = శ్రీ రంగక్షేత్రమందు అధిక ప్రీతిని కలిగియున్న రంగరాజా! వశీ= ఇంద్రియాలను నిగ్రహించినవాడు, త్వత్+ఏక, నియత+ఆశయః । త్వత్ = నీ యందు; ఏక = ముఖ్యంగా, నియత = నిశ్చలమైన, ఆశయః = మనస్సు కలవాడు; త్రిదశ వందితః = దేవతలచే నమస్కరింపబడినవాడు; యత్ర, దేశే = ఏ స్థలమందు; కదాచిత్+ అపి = ఒకప్పుడైనా; వర్తతే = ఉండునో; తత్ = ఆ స్థలం; అక్షత, తపోవనం = ఆటంకం లేకుండా తపస్సు చేసుకోదగిన వాటిక; తవ = నీకు; స్థిరా = స్థిరమైన; రాజధానీ, చ = రాజధాని కూడ, సుఖస్య = ఇహ పర సుఖానికి; సుఖమాస్పదం = సుఖమిచ్చే స్థానం. సుచరితస్య = సుకృతానికి; మహత్ = గొప్పదైన; దుర్గం = కోటయే.

**తా॥** రంగస్థల రసికుడవైన ఓ రాజా! జితేంద్రియుడూ, నీయందు మాత్రమే నిశ్చలిత మనస్కుడూ అయినందువల్ల దేవతలచే నమస్కరింపబడే భాగవతోత్తముడు ఎప్పుడో ఒకప్పుడు ఉండే ప్రదేశమే అభేద్యమైన తపోవనం. నీకు స్థిరమైన రాజధాని అది. ఐహికాముష్మిక సుఖాలకు సుఖదాయకమైనది. అది పుణ్య దుర్గమే.

**వ్యాఖ్య :-** భక్తుడున్న క్షేత్రమందే భగవంతునికి రాసిక్యమని వర్ణితం.

ఒకప్పుడైనా భాగవతోత్తములుండే స్థలం కాబట్టి, శ్రీరంగనాథుడు కావేరి యొక్క అంతరీపమందు అధికాభిరుచి కలిగి వేం చేసియున్నాడని సుశ్లోకితం.

**1. వశీ :-** ప్రమాదకరమైనవి ఇంద్రియాలు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతరింద్రియం - ఇవన్నీ ప్రాపంచిక భోగాలను అనుభవింపజేసి జీవుణ్ని సంసారబద్ధుణ్ని చేస్తాయి. ఆధ్యాత్మిక సంపన్నుడు ప్రాకృతిక భోగ బంధాలను తెంచుకోవడానికి, శరీరమందున్న ధాతువులను చెలరేగజేసే రసస్నిగ్ధాలైన ఆహార పదార్థాలను దేహ ధారణ మాత్రమై, మితంగా గ్రహించి, ఇంద్రియాలను తన వశమందుంచుకొని, భగవదభిముఖుడై ధ్యానోపాసనాది సేవా నిరతుడైన వాడు. జితేంద్రియుడు.

**2. త్వదేక నియతాశయః :-** ఈ సమాసపదమందు 'ఏక' పదం పట్టుగొమ్మ. సర్వ దేహాన్ని పట్టి నిలిపేది ఆశయం- హృదయమన్న మాట. మృదుతల ఫణిరాట్ భోగ పర్యంక శాయి యందే తన హృదయాన్ని నిలిపి ఉంచే భాగవతుడు. ప్రాపంచిక, విషయ భోగాల మీద ఉండే ప్రీతినంతా సర్వశేషియందలి ప్రీతిగా మల్చుకొంటాడు. "యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ। త్వామనుస్మరతోమేఽద్య హృదయాన్మాప సర్పతు ॥" పామరులకు ప్రాకృత పదార్థాల మీద ఎడబాయని ప్రేమ ఏదైతే ఉన్నదో, అట్టి ప్రేమతో నిన్ను మాత్రమే ధ్యానించే నా హృదయం నుంచి అది తొలగి పోకుండా అనుగ్రహించుమని ప్రహ్లాదుడు శ్రీ నృసింహ స్వామిని ప్రార్థించాడు.

**3. తపోవనం :-** సంయమీంద్రులు నిరాటంకంగా తపమాచరిస్తుంటే, భక్తులు ధ్యానమగ్నులవుతుంటే, ఆ పరమై కాంతుల హృదయాలు శుష్కించకుండా, చుట్టూ ఆవరించి ఆర్ద్రంగా ఉంచే స్వచ్ఛమైన శీతలోదకం గల క్షేత్రమది. కాబట్టి, "అత్త పత్తర్ శుత్తి వాషుమ్ అమ్ దణ్ణీర రంగమే"- (తిరచ్చంద విరుత్తమ్-52) అని తిరు మళిశైయాళ్వార్లు ప్రస్తుతించారు.

**4. రాజధాని :-** "మునయశ్చ మహాత్మానః వసంత్యసిన్ శిలోచ్చయే". (రా) శ్రీరామచంద్రుడు, ఇక్కడ మునులూ, జ్ఞానాధికులూ ఉంటారనే ఆదరంతో చిత్రకూట మందు తన నివాస మేర్పరచుకొన్నాడు. "తిరువరంగప్పెరునగర్" అని కులశేఖరాళ్వార్లు,

పెద్ద నగరంగా, నుతించారు. 'రంగ' శబ్దాన్ని తమిళంలో 'అరంగ' మంటారు. ఆ భాషలో ఆ పదానికి 'దీవి' అని అర్థం. నదీ తీరాలలోనే పెద్ద పట్టణాలుంటాయి కదా! రంగనాథుని రాజధాని కావేరి నడుమ సైకత ద్వీపమందున్నది.

"క్షీరాబ్ధేర్మండలాత్ భానోర్యోగినాం హృదయాదపి ।
రతింగతో హరిస్తస్మాత్ రంగ మిత్యభిధీయతే ॥"

పాలకడలి కంటె, సూర్యమండలం కంటె, యోగుల హృదయాలకంటె కూడా శేషశాయికి ఈ క్షేత్రమందు ఎక్కువ ఆసక్తి ఉన్నందువల్ల దీనికి 'రంగ' మని పేరు కలిగింది.

**5. సుఖమాస్పదం :-** ఐహికా ముష్మిక సుఖాలను ప్రసాదించే భూలోక వైకుంఠమే శ్రీరంగం. "అత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ". తాను ఉండడమే కాక, మహాత్ములను కూడా 'ఈ క్షేత్రమందే సుఖాన్ని పొందుతూ ఉండండి' అని రంగనాథుడు నోరూరగచవులు పుట్టించాడు. "భగవత్ప్ర భావం భగవాన్హి వేత్తి, తథాభవంతో భగవత్ప్ర భావః॥" భగవన్మహిమ భాగవతులకు, భాగవత మహిమ భగవంతునికే తెలుస్తుంది.

**6. సుచరితస్య దుర్గం మహత్ :-** ఈ క్షేత్రంలో ఏ మంచి పని చేసినా, ఆ నోముల పంటను అభేద్యంగా రక్షించే పెట్టని పెద్ద కోట అది. "పుణ్యానా మపి పుణ్యోఽసౌ". వివేకుడనే రాజు భారతదేశమందు సముచిత సంయమ స్థానాన్ని కనుగొనడానికి విమానంలో నుంచి పరిశీలించాడట. భగవచ్చరితామృతాన్ని ఆస్వాదించే భాగవతోత్తములకు రుచించనట్టి (అది కాశిగానీ, అయోధ్యగానీ) నగరమే లేదన్నాడు. (సం.సూ. 6వ అంకం)

పుణ్య స్థలాలలోకెల్ల పుణ్య స్థలమైన శ్రీరంగ క్షేత్రమందెందరో భాగవతోత్తములు నివసించారు, నివసిస్తున్నారు. కాబట్టి వారందరు త్రిదశ వందితులే. "ప్రణమంతి దేవతాః". అన్నట్లు స్వర్గలోకమందు నివసించే దేవతలూ, ఆజానజ కర్మ దేవతలూ అందరు భగవానునియందు ప్రావణ్యం కలవారికి నమస్కరించారు. నమస్కరిస్తారు. ఇంత వైభవంగల ఈ పుణ్యక్షేత్రం మీద మనసు పడినవాడు కాబట్టి

లంకకు చేరకుండా, దారిలోనే కదలకుండా నిలిచి, తనకు స్థిరమైన రాజధానిగా చేసుకొన్నాడు కదా!

"మన్నుడై విబీడ నర్కాయ్ మతిళిలజ్జై
తిశైనోక్కి మలర్కణ్ వైత్త, ఎన్ను
డైయ తిరువర జ్ఞర్కు". (పెరియా.తి.మొ. 4.9.2)

'గొప్ప వైభవంతో విభీషణుని కోసం కోటలు కలిగిన లంకా నగరం దిక్కును కటాక్షిస్తూ, తన కనుదమ్ములను అటే ఉంచిన నా శ్రీరంగ రసికునికి' అని ఆ పెద్ద కోయిల్ వైభవాన్ని ప్రశంసించారు శ్రీ విష్ణుచిత్తులు. ప్రేయోఽలంకారం.

**9.** **త్రివర్గ పథవర్తినాం త్రిగుణ లంఘనోద్యోగినామ్**
**ద్విషత్ ప్రమథనార్థినా మపిచ రంగదృశ్యోదయాః ।**
**స్ఖలత్ సమయకాతరీ హరణ జాగరూకాః ప్రభో**
**కరగ్రహణ దీక్షితాః క ఇవతే న దివ్యా గుణాః ॥**

**అర్థం :-** ప్రభో = శ్రీ రంగరాజా! రంగదృశ్య+ ఉదయాః = శ్రీరంగమందు చూడదగిన, అభ్యుదయం కలిగినట్టి; తే = నీ యొక్క; కే, ఇవ = ఎన్నో ఉత్కృష్టాలైన; దివ్యాః = ప్రకాశయోగ్యాలైన; గుణాః = గుణాలు; త్రివర్గ పథవర్తినాం = ధర్మార్థ కామాలనే మార్గమందు నడిచే వారికి; త్రిగుణ లంఘన+ఉద్యోగినాం = సత్త్వ రజస్తమో గుణాలను దాటడానికి ప్రయత్నించే వారికి; అపి, చ = మరియు ద్విషత్, ప్రమథన+అర్థినాం = శత్రువులను అణచివేసే కోరిక కలవారికి; ద్విషత్ప్రమథన = భగవంతుణ్ని, అర్థినాం = ప్రార్థించేవారికి; స్ఖలత్, సమయ, కాతరీ హరణ, జాగరూకాః = జారి పడుతున్న సమయమందలి భయాన్ని పోగొట్టే ఔత్సుక్యం (స్పందన) కలవై; కరగ్రహణ దీక్షితాః = చేతిని పట్టుకోవడమందు పట్టుదల కలవి; న = కావా?

**తా॥** ఓ రంగరాజా! నీ దివ్య గుణాలు ఎన్నో శ్రీరంగమందు (శ్రీరంగం నుంచి) ప్రసరిస్తూ అభ్యుదయం కలిగించి చూడ ముచ్చటగా ఉన్నాయి. ఆ కల్యాణ గుణాలు ధర్మార్థ కామాలనే త్రివర్గమందు సంచరించేవారికి, సత్త్వ రజస్తమో గుణాలు కల్గిన ప్రకృతి మండలాన్ని దాటడానికి యత్నించే వారికి, శత్రు వర్గాన్ని మర్దించే కోరిక

కలవారికి కూడా. భగవద్భోగార్థులకు కూడా, జారి పడుతున్న సమయమందు కలిగే భయాన్ని పోగొట్టే ఆసక్తి కలవై, చేయూతనిచ్చి రక్షించే దీక్ష కలవి కావా?

వ్యాఖ్య:- భగవత్కల్యాణ గుణాలు చేతనులకు చేయూతనిచ్చి, భయాన్ని పోగొట్టి, రక్షించే దీక్ష కలవని స్తుతి.

ఒక శిశువు చిన్నగా నడకను నేర్చుకొంటున్నప్పుడు పడిపోతానేమో అని భయపడడం సహజమే కదా! అప్పుడా శిశువుకు కలిగే భయాన్ని పోగొట్టడానికి సన్నిహితుడు చేయూత నీయడం లోక పరిపాటి.

**1. త్రివర్గ పథ వర్తినాం :-** ధర్మార్థ కామాలు అనే మూడు పురుషార్థాలకు త్రివర్గమని పేరు. లోకంలో ఈ త్రివర్గ ఫలాన్ని అపేక్షించి, ఆ పద్ధతినే అనుసరించి, యత్నించే చేతనులు కొందరున్నారు. అర్థ కామాలు జీవన నిర్వాహకాలు కాబట్టి అవి అనాదరింప దగినవి కావు. కామమంటే ఇచ్ఛ. త్రికాలాల యందు చేయబడే క్రియ అంతా ఇచ్ఛా వ్యాపారమే.

"నహి కామనయా వినా కేనచిత్ చక్షుషో నిమే షోన్మేషనం కర్తుం శక్యతే".

కామన లేకుండా కనురెప్ప కూడా వేయజాలడు.

**"ఆ కామస్య క్రియా కాచిత్ దృశ్యతే నేహ కర్మచిత్ ।**
**యద్యద్ధి కురుతే కించిత్ తత్ కామస్య చేష్టితమ్॥"**

ఇచ్ఛ లేని క్రియయే కనిపించదని అర్థం. "ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ". (భ.గీ.7-11) ధర్మానికి విరుద్ధంగా లేని కామాన్ని అనుభవించడం భగవంతునికి ఇష్టమే కదా!

మానవుడు తన గుణ కర్మల ద్వారా లోకాన్ని ఆరాధించడం స్వధర్మం. వేద శాస్త్రాది స్వరూపంతో సమాజ శ్రేయస్సు కోసం బోధించే చట్టమే ధర్మం. "ధ్రియతే ఇతి ధర్మః" (ఇది కరణ వ్యుత్పత్తి). "ధరతీ తిధర్మః. సమస్త ప్రపంచాన్ని నిలకడగా ఉంచుతున్నది అని అర్థం. (ఇది కర్త్రర్థక వ్యుత్పత్తి).

"అభ్యుదయ నిశ్శ్రేయస సాధనం ధర్మః". ఇది కణాదుని వైశేషిక సూత్రం. స్వధర్మాచరణ వల్ల సమకూరే ధనధాన్యాది వస్తు సంపదలే అర్థం. "శౌచానా

ముత్తమం శౌచమర్థ శౌచం పరంస్మృతమ్ ॥" తృణ మపి పరకీయంనా పహార్యమ్". ఇతరులకు సంబంధించిన గడ్డి పరకనైనా అపహరించకూడదని నీతి. త్రివర్గ సాధనకు ఉపకరణం గృహిణి. నాల్గు ఆశ్రమాలలో గృహస్థాశ్రమం ఉత్తమం.

**"చతుర్ణామాశ్రమాణాంహి, గార్హస్థ్యం శ్రేష్ఠమాశ్రమం".**

**"యథా ధర్మః స్వభార్యా చ పరస్పర వశానుగౌ ।**

**తథా ధర్మార్థ కామానాం త్రయాణా మపి సంగమః ॥"** (భారతం)

ధర్మాత్ముడైన పురుషుడు, అతనికి అనుకూల వతియైన భార్య, వినయ విధేయతలు కల్గిన సంతానం- ధర్మార్థ కామాల సంగమంలాంటిది. అంటే త్రివర్గ ఫలం ఉండే స్థానమని అర్థం. "ఇప్పారోర్ శౌలప్పట్ట మూన్టన్టే, అమ్మూన్టు మారాయిల్ తానే యఅమ్ పొరుళిన్బమెన్టు" ఈ లోకులు చెప్పేవి మూడే. అవి ఏవి? అంటే ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలు కదా!" అని తిరుమంగై యాళ్వార్ శిఱియ తిరుమదల్ ప్రబంధంలో నొక్కి చెప్పారు.

"స్యాద్ధర్మ మస్త్రియాం పుణ్యం" అని నిఘంటువు. ధర్మమంటే పుణ్యం, సుకృతమని అర్థం.

"యజ్ఞోదాన తపశ్చైవ పావనాని మనీషిణామ్"-

మనన శీలం కలవారికి యజ్ఞాలు, దానాలు, తపస్సు, వాపీ కూప తటాకారామ మందిరాది నిర్మాణాలు పవిత్రమైనవి. అంటే, "ధర్మేణ పాపమపనుదతి". ఇట్టి పుణ్యకర్మలచేత పాపం నశిస్తుంది. కాబట్టి, ధర్మార్థ కామాః సమ మేవ సేవ్యాః " (భారతం) ధర్మాన్నీ, అర్థాన్నీ, కామాన్నీ, సమానంగా శ్రద్ధతో పాటించేవారు త్రివర్గ పథవర్తులు.

**2. త్రిగుణ లంఘనోద్యోగినాం :-** త్రిగుణమంటే ప్రకృతి స్వరూపాన్ని ఎప్పుడూ విడువకుండే ధర్మాలైన సత్త్వ రజస్తమస్సులు. ఈ మూడు ప్రకృతి గుణాలు.

**"సత్త్వం సుఖే సంజయతి, రజః కర్మణి భారత ।**

**జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత ॥** (భ.గీ. 14-9)

1. సత్వగుణం సుఖ సంగాన్ని కలుగజేస్తుంది.

2. రజోగుణం రాగతృష్ణాదుల చేత కర్మ సంగాన్ని కల్పిస్తుంది.
3. తమోగుణం జ్ఞానాన్ని కప్పి వేసి కర్తకు విపరీత ప్రవృత్తి కలుగజేస్తుంది.

అవ్యయమైన ఆత్మను అంటే, తనంత తాను గుణ సంబంధానికి అనర్హుడైన జీవాత్మను ప్రకృతి వికారాల చేత నిర్మితాలైన దేహాదులందు బంధించేవి కదా ఈ మూడు గుణాలు. ప్రకృతి సంసర్గం చేత ఆత్మ స్వరూపానికి అనుబద్ధాలైన సత్త్వ రజస్తమో గుణాలు అప్పుడప్పుడు ఒక గుణాన్ని అణచి మరొక గుణం విజృంభించడం వల్ల పురుషునికి జ్ఞానా జ్ఞానాదులు కలుగుతుంటాయి. కాబట్టి త్రిగుణాలకు ఫలభేదాలూ ప్రకృతి సిద్ధమైనవే.

గుణ త్రయాత్మకమైన ప్రకృతి మండలం నుంచి కడతేరి మోక్ష ఫలాన్ని పొందడానికి ప్రయత్నించే వారు కొందరు.

**3. ద్విషత్ ప్రమథనార్థినాం :-** ఈ విధంగా ధర్మ కార్య నిర్వాహకులూ, మోక్ష సాధనావ లంబికులూ శ్రీరంగనాథుని దివ్య మంగళ విగ్రహాన్ని సేవిస్తూ, భగవదానం దానుభవాన్ని పొందుతుంటారు. వారి ఆనందానికి అడ్డు తగిలే అరిషడ్వర్గాన్ని అణచి వేసే కోరిక గల వారికి అభ్యుదయాన్ని వృద్ధిని పొందించేవి స్వామి యొక్క కల్యాణ గుణాలు !

**4. అపిచ :-** శ్రీరంగ నగరాన్ని శత్రువులు ఆక్రమించిన ఘోర విపత్సమయమది. భగవన్మందిరాన్ని ముట్టడించకుండా యత్నించిన ప్రపన్నులెందరో- స్త్రీలూ, పురుషులూ- అసువులను బాసినారు. అప్పుడు, భగవద్భాగవత ద్వేషం కలిగిన శత్రువులను ధ్వంసం చేయగోరిన వారికి కూడా 'శ్రీరంగనాథుడు ఆర్తత్రాణ పరాయణుడు' అనే మహా విశ్వాసం ఉన్నది.

**5. స్ఖలత్ సమయ కాతరీ హరణ జాగరూకాః :-** తమ ధర్మాచరణ వేళలోనే సహజంగానో, ప్రామాదికంగానో ఎన్నో లోపాలూ, అపచారాలూ కలుగుతుంటాయి. వాటి వల్ల తాము కోరుకున్న ఫలం కలుగకుండునో? లేదా, ఏదైనా కీడు కలుగునో? అని వారు భయపడడం నైసర్గికమే కదా!

'స్ఖలత్ సమయ' మంటే గడచిపోతున్న కాలమనీ; లోపిస్తున్న ఆచారమనీ

(రెండు) అర్థాలున్నాయి. ముష్కరుల ముట్టడిచేత ఎంతో కాలం గడచిపోతున్నదనీ, తమ సంప్రదాయానుష్ఠానాలు లోపిస్తున్నాయనీ, ముఖ్యంగా, శ్రీరంగనాథుని తిరువారాధనకూ, నిత్యోత్సవాలకూ, దివ్య స్తోత్రాను సంధానాలకూ తామూ అన్వయించని విధంగా తమ ఆచార లోపమూ జరుగుతున్నదనే భయం ధర్మానుష్ఠాన పరులకు కలుగడం చెప్పనక్కర్లేదు. స్వధర్మ నిర్వహణానికి లోపం జరుగుతున్న ఈ దశలో వారికి కలిగే భయాన్ని పోగొట్టేవి భగవత్కల్యాణ గుణాలు.

'కాతరీ హరణ జాగరూకాః' అనడం వల్ల వారికి కలిగిన భయానికే భయాన్ని కలిగించేవి అనే భావమూ ఉంది.

**6. ప్రభో :-** 'ప్రభు' శబ్దం యొక్క సంబోధన ప్రధమా విభక్త్యేక వచనాన్త రూపమిది.

ప్రకర్షేణ భునక్తి, ఇతి = ప్రభుః. భాగా అనుభవించేవాడు; బాగా పాలించేవాడు అని అర్థం. ప్రజల కష్టాలను తాను అనుభవిస్తున్నట్లు బాధపడుతూ, కష్టాల కడలి నుంచి వారిని కడదేర్చి పాలించే వాడు ప్రభువు అనబడుతాడు. "ప్రభవ తీతి ప్రభుః". అఘటిత ఘటనా సమర్థుడు. దేవతలకూ ఉన్నత పదవులిచ్చే సమర్థుడు. సర్వోన్నతమైన మోక్ష పదవిని ఇచ్చే శ్రియఃపతి ప్రభువు. అట్టి ప్రభువు కోసం 'మాది' అనకుండా దేహధారులు 'సర్వం మీదే స్వామీ' అని ఆత్మ సమర్పణం చేసే ప్రకర్షమైన జన్మకలది 'ప్రజ'.

**7. కరగ్రహణ దీక్షితాః :-** అట్టి ప్రజ ఆపత్సముద్రంలో పడి తల మునిగినా, చేతిని పైకి చాచి 'సహాయ పడండి' అనే సంజ్ఞతో మొర పెట్టుతున్నప్పుడు, ఆ చేతినే తన చేతితో పట్టుకొని పైకి లాగి కాపాడే కట్టడి కలిగియుండేవే ప్రభు గుణాలు.

అగాధంలో మగ్నుడయ్యేవాణ్ణే కాదు. ఆకాశంలో నిల్చి 'రాఘవం శరణం గతః' అని ఆర్తితో అర్థించిన విభీషణుణ్ని, చేర దీయవద్దని చెప్పిన సుగ్రీవుని చేతనే రప్పించి "అభయం సర్వ భూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" అని సర్వ ప్రాణాలకు అభయమిస్తున్న నియమాన్ని ప్రకటించడం వల్ల, నిర్భీకుడైన విభీషణున్ని సశ్రీకునిగా చేసిన శ్రీరాముని గుణ దీక్షను మన జాతీయ సంస్కృతి-చరిత్ర తెల్పుతున్నదే కదా!

అట్టి మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామ రాజే సీతా సమేతంగా తన కుల

దైవమని పూజించిన శ్రీరంగనాథుని గుణ గణ దీక్షను ఏమని స్తుతించగలం?

**8. క ఇవతే న దివ్యా గుణాః :-** ప్రభూ! శ్రీరంగనాయకా! కస్తూరి దాచినా దాగదు. దాని పరిమళం వ్యాపిస్తుంటుంది కదా! నీ గుణాలెన్నో అవి అన్ని స్వయం ప్రకాశమైనవి కావా? నీ గుణాలను లెక్కించగలమా?

**"ఇషుక్షయాన్ని వర్తంతే, నాంతరిక్ష క్షితి క్షయాత్ ।**
**మతిక్షయాత్ నివర్తంతే, న గోవింద గుణ క్షయాత్ ॥"**

విలుకాడు తూణీరంలోని బాణాలు ముగిసినందువల్ల ఊరకున్నాడే కానీ, ఆకాశంలో చోటు లేక కాదు. అలాగే, మనస్సుకు శక్తి చాలనందువల్ల స్తుతించక, చాలింపవలసిందే కానీ, గోవిందుని యందు గుణాలు లేక కాదు; ఆయన 'సమస్త కల్యాణ గుణామృతోదధి'. 'గుణా నామా కరో మహాన్".

శ్రీరంగ రాజు గుణ సముద్రుడు, గుణాకరుడు కూడ. కాబట్టి, కష్టాల కడలిలో తలమునుకలయ్యే వ్యక్తిని, అతని ఏ ఒక్క గుణమైనా చేతిని ఊతగా నిచ్చి, ఉద్ధరించి రక్షించే దీక్షగలది.

పారార్థ్యంతో ప్రయత్నించే ఐహికా ముష్మిక సుఖార్థులకు, వారి ప్రగతి పథంలో కలిగే ప్రత్యూహాలనూ, పరి పంథులనూ నివారించి, కరావలంబమిచ్చి, కామితార్థ ఫలాన్ని ప్రసాదించే కల్యాణ గుణపయోనిధి శ్రీరంగధామ నిధి అని స్తుతించారు నిగమాన్త మహా దేశికులు. త్రివర్గాభిరతులనూ, మోక్షాభిలాషులనూ ఉద్ధరించే గుణస్తుతిలో 'కరగ్రహణదీక్షితాః' పదం సమాన దర్మంగా దీపించడం వల్ల 'దీపకాలం కాద' మిది.

**10. బిభేతి భవభృత్ ప్రభో! త్వదుపదేశ తీవ్రౌషధాత్**
**కదధ్య రస దుర్విషే బడిశ భక్షవత్ ప్రీయతే।**
**అపథ్య పరిహారధీ విముఖ మిత్థ మాకస్మికీ**
**తమ ప్యవసరేక్రమా దవతి వత్సలా త్వద్దయా ॥**

**అర్థం :-** ప్రభో = శ్రీ రంగరాజా! భవభృత్ = సంసారాన్ని భరించే చేతనుడు; త్వదుప-ధాత్ । త్వత్ = నీ యొక్క; ఉపదేశ = ఉపదేశమనే; తీవ్ర = ఘాటైన,

ఔషధాత్ = మందు వల్ల; బిభేతి = భయపడుతున్నాడు. కదధ్వ రస దుర్విషే = పెడదారి యందలి రుచి అనే చెడ్డ విషమందు; బడిశ భక్షవత్ = గాలానికి ఉన్న ఎరను మ్రింగే చేపలాగా; ప్రీయతే = సంతోష పడుతున్నాడు. ఇత్థం = ఇట్లు; అపథ్య-విముఖం । అపథ్య = అపథ్యాన్ని; పరిహార = వదలుకొనే; ధీ విముఖం = బుద్ధి లేని; తం, అపి = అట్టి వానిని కూడా; ఆకస్మికే = నిర్హేతుకమైన; వత్సలా = దోష భోగ్యమైన; త్వత్+దయా = నీ యొక్క కృప; క్రమాత్ = క్రమంగా; అవసరే = తగిన సమయమందు; అవతి = కాపాడుతున్నది.

**తా॥** ఓ శ్రీ రంగ ప్రభూ ! నీ ఉపదేశాన్ని సంసారి తీవ్రమైన ఔషధంగా తలచి భయపడుతున్నాడు. చెడ్డదారిలో నడుస్తూ ఇష్టమనే దుష్ట విషాన్ని అనుభవిస్తూ, గాలానికి గల ఎరను మింగే చేపవలె సంతోషపడుతున్నాడు. ఈ రకంగా, ఆ పథ్యాన్ని త్యజించాలనే మతి కూడా లేని వాణ్ని నీ వాత్సల్య పూరితమైన దయ క్రమంగా రక్షిస్తునే యున్నది.

**వ్యాఖ్య:-** భగవద్దయా వైలక్షణ్యాన్ని ఉగ్గడించే శ్లోకమిది.

**1. భవభృత్ :-** సంసారాన్ని మోసే జీవుడు, భవరోగాన్ని భరించే చేతనుడు అని అర్థం. రోగి తగిన ఔషధాన్ని సేవించి తన రోగాన్ని తొలగించు కోవచ్చు కదా! పూర్వ కర్మానుగుణంగా భవరోగ పీడితుడైన చేతనుడు-ఈ సంసారి- ఎవరి మాట వినడు, ఏ ఔషధం సేవించడు.

భగవానుడు భవరోగ నివారణ కోసం వేద శాస్త్రాలనూ, ముఖ్యంగా పాంచరాత్ర శాస్త్రాన్ని, గీతా శాస్త్రాన్నీ బోధించాడు. సంసారి, భగవంతుడు కృపతో బోధించిన శాస్త్రాన్ని పెడచెవిని పెడుతాడు.

'మన్మనా భవ - నా యందు మనస్సు పెట్టు, నన్ను భజించు, నన్ను పూజించు' అని చేసిన ఉపదేశాన్ని తీవ్రమైన ఔషధంగా భావిస్తాడు. రోగాన్ని అనుభవిస్తాడే కాని రోగ నివారణౌషధం మింగుడు పడదంటాడు. ఎవరైనా, ఉచితంగా ఆ ఔషధమిస్తా మన్నప్పటికి సేవించడానికి భయపడుతుంటాడు. సంసార విచ్ఛేదం కలుగుతుందని భయం.

**2. కద ధ్వరస దుర్విషే :-** ఔషధం సేవించకున్నా, మంచి పద్ధతిలో మనుగడ సాగించినా బాగుపడుతాడు కదా! అనుకొంటే అది కూడా అతనికి ఇష్టం కాదు. అప మార్గంలో సంచరించడమూ, విషప్రాయమైన భోగాలను - అన్నపానాంగనా సంగమాదులను మేద మీది అనుభవిస్తూ సంతోషపడుతుంటాడు. గాలానికున్న ఎరను మ్రింగి చచ్చే చేపలాగా అతని జీవన దశ గోచరిస్తుంది. భగవద్విషయ వ్యతిరేక శాస్త్రాల రసాలే దుర్విషయాలు.

**"ఆడు కిఱ పామ్బిన్ నిషలిలే యొతుంగి**
**ఆతళ్ళిక్కొళ్ళు మెన్ఱఱియాతే వెయ్యిలై**
**త్తప్ప ప్పెత్తో మెన్ఱు హృష్ట రాయి రుప్పారై**
**ప్పోలే యితే విషయానుభవంగళాలే**
**కళిత్తిరుక్కిఱ విరుప్పివనుక్కు".** (9-1-5 ఈడు)

(ఆడే పాము నీడలో ఒదిగి, అది మ్రింగుతుందని తెళియక, ఎండ నుంచి తప్పించుకొంటిమని సంతోషించిన వారి వలె కదా విషయానుభవం చేత గర్వించియున్న స్థితి ఇతనికి) నిజంగా, విషయానుభవమందు సుఖభ్రాంతియే తప్ప అంతా దుఃఖమే కదా!

**2. అపథ్య పరిహార ధీవిముఖం :-** అపథ్యమంటే నడువదగని దారిలో నడువడం, తినదగని పదార్థాన్ని తినడం. శ్రేష్ఠం కానిది. రోగికి పథ్య మవసరం. ఈ భవభృత్తుకు ఆ పథ్యాన్ని పరిహరించుకోవాలనే జ్ఞానమే లేదు. అయినా, భవరోగ వైద్యుడు కదా భగవానుడు.

సంసారికి ఇన్ని దోషాలున్నా, భగవానుని దయ అతనిని రక్షించడానికే ప్రతీక్షిస్తుంది.

**3. తమ వసరే క్రమాదవతి వత్సలా :-** ఆవు, ఈనిన దూడ మీది మాలిన్యాన్ని నాకి, శుద్ధి చేసి పాలిచ్చి లాలించడమే, - దోషాన్ని భోగ్యంగా భావించడమే - 'వత్సల' శబ్దానికి అర్థం. దయ ఆకస్మికమైనది. అబుద్ధి పూర్వక సుకృతంగా - అంటే తనకు తెలియకుండా దారిలో 'పర్స్' పడిపోతే అది దొరికిన మరొక వ్యక్తి అందున్న

డబ్బుచే 'పూలహారాలనుకొని భగవంతునికి సమర్పిస్తే, 'పర్స్' పోగొట్టుకొన్న వానికేర్పడే సుకృతంగా - భావించి భగవద్దయ ఆ బద్ధ జీవుణ్ని క్రమంగా తగిన సమయాన ఆవశ్యంగా రక్షిస్తుంది.

పర హిత చింతనను దయ అంటారు. గత శ్లోకంలో మనకుండే భయాన్ని పోగొట్టి, రక్షించడానికి సహాయ పడుతాయని సామాన్యంగా భగవత్కల్యాణ గుణాలు ఉగ్గడింపబడినాయి.

ఈ శ్లోకంలో ఆ కల్యాణ గుణాలలో ప్రముఖమైన, మనం ప్రార్థించకున్నా స్వయంగా మన అభ్యుదయాన్ని కోరి, సముచిత సమయాన రక్షించే, దయా గుణం అగ్గలంగా ఉగ్గడింపబడింది. ప్రత్యేకంగా, దేశికులు దయాదేవిని వంద శ్లోకాలతోనూ, పాదుకాదేవిని వేయిశ్లోకాలతోనూ స్తోత్రాం చేశారు కదా!

రూపాకాను ప్రాణితో పమాలంకార సజ్జిత మీ శ్లోకం:-

**11. అపార్థ ఇతి నిశ్చితః ప్రహరణాది యోగస్తవ**
**స్వయం వహసి నిర్భయ స్తదపి రంగపృథ్వీ ధర !**
**స్వరక్షణ మివాభవత్ ప్రణత రక్షణం తావకం**
**యదాత్థ పరమార్థవిత్ నియత మంతరాత్మేతి తే ॥**

**అర్థం :-** రంగ పృథ్వీధర = ఓ రంగభూపతీ! ప్రహరణ+ ఆదియోగః = ఆయుధాలు మొదలైన వాటిని కలిగియుండడం, తవ = నీకు; అపార్థః, ఇతి = నిష్ప్రయోజనమని; నిశ్చితః = నిశ్చయింపబడినది. తత్+అపి = అట్లైననూ; నిర్భయః = భయంలేని నీవు; స్వయం = స్వయంగా; వహసి = (ఆయుధాలను) వహిస్తున్నావు. యత్ = ఎందుకంటే; పరమార్థవిత్ = పరమార్థం తెలిసిన వ్యక్తి; తే = నీకు; నియతం = నిశ్చయంగా; అంతరాత్మా, ఇతి = అంతరాత్మ అని; ఆత్థ = చెప్పితివి. (అందువల్ల) తావకం = నీకు సంబంధించిన; ప్రణత రక్షణం = ఆశ్రితులను రక్షించడం; స్వరక్షణం+ ఇవ = నిన్ను నీవు రక్షించుకున్నట్లే; అభవత్ = ఆయెను.

**తా॥** ఓ రంగనాయకా! నీవు ఆయుధాలను ధరించడం వ్యర్థమని భావింపబడుతున్నది. అయినా భయమే లేని నీవు ఆయుధాలను స్వయంగా ధరిస్తున్నావు. కారణమేమి?

అంటే, పరమార్థాన్ని తెలుసుకొన్న జ్ఞాని నిశ్చయంగా నీకు ఆత్మయని చెప్పావు. కాబట్టి, నిన్ను ఆశ్రయించిన జ్ఞానిని రక్షించడం, నిన్ను నీవు రక్షించుకొన్నట్లే అయింది కదా!

**వ్యాఖ్య:-** భగవానుడు పంచాయుధాలను ధరించిన ప్రయోజనం వర్ణితం.

సర్వ లోకాల, లోకేశుల భయాన్ని తొలగించే భగవానుడు ఏ మాత్రం భయం లేని వాడు. మరి నిర్భయుడైన స్వామి శంఖ చక్రాద్యాయుధాలను ధరించడం నిష్ప్రయోజనమే అనిపిస్తుంది. నిర్భయుడైనా భగవానుడు పంచాయుధాలను ధరిస్తున్నాడు.

"ఆషియె షచ్చంగుం విల్లు మెష, తిశైవాషి యెష, తణ్డుమ్ వాళుమెష" (తి.వా.మొ. 7-4-1) పాశురానికి నంబిళ్ళైగారు - "తనియాకవొణ్ణాదు" ఎన్దు భయప్పట్టు తిరువాషియాళ్వానొరు కైయిలేయేతినార్"- భగవానుణ్ని ఒంటరిగా ఉండనీయరాదనే భయంతో సుదర్శన చక్రం స్వామి యొక్క ఒక చేతికెక్కింది.

**"ఇనత్తిలే యొరువన్ జీవిక్కక్కణ్డవాతే,**
**బంధు వర్గంవందు మేల్విషు మాప్పోలే,**
**మత్తై దివ్యాయుధం గళుమ్ మేల్విషున్దపడి".**

"తన వాళ్ళలో ఒకడు సంపన్నుడు కాగానే చుట్టాలందరు మీద పడే రీతిగా, మిగిలిన - పాంచజన్యమనే శంఖం, శార్ఙ్గమనే ధనుస్సు, కామోదకి అనే గద, నందకమనే ఖడ్గం - దివ్యాయుధాలు పై బడిన విధం" అని రసఘనంగా వ్యాఖ్యానించారు కదా!

తమంత తామే వచ్చి అందంగా చేరిన పంచాయుధాలను భగవానుడు ఎల్లప్పుడూ ఎందుకు ధరించాలి ?

**"పాతు ప్రణత రక్షాయాం విలంబ మసహన్నివ ।**
**సదా పంచాయుధీం బిభ్రత్ సనః శ్రీరంగనాయకః ॥"**

(శ్రీరంగ రాజస్తవం -పూ.శ. 12)

"స్వామి తన ఆశ్రితులను రక్షించడం కోసం ఆలస్యాన్ని సహించలేడు. (గజేంద్రుణ్ని రక్షించడానికి ఏ ఒక్క ఆయుధాన్నీ ధరించక త్వరపడి వచ్చాడు. అలాంటి

స్థితి మళ్ళీ కలుగకూడదనే భావంతోనే) శ్రీరంగ నాయకుడు పంచాయుధాలను ఎల్లప్పుడు ధరిస్తున్నా" దన్నారు శ్రీ పరాశర భట్టరు.

**1. పరమార్థ విత్ :-** భగవంతుణ్ని కొలిచే వారందరు భక్తులే. వాళ్ళలో జ్ఞాని గొప్ప భక్తుడు. "జ్ఞానీత్వాత్మై వమే మతమ్" (భ.గీ. 7-19) అన్నాడు. శ్రీ కృష్ణ భగవానుడు.

'పరమ అర్థం' అంటే జీవాత్మ పరమాత్మకు శేష (దాస) భూతమైనది. దీన్ని తెలుసు కొన్నవాడు జ్ఞాని.

చేతనా చేతనాలకు భగవానుడే ఆత్మ కదా! భగవానునికి జ్ఞాని ఆత్మ ఎలా అవుతాడు?

"ఉణ్ణుమ్ శోర్ పరుకు నీరుం తిణ్ణం వెత్తిలైయు మెల్లాం కణ్ణన్" జ్ఞానికి ధారక పోషక భోగ్యాలైన అన్నం, నీరు, తాంబూలాదులన్నీ వాసుదేవుడే. "మాతా, పితా, భ్రాతా, నివాసః, శరణం, సుహృత్, గతిః నారాయణః"- అనే అధ్యవసాయం కల వాడు జ్ఞాని.

జ్ఞాని పరమాత్మ స్వరూపానికి సత్తను కలిగిస్తాడు కాబట్టి 'జ్ఞాని మాత్రమే తనకు ఆత్మ' యనడం, అదియే మతం'- నా అభిప్రాయమని తెలియ జేయడం శ్రీ కృష్ణ భగవానుని స్వాతంత్ర్యానికి పరాకాష్ఠ.-"మమ ప్రాణాహి పాండవాః" అన్నాడు శ్రీ కృష్ను భగవానుడు.

తనకు ఆత్మయైన జ్ఞానిని రక్షించడమంటే, భగవానుడు తనను తాను రక్షించుకోవడానికే దివ్యాయుధాలను ధరిస్తున్నట్లు అయింది కదా!

రంగనాథా! నీవు భక్తులనూ రక్షిస్తూ, నిన్ను నీవే రక్షించుకోవయ్యా అన్న ధ్వని ఉంది. పూర్వార్థం వ్యాఘాతాలంకారం. ఉత్తరార్థం వాక్యార్థ హేతుక కావ్యలింగాకారం. 'ఇవ' ఉత్ప్రేక్షయే.

**12.** లఘిష్ఠ సుఖ సంగతైః స్వకృత కర్మ నిర్వర్తితైః
కళత్ర సుత సోదరానుచర బంధు సంబంధిభిః ।
ధన ప్రభృతికై రపి ప్రచుర భీతి భేదోత్తరైః
న బిభ్రతి దృతిం ప్రభో! త్వదనుభూతి భోగార్థినః ॥

**అర్థం :-** ప్రభో = శ్రీరంగరాజా! త్వత్+అనుభూతి, భోగ+అర్థినః = నిన్ను అనుభవించడమనే సుఖాన్ని కోరినవారు; స్వకృత, కర్మ నివర్తితైః = తమచే చేయబడిన, కర్మలవల్ల కలిగినట్టి; ప్రచుర, భీతి భేద+ఉత్తరైః = రాబోవు కాలాన గొప్ప, అనేక భయాలను, కలిగించునట్టి; లఘిష్ఠ, సుఖ సంగతైః = చాలా అల్పమైన సుఖాలతో కూడినట్టివైన; కళత్ర-సంబంధిభిః । కళత్ర = భార్య, సుత = పుత్రులు; సోదర = సహోదరులు, అనుచర = సేవకులు; బంధు, సంబంధిభిః = చుట్టాలూ, సంబంధులూ మొదలైన వారి చేతను; ధన ప్రభృతికైః+అపి = ధనమూ మొదలైన వాటి చేతను కూడ, ధృతిం = ధైర్యాన్ని సంతోషాన్ని; నబిభ్రతి = పొందకున్నారు.

**తా॥** శ్రీరంగ ప్రభూ! నీ అనుభవమనే మోక్ష ఫలాన్ని పొందగోరే మహాత్ములు, తమ కర్మల ఫలంగా పొందిన, భావికాలాన అనేక గొప్ప భయాలను కలిగించునట్టి; అత్యల్ప సుఖాన్ని పొందించేవి యైన ఆలు బిడ్డలు, తోబుట్టువులు, సేవకులు, చుట్టాలు మొదలైన వారి చేతనూ, ధన ధాన్య వస్తు వాహనాదుల చేతనూ సంతృప్తిని పొందలేరు.

వ్యాఖ్య:- ముముక్షువులు దారాపుత్రాదులనూ, ధన ధాన్యాదులనూ కించిద్భోగాలుగా భావిస్తారనే శ్లోకమిది.

మానవులకు కర్మ చేయకుంటే దేహయాత్ర సాగదు. కర్మలు నిత్య, నైమిత్తిక, కామ్యాలనీ మూడు విధాలుగా ఉంటాయి.

**1. నిత్య కర్మలు :-** స్నాన సంధ్యావందనాదులు ఇవి కర్మాంతరాచరణ యోగ్యతను కల్పిస్తాయి. అంటే స్నానం చేస్తే సంధ్యావందనానికి, సంధ్యా వందనం చేస్తే అది భగవదారాధనాది శాస్త్రీయ కర్మలను చేయడానికి అధికారాన్ని కలిగిస్తుంది.

**2. నైమిత్తిక కర్మలు :-** పర్వదినాలలోనూ, గ్రహణాది నిమిత్తాలయందును ఆచరింపవలసిన విధులు, ప్రాయశ్చిత్తాదులు. ఈ కర్మలను చేయకపోతే దోషం కలుగుతుంది. ఆ దోషం అంటకూడదనే, వాటిని ఆచరించాలి.

**3. కామ్య కర్మలు :-** స్వర్గ, పుత్ర, పశు, వృష్టి, అన్నాది ఫలాలను కోరి, అశ్వమేధ, పుత్ర కామేష్టి, ఇత్యాది యాగాల నాచరించి, ఆయా ఫలాలను పొందడం.

కామ్య కర్మలను ఆచరించే కర్మఠులు, భోగైశ్వర్యకాములు. భోగాలు అంటే

సుఖానుభవాలు స్వల్పమైనవి, స్థిరమైనవి కావు. "యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే" యజ్ఞాలు చేసి స్వర్గ ఫలాన్ని కోరిన వారు దేవ భోగాలను అనుభవించినా, చేసిన పుణ్య ఫలం తరిగి పోగానే తిరిగి మర్త్య లోకానికి చేరుకొని అశ్వాశతమైన - జనన మరణ రూపమైన - సంసార హేతువైన అల్ప సుఖాన్నే పొందుతారు కదా! తాము చేసిన కర్మలకు అనుబంధంగా దాపురించిన దారా పుత్రాదులు కూడా ముక్తికి దారి జూపే వారు కారు. పైగా, ప్రతి జన్మలో కలిగే తల్లి, తండ్రి, పుత్రాదులు ఆభాస బంధువులే. వీరందరు భయ జనకులే. ప్రేమతో ఉన్నట్లు కనబడుతారు. జాతి చరిత్ర పుటల్లో కనిపిస్తుంది.

తల్లియైన కుంతి కన్న కొడుకును గంగపాలు చేయలేదా? తండ్రి హిరణ్య కశిపుడు కన్న సుపుత్రుణ్ణి నానా హింసలు పెట్టలేదా? పరశురాముడు కన్న తల్లి తలను నరక లేదా? అన్నదమ్ములు వాలి సుగ్రీవుల లాగా తన్నుకోవడం కనబడుతున్నదే కదా! "కస్య పుత్రాశ్చ పౌత్రాశ్చ కస్యభార్యా ధనంచవా! సంసారే నాస్తికఃకస్య, (స్వయంతస్మాత్ ప్రదీయతాయమ్. దాన ధర్మాలు చేసుకోవడం మేలు)". అందుకే, ఎవనికి ఎవడూ లేడు. "ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి". అన్నది ఉపనిషత్తు. భర్త భార్యను, తల్లి బిడ్డను ప్రేమించడానికి, తనను ఉద్ధరిస్తారనే మమతయే, స్వార్థమే మూలకారణం. జీవితంలో ఎంతో కష్ట పడి ధనాన్ని సంపాదించి, గృహా రామ క్షేత్రాదులను కల్పించి, రిటైర్ అయిన తర్వాత కూడ తన వాళ్ళను పోషిస్తూ, కొడుకులకూ, కోడళ్ళకూ బంట్రోతుగా బ్రతుకుతున్నది బంధు ప్రీతివల్లనే కదా! ధనధాన్య పశ్వాది సంపదలు కలవానికి అధిక భయముంటుంది.

జనరంజకంగా రాజ్యాలనేలిన సార్వభౌములు కూడా శత్రువుల చేత ఓడి పోయి సామాన్య పౌరుని కన్న చాలా హీనంగా జీవనం గడపినారనీ, - మన కాయం కూడా 'ఖాయం' గా ఉండేది కాదనీ- పెద్దలు చెబుతుండడం వాస్తవమే కదా! మహాజ్ఞానులు ఈ శ్లోకంలోని మూడు పాదాలలో నున్న విషయాలను భగవదనుభవ భోగానికి ప్రతికూలంగానే భావిస్తారు. "ధృతిర్ధారణ సంతోష ధైర్యవీర్యేషు" అని నిఘంటువు.

**1. త్వదనుభవ భోగార్థినః :–** భగవదను భవ భోగం అంటే మోక్ష ఫలం కోరేవారు కామ్య కర్మలయందు అసక్తులు కారు. ముముక్షువులు వైదిక కర్మానుష్ఠాన పరులైనందువల్ల కర్మాచరణాన్ని మానుకొనరు.

**"కుర్వన్నే వేహకర్మాణి జి జీవిషేత్ శతగ్ం సమాః ।**
**ఏవం త్వయినాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే॥"**

మానవుడు యావజ్జీవం విద్యాంగమైన కర్మయోగాన్ని త్రివిధ త్యాగబుద్ధితో అనుష్ఠించడానికి చేసిన కర్మలు, వేపిన విత్తనాలు మొలకలెత్తనట్లు, ఫలజనకాలు కావని ఈశావాస్యోపనిషత్తు బోధిస్తుంది.

ఫలాపేక్ష లేకుండా కర్మలనాచరించడం సాధ్యమా? అంటే, ఒక స్నేహితునికి స్వప్రయోజనమే మీ ఉద్దేశించక, అతని ప్రీతి మాత్రం కోసం ఉపచారం చేయబడుతుంది కదా! అలాగే సర్వ కర్మలను భగవత్ప్రీత్యర్థం చేసే ఆరాధనమే అవుతుంది కాబట్టి అదే ప్రయోజనం. కర్మలను స్వప్రయోజనం కోసం చేస్తే కర్మ వాసన విడువదు. కర్మలను భగవంతుని ప్రీతి కోసం చేస్తే వాటిచే ఆరాధితుడైన భగవానుడు కర్మవాసనను తెంచి వేస్తాడు.

**"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ ।**
**విష్ణురారాధ్యతే పన్థాః నాన్యస్తత్తోషకారకః॥"**

వర్ణాశ్రమాచారవంతుడైన వ్యక్తి ఫలాపేక్ష లేకుండా సకలకర్మలను పరమ పురుషారాధన భావంతో ఆచరిస్తాడు. అలా చేయకుంటే, మోక్ష మివ్వాలనే ప్రీతి పరమ పురుషునికి కలుగదు.

"అసక్తోహ్యా చరన్ కర్మ పరమాప్నోతి పూరుషః"– "ఫలాసక్తి లేకుండా నియత కర్మలను అనుష్ఠించేవాడు పరమ పదాన్ని పొందుతాడు" అని భగవానుడే, చేసిన కర్మ మరోజన్మకు బీజం కాకుండా, మోక్ష సాధనోపాయాన్ని ఉపదేశించాడు.

కర్మయోగంగానీ, జ్ఞాన యోగంగానీ భగవత్ప్ర పన్నునికే మోక్ష సాధనం. పరమ భక్తుడు భగవత్సం బంధంలేని క్షణం "త్రుటియుగాయతే" అన్నట్లు ఒక యుగంగా భావించి పరితపిస్తాడు. భగవదనుభవ భోగార్థులకు సమస్తం ఆ సర్వేశ్వరుడే

అని మహా విశ్వాసంతో ప్రార్థించడం పరిపాటి. "ఉళ్ళిలు ముళ్ళమ్ తడిక్కుమ్". (తిరువందాది 76) భగవంతుణ్ని స్మరించినంతనే భగవత్కటాక్ష లబ్ధ భక్తి రూపాపన్న జ్ఞానుల ఉల్లం బలంగా పల్లవిస్తుంది. 'మేలాత్తేవ ర్గళుమ్' పాశుర పరమార్థమిది:- (తి.వా.మొ. 5-1-8) "మిన్నున నున్న వారలును మేదిని వారలునాస చేయు సంపన్నుడెవచ్చి నా మనసు బట్టెను; నాకిక మచ్చెకంటి, విత్తోన్నతి, సత్సుతుల్, మిగుల నోరిచి నాపయికూర్మి సేయునన్గన్న మదంబ మత్పితయు నా సకలంబును నాతడే యగున్" (శ్రీ శఠకోప గీతామృతమ్) అన్నట్లు ప్రపన్నులు నిర్భరులై ఉంటారు. భగవద్భోగ రసికులకు సంసారంగానీ, ప్రాకృతిక భోగాలు గానీ హేయమైనవి. ప్రేయోஉలంకార సజ్జితం.

**13.** **న వక్తుమపి శక్యతే నరక గర్భ వాసాదికం**
**వపుశ్చ బహుధాతుకం నిపుణ చింతనే తాదృశమ్ ।**
**త్రివిష్టపముఖం తథా తవ షదస్య దేదీప్యతః**
**కి మత్ర న భయాస్పదం భవతి రంగ పృథ్వీ పతే ॥**

**అర్థం :-** రంగ పృథ్వీ పతే = శ్రీరంగ రాజా! నరక గర్భ వాసాదికం = నరక లోక వాసమూ, గర్భవాసమూ మొదలైనది, వక్తుం, అపి = చెప్పడానికి; నిపుణ చింతనే = బాగా ఆలోచిస్తే; బహుధాతుకం = అనేక ధాతువులతో కూడిన; వపుః, చ = శరీరం కూడా; తాదృశం = అటువంటిదే. తవ = నీయొక్క; పదస్య = స్థానమైన వైకుంఠం; దేదీప్యతః = బాగా ప్రకాశిస్తుండగా; త్రివిష్టపముఖం = స్వర్గలోకాదికం; తథా = అలాంటిదే. అత్ర = ఈ ప్రకృతి మండలమందు; భయ+ఆస్పదం = భయావహ స్థానమైనది; కిం,న= ఏది కాదు?

**తా॥** ఓ రంగరాజా! నరకవాస గర్భవాసాదికం చెప్పనలవికానిది. ఆలోచిస్తే, బహుధాతుకమైన శరీరం కూడా నరక గర్భవాసాదుల వంటిదే. నీ వైకుంఠ మొక్కటే భయరహితమై బాగా ప్రకాశిస్తుంటే, స్వర్గలోకాదికమూ భయాస్పదమైనదే. ఈ సంసారంలో భయం లేని స్థానమే లేదు.

**వ్యాఖ్య:-** పరమపదం తప్ప, లోకాలన్నీ భయాస్పదమైనవని కవి కేసరి వేదన.

**1. నరక గర్భవాసాదికం :-** నరకమంటే, జీవితంలో చెడ్డ పనులను చేసినవారు మరణించిన తర్వాత శిక్షను అనుభవించే లోకం. "నరాః కాయంతి అస్మిన్ ఇతి- నరకః". జీవులు మొఱపెట్టే లోకమని వ్యుత్పత్త్యర్థం.

"తతశ్చ నరకా విప్ర! భువోధః సలిలస్యచ" నరక లోకాన్ని అథోలోకం అంటారు. భూమి క్రింద నీరు, దాని క్రింద నరక లోకముంది. రౌరవం, సూకరం, తప్తకుంభం, లవణం, అసిపత్ర వనమని వేర్వేఱు నరక యాతనలు ఉంటాయి.

"యమస్య విషయే ఘోరాః శస్త్రాగ్ని భయ దాయినః ।

పతన్తి యేషు పురుషాః పాపకర్మ రతాస్తుయే ॥" (వి.పు. 2 అం. 6అధ్యా) దారుణమైన శస్త్రాగ్ని భయాలను కలిగించే నరక లోకానికి యమ ధర్మరాజు శాసకుదు. పాపిష్ఠులు ఈ నరకంలో పడుతారని శ్రీ పరాశర మహర్షి మైత్రేయుడనే విప్రునికి బోధించాడు.

**"నెంజినాల్ నినైన్దుమ్, వాయినాల్ మొషిన్దుమ్,**

**నీతియల్లాదన శెయ్దుమ్ । తుంజినార్**

**శెల్లుమ్ తొన్నెఱికేట్టే తుళంగినేన్"**- (పె.తి.మొ. 1-6-7) మనస్సుతో తలచి, నోటితో చెప్పి, నీతిలేని పనులను చేసి చచ్చిన వారు పోయే నరక మార్గాన్ని విని భయంతో వణికి పోయాను, అని తిరుమంగైయాళ్వార్ల శ్రీ సూక్తి.

గర్భ వాసం కూడా చెప్పరాని వేదనతో కూడిందే కదా!

"కుక్షి భ్రూణార్భకా గర్భాః" - (అమరం)

గర్భ శబ్దానికి కడుపు, కుక్షిస్థ శిశువు, బాలుడు అని నానార్థాలున్నాయి.

"గిరతీతి గర్భః"- గౄనిగరణే, ధాతు నిష్పన్నమైన పదం గర్భం. తల్లి భుజించే ఉప్పు, కారం, వేడి, పులుపు మొదలైన ఆహారాన్ని మ్రింగుతూ, తల్లి కడుపులో చాలా వేదనతో పెరుగుతుండే శిశువు అని అర్థం.

"గర్భేషు నిర్భర నిపీడన భిన్న దేహః" (శ్రీ వైకుంఠస్తవం. 92) తల్లి కడుపులో ఒత్తిడి చేత మెదుపబడే అవయవాలు కల దుఃఖజీవిగా, గర్భవాసం దుర్భరమన్నారు. శ్రీవత్సాంకమిశ్రులు. "కటుతిక్తోష్ణ లవణ రూక్షామ్లాదిభిరుల్బణైః । మాతృభుక్తైరుప

స్పృష్టః సర్వాంగోత్థిత వేదనః" ॥ తల్లి తినే పదార్థాల గుణాలవల్ల గర్భస్థుని అంగాలయందు బాధ దుర్భరమవుతుంది.

**2. వపుశ్చ బహు ధాతుకం :-** బహు ధాతువులచే నిర్మితమైన వపువు హేయమైనదే. "ఉప్యతే ప్రాక్కర్మభిః ఇతి వపుః". పూర్వ కర్మలచే పుట్టింపబడేది వపువు, అని వ్యుత్పత్త్యర్థం. "అస్థి స్థూణం స్నాయుయుతం మాంస శోణిత లేపనం । చర్మావనద్ధం దుర్గంధి పూర్ణం మూత్ర పురీషయోః । జరా శోక సమావిష్ట రోగాయతన మాతురమ్॥" (మనుస్మృతి. 6అధ్యా. 76శ్లో) ఎముకలు, నరాలు, మాంసం, రక్తం కలది. మూత్ర పురీషాలతో నిండినది. రోగాలకు నెలవై, ముసలితనంతోనూ, దుఃఖంతోనూ కూడియున్న శరీరం క్షణ భంగురం కదా!

**"ఒర్ ఉడమ్బిల్ ఇట్టు, తిణ్ణమషున్దక్కట్టి ప్పులశెయ్ విసైవన్ కయిర్తాల్,**
**పుణ్ణై మఱైయ వరిందు ఎన్నై ప్పోరవైత్తాయ్ పుఱమే".** (తి.వా.మొ. 5-1-5)

'స్వామీ! అతిహేయమైన శరీరమందు వేసి, నా పాపాలు అనే గట్టి త్రాళ్ళతో దృఢంగా కట్టి వేసి, మాంసం కనబడకుండా చర్మంతో కప్పి, నన్ను బాహ్య సంసారంలో పడవేశావు' అని భగవంతునితో మొరపెట్టుకొన్నారు నమ్మాళ్వార్లు.

'యది నామాస్య కాయస్య యదన్తస్తత్ బహిర్భ వేత్ ।
దండమాదాయలోకోఽ యం శునః కాకాంశ్చవారయేత్ ॥" అన్నట్లు, వాస్తవంగా, తోలుతొలగిపోయి శరీరంలోన ఉన్నదంతా బయట పడితే, లోకులు కఱ్ఱ బట్టుకొని కుక్కలనూ, కాకులనూ తోలుకొంటూ బ్రతుకవలసిందే కదా!

"ఊనిడైచ్చువర్ వైత్తు ఎన్బుతూణ్ నాట్టి ఉరో మమ్మేయ్న్దు ఒన్బదు వాశల్".

(పె.తి. 1-6-9) జీవునికి శరీరం ఒక పూరి గుడిశ. మాంస పిండం చుట్టు గోడ, ఎముకలు గుంజలు, రోమాలు పైకప్పు, తొమ్మిది రంధ్రాలు నవ ద్వారాలు, అన్నారు తిరుమంగై ఆళ్వారు. శరీరంలో జీవుని ఉనికి నరక తుల్యమనడం నిపుణ చింతనమే కదా!

**3. త్రివిష్ట పముఖం తథా :-** స్వర్గలోకమే కాదు, 'ముఖ' శబ్దం చేత ఊర్ధ్వ లోకాలు బ్రహ్మ, రుద్ర లోకాలు కూడా పునర్జన్మను కలిగించేవే కాబట్టి "ఆ బ్రహ్మ భువనాత్

లోకాః పునరా వర్తినః". బ్రహ్మ లోకం వరకు ఉండే లోకాలన్నీ (బ్రహ్మ కూడా) మహా కల్పాంతమందు లయం పొందేవే- అని గీతాచార్య సూక్తి. ప్రకృతి యనే భగవన్మాయా మహా సముద్రమందు బ్రహ్మాండాలే బుద్బుదప్రాయాలై ఉండగా వాటి లోపల భోగైశ్వర్య స్థానాలై వర్తించే బ్రహ్మాది లోకాల సంగతి చెప్పేదేమి? ఐశ్వర్య గతిని పొందిన వాళ్ళకు ప్రాప్యస్థానాలైన ఆ లోకాలే నశించడంవల్ల, వాళ్ళకూ నశించడం తప్పదు. "ఏతేవై నిరయాస్తాత! స్థానస్య పరమాత్మనః"- వైకుంఠుని స్థానాన్ని పొందగోరే వాళ్ళకు ఈ నాకాదిలోకాలు నరక తుల్యాలే కదా! భోగోపకరణాలు, భోగస్థానాలు హేయమైనవే అని భావం.

**4. తవ పదస్యదే దీప్యతః :-** "పదం వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాంఘ్రి వస్తుషు" (నిఘంటువు) పద్యతే గమ్యతే ఇతి పదం. ముముక్షువులచే పొందబడే స్థానమని అర్థం.

"ఏవమే వైష సంప్రసాదోஉస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య
స్వేన రూపేణాభి నిష్పద్యతే" (ఛాం.ఉపని)

ప్రపన్నుడైన ఆత్మ ఈ శరీరం నుంచి లేచి పరంజ్యోతిని పొంది స్వస్వరూపంతో నిష్పన్నుడవుతున్నాడని ఉపనిషద్వాక్యార్థం.

**"అత్యర్కానల దీప్తంతత్ స్థానం విష్ణో ర్మహాత్మనః**
**' స్వయైవ ప్రభయా రాజన్ దుష్ప్రేక్ష్యం దేవదానవైః ॥"**

దేవతలకు గానీ దానవులకుగానీ దుర్నిరీక్ష్యమై, సూర్యుడు, అగ్ని మొదలైన తేజోద్రవ్యాలను మించిన, స్వతః సిద్ధమైన తేజస్సుతో ప్రకాశించే స్థానం పరమ పదం.

**"తద్విష్ణోః పరమం పదం, సదా పశ్యంతి సూరయః,**
**దివీవచక్షు రాతతం, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమిన్ధతే"!**

ఆకాశంలో తెరచిన కన్ను లాగా ఉన్న పరమ పదాన్ని - భగవత్పదాన్ని- నిత్య సూరులు ఎల్లప్పుడూ సేవిస్తుంటారు. వారు గొప్ప జ్ఞానం కలవారు కాబట్టి స్తుతిశీలురై జాగరూకులై ప్రకాశిస్తూ ఉంటారని ఋగ్వేదం చెప్పింది.

"దేవానాం పూరయోధ్యా"– పరమ పదాన్ని నిత్య సూరుల నగరమని వేదం చెబుతుంది. పరమ పదమందున్న ప్రతి వస్తువు, గడ్డి పరక కూడా శుద్ధ చైతన్యంతో శోభిస్తుంది.

"యన్నామ సంకీర్తనతో మహా భయాత్ విమోక్షమాప్నోతి". జగత్కారణుడైన పరమ పదనాథుని నామాన్ని కీర్తించినంత మాత్రాన మహాభయం నుంచి విముక్తి లభిస్తుందన్నప్పుడు, ఇక ఆ వైకుంఠుని స్థానం భయ రహితమని చెప్పనక్కర్లేదు.

**"యద్వైష్ణవం హి పరమం పదమామనంతి**
**ఖం వా యదేవ పరమం తమసః పరస్తాత్ ।**
**తేజో మయం పరమ సత్త్వమయం ధ్రువంయ**
**దానన్ద కందమతి సుందర మద్భుతంయత్ ॥**

(శ్రీ వైకుంఠ స్తవం 42) పెం జీకటిక వ్వలి శుద్ధ సత్త్వమయమై అద్భుతంగా విరాజిల్లుతున్న వైకుంఠలోకాన్ని పరమ పదమనీ, పరమ వ్యోమమనీ బ్రహ్మ విద్వరిష్ఠులు వ్యవహరిస్తారు. ఇతర లోకాలన్నీ భయాస్పదాలే. పరమపద మొక్కటే శాశ్వతమైన ఆనందానికి మూల కందమైనది.

**"అంబుయత్తోన్ కలకత్తొషిల్ మతుకైడ పరాల్ పడుమ్కట్ట**
**మెణ్ణిల్ పలకత్త మెయ్య డియార్ పడియా రిక్కడుమ్ పవత్తే ॥"**

(పరమపద సోపానమ్ -6) కమలాసనుడైన బ్రహ్మదేవుడు యుద్ధమే ప్రవృత్తిగా గల మధుకైటభులనే రాక్షసులచే అనుభవించిన కష్టాలను తలచుకొంటే అనేక శాస్త్రాలనభ్యసించిన నిజమైన దాసులు – వివేకులైన ప్రపన్నులు – ఈ ఘోర సంసారంలో అభినివేశాన్ని పొందరు. విరక్తినే పొందుతారు, అన్నారు దేశికులు.

**"వానాళు మిందిరను మేఱుయర్త్తవీశన్తాను**
**మీరిరణ్డు ముకత్తాను మిల్లా వన్నాణ న్తిరు**
**మానిలైకణ్డార్ నాకమెల్లా నరకెన్ను నళ్ళద**
**మే నాడు వారే"** (ప.సో.7) స్వర్గాన్ని పాలించే ఇంద్రుడూ, వృషభ ధ్వజుడైన ఈశుడూ, చతుర్ముఖుడైన బ్రహ్మదేవుడూ లేకుండా పోయిన ఆ ప్రళయంలో, మన

శ్రియఃపతి స్థానమైన పరమపదం యొక్క నిల్చియుండే స్వభావాన్ని గమనించిన వారు దేవలోకాలన్నీ నరకప్రాయాలని వైకుంఠ పదాన్నే పొందడానికి ఆశ పడతారు.

**14. భవంతి ముఖ భేదతో భయని దానమేవ ప్రభో !**
**శుభాశుభ వికల్పితాః జగతి దేశకా లాదయః ।**
**ఇతి ప్రచుర సాధ్వసే మయి దయిష్యసే త్వంనచేత్**
**క ఇత్థ మనుకంపితా త్వదను కంపనీయశ్చకః?**

**అర్థం :-** ప్రభో = శ్రీ రంగనాథా! జగతి = లోకమందు; శుభ+అశుభ వికల్పి తాః = శుభం, అశుభం అనే భేదాలు గల, దేశ, కాల+ఆదయః = దేశం, కాలం మొదలైనవి, ముఖ భేదతః = రూప భేదం వల్ల, భయ నిదానం+ఏవ = భయ హేతువులే; భవంతి = అవుతున్నవి; ఇతి = అని; ప్రచుర సాధ్వసే = అధిక భీతి గల; మయి = నా విషయమై; త్వం = నీవు; న, దయిష్యసే, చేత్ = దయను చూపకపోతే; ఇత్థం = ఈ రీతిగా; అనుకంపితా = కృపతో కటాక్షించేవాడు; కః = ఎవడు; చ = మరియు, త్వత్+అనుకంపనీయః = నీ చేత కృపతో కటాక్షింపబడ దగినవాడు, కః = ఎవడు?

**తా॥** ఓ రంగనాథా! లోకంలో శుభా శుభాలను కలుగజేసే దేశ కాలాదులు రూప భేదాల చేత భయ కారణాలే అవుతున్నాయని చాలా భయపడుతున్న నాయందు నీవు దయను చూపించకుంటే ఇక దయను చూపించే వాడెవడు? మరి నేను కాక నీ దయకు పాత్రుడయ్యే వాడెవడున్నాడు?

**వ్యాఖ్య:-** భగవానుడు భయపడే వాని యందు దయను ప్రసరింప జేయాలని ప్రార్థన.

**1. శుభా శుభ వికల్పితాః జగతి దేశకాలా దయః :-** ప్రపంచంలో దేశకాలాదులు శుభా శుభాలను కలుగజేసేవిగా ఉన్నాయి.

దివ్య, ధర్మ, తీర్థ, పుణ్య క్షేత్రాలు అనిష్టాన్ని తొలగించి, ఇష్టప్రాప్తిని కలిగిస్తాయి, కాబట్టి అవి శుభప్రదమైనవి. తదితర ప్రదేశాలు కష్ట నష్టాలను కలిగించడంవల్ల, అవి అశుభ ప్రదమైనవి. కాల వ్యవస్థ కూడా రెండు రకాలుగా ఉంది. సంవత్సరంలో ఉత్తరాయణం-అందులోనూ మాఘాది పంచమాసాలే- శుభ

ప్రదమనీ, దక్షిణాయనం అశుభ ప్రదమనీ చెప్పబడుతున్నది. ప్రతి దినం కూడా రాహుకాలం, గండ, దుర్ముహూర్త, వర్జ్య ఘడియలు పోగా మిగిలిన కొద్ది సమయమే శుభప్రదమని పరిగణింప బడుతున్నది కదా!

'ఆది' పదం చేత వ్యక్తులు కూడా సుముఖులు, విముఖులని రెండు విధాలుగా ఉంటారని సూచితం. ఇలాగా దేశ, కాల పాత్రాలు రూప, గుణ భేదాల చేత అధికంగా భయనిదానాలవుతున్నాయి.

"నిదానం త్వాది కారణం" (నిఘంటువు) 'నిదాన' మంటే ముఖ్య కారణమని అర్థం.

**2. ముఖ భేదతో భయ నిదానమేవ :-** ప్రకృతి పరిణామశీలమైనందువల్ల, దేశకాలాదుల ఆకృతి – స్థితి గతులు – మారుతుండడం వల్ల, అవి భయ హేతువులే అని భావం.

**3. ఇతి ప్రచురసాధ్వసే మయిద య్యిష్యసేత్వం :-**

**"భీతిర్భీః సాధ్వ సంభయమ్"– (అమరం)**

**సాధూన్ అస్యతి ఇతి–సాధ్వసం.**

(అసుక్షేపణే) సాధువులను బాధించే భయం. మధుర, శ్రీరంగాది దివ్య క్షేత్రాలు శుభప్రదాలైనప్పటికీ అక్కడ తురుష్కుల దాడివల్ల సజ్జనులెందరో హింసింపబడిన రీతిని స్వయంగా చూచి భయపడుతున్న నా మీద దయ చూపగల వాడవు నీవే సుమా! అని దేశికులు శ్రీరంగనాథ స్వామిని ప్రార్థించారు.

**4. న చేత్క ఇత్థమను కంపితా :-** "కృపా దయానుకంపాస్యాత్". (అమరం) ఎదుట నున్న వ్యక్తి యొక్క దైన్యాన్ని అనుసరించి తన మనస్సు చలించడమే 'అనుకంప' అనబడుతుంది. ఎదుటివాడు బాధపడుతుంటే తాను బాధపడడం, దయాకార్యమే కదా!

"సంజాత బాష్పః పర వీరహన్తా రామో ముహూర్తం విమనాబభూవ".

శ్రీరాముడు వాలిని చంపిన తర్వాత సుగ్రీవాదులు దుఃఖించారు. వారి దుఃఖాన్ని చూచిన రాముడు క్షణకాలం కన్నీళ్ళ వరకు మనస్సు స్పందించిన వాడయ్యాడని

వాల్మీకి సూక్తి. ఇలా దయాళువైన నీవు కటాక్షించకపోతే, ఇక నాపై కృపను వర్షించే వాడెవడున్నాడు?

"ఆమయో వానసృష్టశ్చేత్ ఔషధస్య వృథోదయః।" రోగాన్ని సృష్టించకుంటే ఔషధ సృష్టి వ్యర్థమే కదా! అలాగా, విధినాఽహం న సృష్టశ్చేత్, నస్యాత్ తవ దయాళుతా!" విధిచే నేను పుట్టించబడకనే పోతే, నీ యొక్క దయ కలిగియండే అవసరం లేకపోయేది.

**5. త్వ దనుకంపనీయశ్చకః ?:-** అపరాధ చక్రవర్తిని, అకించన సార్వభౌముడనైన నన్ను కరుణించకపోతే, నా కంటె నీ కృపను పొందదగిన మరొకడు నీకు లభించడు, అని తమ అనన్య గతికత్వాన్ని దేశికులు విన్నవించుకొన్నారు.

తమ నైచ్యాన్ని అనుసంధించేవారి పైన అధికారులకు మనస్సు కరిగి దయజాలు వారుతుందనే విశ్వాసం సాంప్రదాయకమే. ఈ భావ ప్రకటనకు మాతృక స్తోత్రరత్నం. "యది మేనదయిష్యసేతతో దయనీయ స్తవనాథ! దుర్లభం ॥ '(50)' ఓ స్వామి! నన్ను అనుగ్రహించక ఉంటే సర్వాపరాధ భూయిష్ఠుడనైన నా వంటి వాడు వేరొకరు లేనందువల్ల ఆపన్నార్తి ప్రశమనమే ముఖ్య జీవనంగా ఉన్న నీ కృప గత్యంతరంలేని దవుతుంది. "నీ కృప చేత ఏర్పడిన రక్ష్య రక్షక భావ సంబంధాన్ని మళ్ళీ నీవే కాదనడం యుక్తం కాదు. నన్ను అనుగ్రహించక వదలరాదు ప్రభూ! అని దేశికులు ప్రార్థించారు. వాక్యార్థ హేతుక కావ్యలింగాలం కృత శ్లోకమిది.

**15. సకృత్ ప్రపదన స్పృశా మభయ దాన నిత్యవ్రతీ ।**
**నచ ద్విరభి భాషసే త్వమితి విశ్రుతః స్వోక్తితః ।**
**యథోక్త కరణం విదుః తవతు యాతుధానాదయః ।**
**కథం వితథమస్తు తత్ కృపణ సార్వభౌమేమయి ॥**

**అర్థం :-** త్వం = నీవు; సకృత్ = ఒక్కసారి మాత్రమే; ప్రపదన స్పృశాం = ప్రపత్తి చేసిన వారికి; అభయ దాన, నిత్యవ్రతీ = అభయం ఇవ్వడమే నిత్యవ్రతంగా కలవాడవు. ద్విః = రెండుసార్లు; అభిభాషసే, ఇతి, న, చ = మాటాడవని కూడా; స్వ +ఉక్తితః = నీ మాటలచేతనే; విశ్రుతః = ప్రసిద్ధుడవైన వాడవు, తు = ఇక; యాతుధాన+ఆదయః

= రాక్షసులు మొదలైనవారు; తవ = నీ యొక్క; యథా+ఉక్తి, కరణం = చెప్పిన రీతిగా చేయడాన్ని; విదుః = తెలుసుకొన్నారు. తత్ = ఆ వ్రతం; కృపణ సార్వభౌమే= దీనులకు చక్రవర్తినైన; మయి = నా యందు; కథం = ఎట్లు? వితథం, అస్తు = వ్యర్థమవుతుంది?

**తా॥** నీవు ఒక్కసారి మాత్రమే ప్రపత్తి చేసిన వారికి అభయ మీయడం నిత్యవ్రతంగా గలవాడవు, రెండు మాటలాడవు అని నీ మాటలవల్లనే ప్రసిద్ధుడవయ్యావు. ఇక రాక్షసాదులే నీవు చెప్పిన విధంగా చేసేవాడవని గ్రహించారు. ఆ వ్రతం దీనులలో గొప్పవాడనైన నా యందు మాత్రమే ఎలా వ్యర్థమవుతుంది? కాగూడదు.

వ్యాఖ్య :- భగవానుని ప్రతిజ్ఞా ఫలాన్ని తనకు కూడా అనుభవింపజేయుమని స్తుతి. ఈ స్తోత్రంలో ఉన్న 29 శ్లోకాలలో ఇది (15) మధ్యనున్నది. రామావతారంలో శ్రీరాముడు స్వయంగా చెప్పిన అభయ ప్రదాన వ్రతాన్ని జ్ఞాపకం చేస్తున్నది. భగవానుడు శరణాగతులను అవశ్యంగా రక్షించాలని నొక్కి చెప్పుతున్నది.

**1. సకృత్ ప్రపదన స్పృశాం అభయదాన నిత్యవ్రతీ :-** భగవంతుడు ప్రపత్తిని చేసిన వారిని రక్షించే స్వభావం కలవాడు. కమలభవుడైన బ్రహ్మయొక్క వదన సదనమందు విహరించే భారతీ దేవి ప్రపథమంగా వాల్మీకి హృదయమందు పాదన్యాసం చేసింది. కాబట్టి ఆది కావ్యమైన శ్రీ మద్రామాయణాన్ని వాల్మీకి ముని రచించాడు. సీతారాముల చరిత్ర మానవాళికి దివ్య చక్షువు. వాల్మీకి వాణికి భ్రమ ప్రమాదాలు లేవు. మధు మయ ఫణితికి మార్గదర్శకమైన శ్రీమద్రామాయాణాన్ని "దీర్ఘ శరణాగతి శాస్త్రం" అని సంప్రదాయజ్ఞులు అంటారు. మొదట దేవతలు లోక కంటకుడైన రావణాసురునిచే బాధలను భరించలేక శ్రీ మహా విష్ణు సన్నిధిలో శరణాగతి చేశారు. శ్రీ మహా విష్ణువు తనను నాలుగు మూర్తులుగా విభజించుకొని, దశరథునికి - ముగ్గురు భార్యలలో కౌసల్యయందు రాముడు, కైకేయి యందు భరతుడు, సుమిత్ర యందు లక్ష్మణ శత్రుఘ్నులు - పుత్రులుగా అవతరించాడు.

**2. న చద్విరభి భాషత్వం :-** కైకేయి, తనకు పూర్వం దశరథుడిచ్చిన రెండు వరాలను, ఇప్పుడు-రామ పట్టాభిషేక ముహూర్తమందు- ఇమ్మని కోరింది. 1.రామునికి 14

ఏండ్ల వనవాసం 2. భరతునికి పట్టాభిషేకం. దశరథుడు తన సత్య ప్రతిజ్ఞకు వెరచి దిగ్భ్రాంతుడయ్యాడు. నోరాడక దుఃఖపడుతున్న సమయాన శ్రీరాముడు కైకేయి భవనానికి వచ్చాడు.

**"తత్బ్రూహి వచనం దేవి! రాజ్ఞా యదభికాంక్షితం ।**

**కరిష్యే ప్రతిజానేచ రామో ద్విర్నాభి భాషతే ॥"** (రా.అ.18స.30)

దేవీ! మహారాజుగారిచేత కోరబడిన విషయ మేమిటో చెప్పవమ్మా! దాన్ని నెరవేరుస్తాను. రాముడు రెండు విధాలుగా మాటాడడని ప్రతిజ్ఞను చేస్తున్నాను- అని రాముడు తన తల్లిదండ్రుల యెదుట పలికాడు.

**"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ**

**యాచతే। అభయం సర్వభూతేభ్యో**

**దదామ్యే తద్వ్రతం మమ ॥"** అన్నాడు

శ్రీరాముడు. దక్షిణ సముద్ర తీరాన విభీషణుణ్ని అనుగ్రహించిన సందర్భమది.

విభీషణుడు - ఆకాశంలోనే నిలిచి - "దుర్వృత్తి గల రావణుడు ఏ గర్భమందు జన్మించాడో, ఆ గర్భమందే ఉండి అతనికి తమ్మునిగా జన్మించాను. రాఘవుని సన్నిధిలో శరణాగతుడను" అని ప్రార్థించాడు. సుగ్రీవాదులు శత్రువుకు ఆశ్రయ మీయరాదన్నారు. ఆంజనేయుడు 'ఆశ్రయమివ్వదగిన వాడే' అన్నాడు. శ్రీరాముడు వారి వారి మాటలను విన్నాడు. "దోషోయద్య పితస్యస్యాత్ సతా మేతద గర్హితమ్"- అతనికి ఏ దోషమున్నా అది సత్పురుషులకు నిందింప వలసింది కాదు. మిత్రభావంతో నన్ను పొందినవానినెప్పుడూ విడువను అన్నాడు.

"ఒక్కసారి ప్రపత్తి చేసి, నీవాడను- అనన్యార్హ శేషభూతుడను - అని ఎవడు యాచిస్తాడో, అతనికి సర్వభూతాలనుంచి రక్షించే అభయాన్ని ఇస్తున్నాను. ఇది నా వ్రతం". అని ఆశ్రిత జన సాధారణమైన ప్రతిజ్ఞను చేశాడు.

**3. ఇతి స్వోక్తితః విశ్రుతః :-** ఈ విధంగా తన మాటలను వెల్లడించాడు కాబట్టి రాముడు సత్యసంధుడు - సత్యప్రతిజ్ఞ కలవాడు - అని ఖ్యాతిని పొందాడు. "సత్యే సర్వం ప్రతిష్ఠితమ్" అని శ్రుతి.

**4. యాతుధానాదయస్తు తవయథోక్త కరణం విదుః :-** రాక్షసాదులు మాత్రం నీవు చెప్పిన మాటను చేసి తీరుతావని గ్రహించారు.

విభీషణునిది మహా విశ్వాస పూర్వకమైన ప్రార్థన. ప్రపత్తినే శరణాగతి అంటారు. భగవత్ప్రవృత్తికి విరోధియైన స్వప్రవృత్తిని వదలు కోవడమే ప్రపత్తి. అనుకూల్య సంకల్పం, ప్రాతికూల్య వర్జనం, మహా విశ్వాసం, గోప్తృత్వ వరణం, కార్పణ్యం, ఆత్మ సమర్పణం అనే షడంగయోగమే పూర్ణ ప్రపత్తి. విభీషణుని శరణాగతి పూర్ణ ప్రపత్తికి లక్ష్యంగా నిలిచింది. అదే శరణాగతి శాస్త్ర లక్షణమై వెలసింది.

"రామోద్విర్నాభి భాషతే" అంటే ఒక మాట పలికి, వెంటనే ఆ మాటను మార్చి మరొక విధంగా పల్కక ఉండడం. ఈ లక్షణం కలవాడే సత్యసంధుడు. "ఒకే మాట, ఒకే బాణం"– "సత్యమేవ జయతి, నానృతం". సత్య వచనమే జయిస్తుంది. అసత్యం జయించదు. అని ఉపనిషత్తు బోధిస్తుంది.

**"ధర్మాత్మా సత్య సంధశ్చ రామో దాశరథి ర్యది ।**
**పౌరుషేచా ప్రతి ద్వంద్వః శరైనం జహిరావణిం ॥"**

"దశరథుని పుత్రుడైన శ్రీరాముడు-ధర్మాత్ముడూ, సత్యసంధుడూ, పౌరుషమందు అప్రతి ద్వంద్వుడూ అయితే ఓ బాణమా! నీవు ఇంద్రజిత్తుని చంపు" మని లక్ష్మణుడు శపథం చేసి వేసిన బాణం ఇంద్రజిత్తును సంహరించింది కదా! ఈ విధంగా రాముని సత్యప్రతిజ్ఞ. రాక్షసులయందు ఫలించింది. లక్ష్మణుడు రాముని దివ్యత్వాన్ని నిరూపించాడు.

'ఆదయః' అనడం వల్ల సుగ్రీవుడు సూచితుడు. "ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలి వధం ప్రతి"– వాలిని సంహరిస్తానని రాముడు చేసిన ప్రతిజ్ఞ సత్యమే అయింది.

అయితే "కీశాయ చ రాక్షసాయ" అన్నట్లు సుగ్రీవుణ్ని మొదట, విభీషణున్ని తర్వాత పేర్కొనక 'రాక్షసాదయః' అని ఉండడం వల్ల విభీషణుని తర్వాత సుగ్రీవుని ఉదంతాన్ని చెప్పడం సమంజసమా? అనే ప్రశ్న జనించవచ్చు. ఇక్కడ, అభయ ప్రదాన ఫలానుభవం, చెప్పిన రీతిగా చేయడం చేత ప్రభావితులైన విషయం

చెప్పబడింది. కాబట్టి, రాక్షసులు పూర్వ దేవతలు కదా! సుగ్రీవాదులు వానరులు - తిర్యక్కులు - అంతేకాదు. విభీషణుడు పూర్ణప్రపత్తికి లక్ష్యభూతుడు. మహా విశ్వాసం కలవాడు. రావణుడు చావకముందే లంకా రాజ్యాభిషిక్తునిగా ప్రకటితుడు కాబట్టి అతనికి ప్రాముఖ్యం.

ఇక సుగ్రీవుని విషయం గౌణమని సమాధానం "సుగ్రీవశ్శంకి తశ్చాసీత్ నిత్యం వీర్యేణ రాఘవే". రాముని పరాక్రమమందు సుగ్రీవుడు చాలా అనుమానపడినవాడు. అందువల్ల వాలిచే పిడిగుద్దులు తినిపంపించబడినాడు. వాలి వధానంతరమే కిష్కింధా రాజ్యాభిషిక్తుడయ్యాడు.

నీ ఆశ్రిత రక్షణమూ, యథోక్త కరణమూ రాక్షసాదుల చేతనూ అనుభవింప బడింది కదా! హే రంగనాథా! నీవు సర్వావస్థ సకృత్ ప్రపన్న జనతా సంరక్షణైక వ్రతుడవు.

**5. కథం వితథమస్తు తత్ కృపణ సార్వభౌమేమయి :-** స్వామీ నీ ప్రతిజ్ఞ, నీ రక్షా దీక్ష, క్షుద్రుడనైన నా యందు ఫలించక ఎలా వ్యర్థమవుతుంది? "కదర్యే కృపణ క్షుద్ర కింప చాన మితంపచాః". (అమరం)

"అపరాధ సహస్ర భాజనం పతితం భీమ భవర్ణ వోదరే !" (స్తో.ర)

ఎనలేని, ఎన్న లేని నేరాలు చేసి, భయంకరమైన సంసార సాగరం మధ్యన పడి మునిగి పోతున్న నన్ను ఉద్ధరించవా ప్రభూ! నీ కృపకు పాత్రుడను కాని వాడనా? "మదేక వర్జం కిమిదం వ్రతంతే". (స్తో.రత్నం.64) శ్రీయామున మునులన్నట్లు, నన్ను విడిచి పెట్టి వేరెవరి నైనా రక్షిస్తానని నీ నియమమా? అన్నారు దేశికులు. దీని మాతృక నమ్మాళ్వార్ల పాశురం (తిరువిరుత్తమ్.33)

"అరుళార్ తిరుచ్చక్క రత్తాలకల్ విశుమ్బుమ్ నిలనుమ్, ఇరుళార్విలై కెడచ్చెజ్గోల్ నడవుతిర్".

ఓ శేష శయనా! కరుణా పూర్ణమైన సుదర్శన చక్రంతో భూమ్యంతరిక్షాలలోని పాపపు చీకట్లను నశింపచేసి విశ్వాన్ని (పాలిస్తు) రక్షిస్తుంటావు. నీ పాలనా పరిధికి నేను వెలుపల ఉన్నానా? లేక, నీవు రక్షించక ఉపేక్షిస్తే ఆళ్వార్ నాయిక ఏమి చేస్తుందని నీ భావమా?

"తమియేనుక్కరుళాయే" (తి.వా.మొ.5-7-2)

"నిన్నరుళే పురిన్దిరుక్కిఱ" (పె.తి.మొ.441)

ఎనక్కరుళా యాకిల్ పిన్నైయార్క్కు వే రరుళ విరుక్కిఱాయ్?" (ఈడు)

స్వామీ! నీ కృపయే ఆదరించియున్నాను. నన్ను అనుగ్రహించకుంటే తర్వాత ఎవరిని వేరుగా అనుగ్రహింపనున్నావు? అని ఆళ్వార్ల శ్రీ సూక్తులు.

**"సత్వం స ఏవ రభసో భవదౌపవాహ్యః**
**చక్రం తదేవ శితధార మహంచ పాల్యః ।**
**సాధారణే త్వయం కరీశ! సమస్తజంతోః**
**మాతంగ మానుష భిదా నవిశేష హేతుః ॥** (వరద రాజ పంచశత్.40)

ఓ హస్తి గిరీశా! వరద రాజా! పూర్వం గజేంద్రుణ్ని మొసలి పట్టి విడవక బాధించినప్పుడు ఆ గజేంద్రుడు నిన్ను ప్రార్థించి ఆహ్వానించాడు. నీవు అతి వేగం గల గరుడ పక్షిపై నెక్కి పరుగెత్తావు., పదునుగల చక్రాయుధం చేత మొసలిని చంపి గజేంద్రుని రక్షించావు. నేను కూడా కరీంద్రుని లాగా నీ చేత కాపాడ తగిన వాడనే కదా! నన్నెందుకు కాపాడవు? అది ఏనుగు, నీవు మనిషివి, అనే భేదమే కారణమనుకొంటున్నావా స్వామీ! సంసార బంధమనే మొసలి నోట పట్టుబడి కొట్టు మిట్టాడుతన్న నా బంధాన్ని నీవు తప్ప ఎవరు తెంచుతారు? నీ వాహనమైన గరుడుడు అదే వేగం కలిగియున్నాడు. నీ సుదర్శనా యుద్ధం మకరాన్ని నరికినా, మొక్క పోకుండా, ఎప్పటివలెనే మిక్కిలి పదునుగల మొనలు గలిగి నీ చేతి మీదనే ప్రకాశిస్తున్నది. నీవు సకల జీవరాశికి పొత్తుగా ఉన్న దైవమై వెలసియున్నావు. కాబట్టి, మాతంగమనీ, మానుషమనీ భేదమెంచక నీ దాసుడనైన నన్ను రక్షించుమయ్యా ప్రభూ! అని దేశికులు ప్రార్థించారు.

**16.** **అనుక్షణ సముత్థితే దురితవారిధౌ దుస్తరే**
**యది క్వచన నిష్కృతి ర్భవతి సాఽపిదోషావిలా ।**
**తదిత్థ మగతౌ మయి ప్రతి విధాన మాధీయతాం**
**స్వబుద్ధి పరికల్పితం కిమపి రంగధుర్య! త్వయా ॥**

**అర్థం :-** హేరంగధుర్య = ఓ శ్రీ రంగనాథా! అను-త్థితే ! అనుక్షణ = ప్రతిక్షణం; సం+ఉత్థితే = వృద్ధిని పొందుతున్నట్టి; దుస్తరే = దాటశక్యం కానట్టి; దురిత, వారిధౌ = పాపాలు అనే సముద్రమందు; క్వచన = ఎక్కడనో; నిష్కృతిః = ప్రాయశ్చిత్తం; భవతి, యది = ఉన్నప్పటికీ; సా+అపి = అదికూడా; దోష+ఆవిలా= దోషంతో కూడుకొన్నది. తత్+అందువల్ల; ఇత్థం = ఈ విధంగా; అగతౌ = గతిలేని; మయి = నా విషయమై; స్వబుద్ధి, పరికల్పితం = నీ సంకల్పం చేత, ఏర్పరచబడిన; కిం+అపి = ఏదైననొక; ప్రతి విధానం = ప్రతిక్రియ; త్వయా = నీ చేత; ఆధీయతాం= కల్పించబడుగాక.

**తా॥** ఓ రంగనాథా! క్షణక్షణం విజృభించేవీ, దాటశక్యం కానివీ అయిన పాపాలు అనే సముద్రమందు ప్రాయశ్చిత్త కర్మలూ విధింపబడి ఉన్నాయి. అయినా అవి కూడా దోషాలను కలిగిస్తాయి. కాబట్టి దిక్కూ-చక్కీ లేని నా విషయమై నీవే చక్కని ప్రతిక్రియను కలిగించాలి.

**వ్యాఖ్య:-** సర్వ పాపాలు నశించడానికి భగవత్కృపయే తప్ప గత్యంతరం లేదని ప్రార్థన.

సంసార మండలంలో మానవులు చేసే పాపాలు సముద్రంలాగా వృద్ధి బొందుతున్నాయి. "అం హో దురిత దుష్కృతం" (అమరం). 'దురితం' అంటే పుణ్యపాపాలనే ద్వివిధమైన కర్మ.

"సుకృతం న దుష్కృతం సర్వే పాప్మానోఽతో నివర్తంతే" - ఇతి సుకృతేఽపి పాప శబ్ద ప్రయోగాత్" -పాప శబ్దానికి అర్థం "పుణ్యపాపాలు" అని శ్రీ భాష్యకారుల సూక్తి. సుఖ దుఃఖ సాధన కర్మలే పుణ్య పాప కర్మలు. "ఆ బ్రహ్మ భువనం సర్వం కర్మ ప్రాధానికం హియత్" అన్నట్లు బ్రహ్మదేవుని సత్యలోకం వరకు ఇష్టమైన వాటిని సంపాదించుకొనే కర్మప్రాధాన్యం గల లోకాలే కదా! "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞ రూపాః - జరా మృత్యుం తే పునరే వాపియంతి" - ఇంద్ర, బ్రహ్మ లోకాల భోగాలను అపేక్షించి చేయబడే యజ్ఞాది కర్మలన్నీ చిల్లులున్న నావల లాంటివి. సంసార సాగరాన్ని దాటించలేనివి. ఫలాన్ని కోరి యాగాలుచేసేవారు మళ్ళీ జన్మ జరామరణాలను

పొందుతారని ఉపనిషత్తులు బోధిస్తునే ఉన్నాయి. చేసే పుణ్య కర్మలలో కూడా మంత్ర, తంత్ర లోపాల వల్ల అనేక దోషాలూ సంభవిస్తాయి. ఇక తెలిసో, తెలియకనో చేసే పాపాలు మరెన్నో ఉంటాయి. అసత్యకథనం, అభక్ష్య భక్షణం, పరహింస, పరదారా పరిగ్రహణం, పరద్రవ్యాపహరణం మొదలైన అకృత్యాలనే దోషాలు, అపరాధాలు, అపచారాలు అంటారు.

**1. భగవదపచారం :-** అర్చా విగ్రహం శిలా లోహదులచే నిర్మింపబడినదే. గురువులూ నరులే, శ్రీ పాద తీర్థం నీరే, సకల పాపాలను పోగొట్టే, పరమ, చరమ పురుషార్థ సిద్ధిని కలిగించే అష్టాక్షరీ మంత్రమూ శబ్ద సామాన్యమే, శ్రీమన్నారాయణుడూ ఇతర దేవతలతో సమానుడే అని విమర్శించడం.

**2. భాగవతాపచారం :-** భగవద్భక్తులు సజాతీయులనీ, వర్ణాశ్రమ ధర్మాలు బుద్ధి జాడ్య జనితాలనీ, యౌవన, ధన, విద్యాధికారాల మదం వల్ల భాగవతోత్తములకు విరోధంగా ప్రవర్తించడం.

**3. అసహ్యాపచారం :-** సర్వేశ్వరుని పట్ల, సాధుజనులపట్ల, సమాజం పట్ల నిష్కారణంగా, అసూయా ద్వేషాలతో అమానుషంగా వ్యవహరించడం.

పుణ్య పాప రూపమైన కర్మ, పూర్వాఘమనీ, ఉత్తరాఘమనీ రెండు విధాలు. ప్రపత్తిని చేయడానికి ముందు చేసిన కర్మ పూర్వాఘం, తర్వాత చేసిన కర్మ ఉత్తరాఘం. సంచితమనీ, ప్రారబ్ధమనీ పూర్వాఘమూ రెండు రకాలు. సంచిత కర్మ అంటే ఫలించడానికి సిద్ధంగా లేని, కూడ బెట్టుకొన్న కర్మ. ప్రారబ్ధ కర్మ అంటే ఫలాన్ని అనుభవిస్తున్న కర్మ.

ప్రారబ్ధకర్మ కూడా అభ్యుపగతం, అనభ్యుపగతమని ద్విధా విభక్తం. 'అభ్యుపగతం' అంటే ప్రకృత దేహంతో కర్మ అనుభవించి పూర్తి అయితే, దేహాంతమందు మోక్షప్రాప్తి. 'అనభ్యుపగతం' అంటే కర్మానుభవం ప్రకృత దేహావసానం వరకు పూర్తికాకపోతే, దేహాంతరాలతో అనుభవింపదగినదై వాటి అంతమందు మోక్ష ఫలాన్ని పొందేది. భగవంతుని ప్రీతి కొరకు ఫలాపేక్షలేకుండా భగవదారాధనగా చేయబడని ఇష్టా పూర్తకర్మలన్నీ శ్రేయస్సును-శాశ్వత సుఖాన్ని కలిగించవు.

ఊర్ధ్వ లోక భోగాలను పొందడమే శ్రేయస్సు అనుకొనేవారు, ఇష్టా పూర్తాది కర్మలచేత కలిగే పుణ్య ఫలాన్ని నాక లోక, సత్యలోకాల్లో అనుభవించి మళ్ళీ ఈ మనుష్య లోకాన్నిగానీ, ఇంతకన్న హీనమైన అథోలోకాలను పొందుతారనీ "నాకస్య పృష్ఠేతే సుకృతే உను భూత్వా, ఇమం లోకం హీనతరం చా విశంతి". (ముం.ఉ.2-9) అని వేదాంత శాస్త్రం బోధిస్తుంది.

సాయుజ్యమనే మోక్ష సామ్రాజ్యాన్ని పొందగోరే మహానుభావునికి సుకృత దుష్కృతాలు రెండూ తొలగిపోవాలి.

"తత్సుకృత దుష్కృతే విధూనతే"

"శార్న్ద ఇరువల్ విసైకళుమ్ శరిత్తు" అని ఉభయ వేదాన్తాలు వెల్లడించాయి. కాబట్టి, దురితరాశి మహాసముద్రమన్నారు దేశికులు.

**"యద్బ్రహ్మ కల్ప నియతానుభవే ప్యనాశం**

**తత్కిల్బిషం సృజతి జంతు రిహక్షణార్ధే".**

అనేక బ్రహ్మ కల్పాలలో అనుభవించినప్పటికీ నశించనంతటి పాపరాశిని మానవుడు అరక్షణంలో సృజిస్తాడని శ్రీ కూరేశుల సూక్తి.

**1. అనుక్షణ సముత్థితే :-** సముద్రం పున్నమనాడు మాత్రమే వృద్ధి పొందుతుంటే, మానవుడు చేసే పాపాలు క్షణం క్షణం వృద్ధిని పొందుతున్నాయి. నావ లేక పోతే వారిధిని దాటడం దుస్తరం. "విష్ణు పోతం" లేకుంటే దురిత వారిధి దుస్తరమే. "సంసారార్ణవమగ్నానాం, విషయా క్రాంత చేతసాం। విష్ణుపోతం వినానాన్యత్ కించిదస్తి పరాయణమ్ ॥" (వై.ధ.)

"సంసార సింధుమతి దుస్తర ముత్తితీర్షోః నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య। లీలా కథా రస నిషేవణమంతరేణ, పుంసోభవేత్ వివిధ దుఃఖదవార్దితస్య ॥"

(భాగ.12-4-40)

"పుణైవన్ పిఱివిక్కడల్ నీన్దు వార్క్కే" సంసార సాగరాన్ని తరింపగోరే వారికి తెప్పగా ఉండేవాడు భగవానుడే (తి.వా.మొ.2.8.1)

**2. యది క్వచన నిష్కృతిః భవతిసాஉపి దోషా విలా :-** ధర్మ శాస్త్రాలలో

ఆచారకాండలనీ, ప్రాయశ్చిత్త కాండలనీ ప్రత్యేకంగా ప్రకరణాలున్నాయి. వాటిలో ద్రవ్యలోప, క్రియా లోపాలవల్ల కలిగే దోషాలకు, జ్ఞాతా జ్ఞాత కృత దోషాలకు ప్రాయశ్చిత కర్మలు - దాన తపో యజ్ఞాది కర్మలు విధించబడియున్నాయి. శ్రీ వ్యాస సూక్తి ఇలా ఉంది.

**"తపసాకర్మణా చైవ ప్రదానేన చ భారత ।**
**పునాతి పాపం పురుషః పునశ్చేన్న ప్రవర్తతే ॥**

(భారతం- (రాజ ధర్మాను శాసన పర్వం) శాంతి పర్వం 35.అ.1) సర్వం పాప్మానం తరతి, తరతి బ్రహ్మహత్యాం యో ఉ శ్వమే ధేన యజతే".

బ్రహ్మహత్యాది పాపాలను కూడా అశ్వ మేధయాగం చేసిన వాడు, ప్రక్షాళన చేసుకొని పవిత్రుడవుతాడని శ్రుతి కూడా పాప పరిహార కర్మను విధించింది. కాని చేసిన పాపానికి పశ్చాత్తప్తుడై, మళ్ళీ పాపం చేయకుండా ప్రవర్తిస్తేనే, ప్రాయశ్చిత్త కర్మచే పవిత్రుడవడం సంభవిస్తుంది. లేకుంటే అది ప్రాయశ్చిత్త వినాశ్యమవుతుంది.

**"ప్రాయో నామ తపః ప్రోక్తం చిత్తం సంయమ ఉచ్చతే ।**
**తపస్సంయమ సంయుక్తం ప్రాయశ్చితం విదుర్బుధాః ॥"** (ప్రా.కాండ)

'ప్రాయః' అంటే తపస్సు. 'చిత్త మంటే నిగ్రహం. ఈ రెండు పదాల కలయికయే 'ప్రాయశ్చిత్తం' అని నిర్వచింపబడింది. పాపాపనోదక కర్మ వాచకం 'తపః' శబ్దం. ఫలాపేక్ష లేకుండా ఏకాగ్రతతో చేయాలి.

**ఫలంకతక వృక్షస్య యద్యప్యంబు ప్రసాదకం ।**
**ననామ గ్రహణా దేవతస్య వారి ప్రసీదతి ॥"**

కతక మనబడే చిల్ల గింజను పొడి చేసి నీళ్ళల్లో వేస్తే నీళ్ళు స్వచ్ఛపడుతాయి. 'కతక' మనే పేరు చెప్పినంత మాత్రాన నీళ్ళు స్వచ్ఛపడవు కదా! అలాగే మంత్ర పఠనంతో పాటు సముచిత ద్రవ్యాలతో విధ్యుక్త కర్మను ఆచరించాలి. లేకుంటే పాపమంటుకోంటుంది. పాపక్షాళనార్థం ప్రాయశ్చిత్తం చేస్తే, ఆ కర్మలో కూడా లోపాలూ, పొరపాటూ దొర్లితే, ఇక కలిగే దోషాలకు అంతుండదు కదా! కాబట్టి పాపాలకు శాస్త్రాలలో నిష్కృతి చెప్పబడినా అదికూడా దోష భూయిష్ఠమవుతుంది.

**3. తదిత్థమ గతేమయి :-** "ఒరు కురువి పిణైత్త పిణై ఒరువరాల్ అవిషిక్క పోకిరతిల్లై, సర్వశక్తి కర్మాను గుణమాక పిణైత్తప్పిణైయై అవనైయే కాల్కట్టి అవిషిత్తుక్కొళ్ళుమ్". (ముదల్(శ్రి) ఒక పిచ్చుక కట్టిన గూటిలోని చిక్కును తెగకుండా విడదీయ చేతకాని వ్యక్తి, సర్వశక్తిమంతుడు కర్మానుగుణంగా వేసిన బంధాన్ని, అతని కాళ్ళు పట్టుకొనియే విడిపించుకోవాలి, అన్నట్లు అశక్తుడను. "కృతఘ్నే నాస్తి నిష్కృతిః" నిష్కృతి లేని కృతఘ్నుడను. "మత్తిలేన్ తంజమాగవే". వేరే దిక్కు చక్కిలేని వాడను. "కృతే పాపా ఉ_ నుతా పోవై యస్య పుంసః ప్రజాయతే। ప్రాయశ్చిత్తంతు తస్యైకం హరి సంస్మరణం పరమ్ ॥" చేసిన పాపాలకు మనస్సులో అను తాపబడే వ్యక్తికి హరి నామస్మరణమే శ్రేష్ఠమైన ప్రాయశ్చిత్తం - అన్నట్లు, దేశికులు శ్రీరంగనాథుణ్ని ప్రార్థించారు.

4. స్వబుద్ధి పరికల్పితం కిమపి ప్రతి విధానం త్వయా ఆధీయతామ్ :- స్వామీ! నీవే నీ సంకల్పంతో అగతికుడనైన నా పట్ల ప్రత్యేకమైన ఉపాయాన్ని చూపించు. "తొషువనేనై, ఉనతాళ్ శేరుమ్ వకైయే శూష్ కండాయ్". దాసుడు నీ శ్రీ పాదాలను పొందే విధంగా నీవే కార్యచింతన చేయుమని నమ్మాళ్వార్లు (తి.వా.మొ. 5.8.5) ప్రార్థించారు.

"తీతవమ్ కెడుక్కు మముతమ్" - నిష్కృతి లేని పాపాలనూ, నిష్కృతి గల పాపాలనూ అన్నిటినీ పోగొట్టి భోగ్యతను కల్పించేవాడు పరమాత్ముడు. కాబట్టి, తన విషయమై ఒక కొత్త తంత్రాన్ని పన్నుమంటున్నారు దేశికులు.

ప్రపన్నుని పూర్వోత్తరాఘాలన్ని కూడా భగవత్కృప చేత ఫల జనకాలు కావు. అవి ఏమవుతాయి? అంటే "సుహృదః సాధుకృత్యాం, ద్విషన్తః పాపకృత్యామ్"- ప్రపన్నుణ్ని ప్రేమించే వారు ఆయన పుణ్య కర్మను, ద్వేషించేవారు పాపకర్మను అనుభవించే రీతిగా చేస్తాడు. "ఉభేవిద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి"- బ్రహ్మ విద్వరిష్ఠుడు ఇలా సుకృత దుష్కృతాలను, రెండింటిని తొలగించుకొని కర్మవేశం లేనివాడై శాశ్వతానందమయమైన, మోక్షాన్ని పొందుతాడు, అనే వేదాంత శాస్త్ర విషయం దేశికులకు తెలుసు కదా!

జ్ఞాన వైరాగ్య పురుషులైనందువల్ల దేశికులకు మిత్రులు, శత్రువులు తన

పుణ్య పాపాలను అనుభవించే- ఇది వరకున్న - పద్ధతి ఇష్టం లేదేమో! అందుకే, కొత్త పద్ధతిని చూపించుమని వేడుకొన్నారు.

"కరుమముమ్ కరుమపలను మాగియ కారణన్తన్నై". (తి.వా.మొ. 3-5-10) పుణ్య పాప కర్మలకూ, వాటి ఫలాలకూ నియామకుడైన జగత్కారణుడు కాబట్టి, భగవానుడు తన సంకల్ప శక్తితో ప్రత్యేకమైన ప్రతిక్రియను కల్పించాలని ప్రార్థించారు.

"మత్పాపరాశి మథనే మధుదర్పహంత్రీం
శక్తిం నియుంక్ష్వ శరణాగత వత్సల! త్వమ్ ॥"

(శరణాగతి దీపిక. 48). శరణాగత వత్సలా! నీవు అనంత శక్తి కలవాడవు. అద్భుతమైన వాత్సల్యమూ కలవాడవు. ప్రళయకాలాన నీవు మధువనే రాక్షసుణ్ని దునిమిన అమోఘ శక్తిని నా దురిత వారాశిని మథించడమందు నియమించవయ్యా! అన్న ప్రార్థన గమనీయం. మొట్ట మొదట స్వబుద్ధిపరికల్పితమైన ఆ ప్రతి క్రియా శక్తి జగత్సృష్టికి కారణమయింది కదా! సంభావనాలంకారం.

**17. విషాద బహుళాదహం విషయవర్గతో దుర్జయాత్**
**బిభేమి వృజినోత్తర స్త్వదనుభూతి విచ్ఛేదతః ।**
**మయా నియత నాథవాన్ అయ మితిత్వమర్థాపయన్**
**దయాధన! జగత్పతే! దయితరంగ సంరక్షమామ్ ॥**

**అర్థం:-** దయాధన = దయయే ధనంగా కలవాడా! జగత్పతే = లోకనాథా! దయిత రంగ = రంగక్షేత్రమందు ఆదరం కలవాడా! విషాద బహుళాత్ = దుఃఖ బహుళమైన; దుర్జయాత్ = జయింప దుష్కరమైన; విషయ వర్గతః = శబ్దాది విషయ సముదాయం చేత; వృజిన+ఉత్తరః = పాప భూయిష్ఠుడనైన; అహం = నేను; త్వత్+అనుభూతి, విచ్ఛేదతః = నీయనుభూతికి ఎడబాయడం వల్ల; బిభేమి = భయపడుతున్నాను. అయం = ఇతడు; మయా = నా చేత; నియత, నాథవాన్ = ఎల్లప్పుడు రక్షకుడుగా కలవాడు; ఇతి = అని, త్వం; అర్థాపయన్ = ప్రకటిస్తూ; మాం = నన్ను; సంరక్ష = కాపాడుము.

**తా॥** దయాధనా! లోకనాథా! దయిత రంగా! అధిక దుఃఖం గలవీ, జయించడం

అతికష్టమూ అయిన ప్రాపంచిక విషయ భోగానుభవంచేత మహా పాపిష్ఠుడనైన నేను నీ అనుభూతి విశ్లేషం వల్ల భయపడుతున్నాను. నీవు 'ఇతడు నేనే రక్షకుడుగా కలవాడు' అని వెల్లడిస్తూ నన్ను రక్షించవయ్యా!

**వ్యాఖ్య:-** భగవదనుభవానికి దూరం కాకుండా పాపిష్ఠుణ్ని కాపాడుమని ఆర్తితో కవి మొరపెట్టుకొనే శ్లోకం.

**1. దయాధన :-** దయలేని వాడు గుణదరిద్రుడే. రక్షకుని స్వరూప నిరూపకమైన పదమిది.

**2. జగత్పతి :-** విశ్వాధీశుడు శ్రీమన్నారాయణుడు "పతిం విశ్వస్య" అని శ్రుతి

**3. దయితరంగ :-** దివ్య దేశమైన శ్రీరంగ క్షేత్రమందు అధిక ప్రీతి కలవాడు భగవానుడు ఇక్ష్వాకుల కులధనమైన, శ్రీరంగ విమానాన్ని శ్రీరాముడు విభీషణునికి ఇచ్చాడు.

"శ్రీరంగం మహద్ధా మసద్విజం స పరిచ్ఛదమ్ ।
ప్రదత్తం రాక్ష సేంద్రాయ ప్రియాయ ప్రియకారిణే".

(శ్రీరంగ మాహాత్మ్యం). "లబ్ధ్వా కుల ధనం రాజా". అని వాల్మీకి సంగ్రహంగా తెలిపాడు.

విభీషణుడు ఆ విమానాన్ని లంకకు తీసుకొని పోతుండగా మధ్యాహ్న సమయమయింది. ఆహ్నిక క్రియలను నెరవేర్చుకోవడానికి కావేరి మధ్యన విమానాన్ని నిల్పాడు. అక్కడి ప్రభువైన ధర్మ వర్మ కోరిక మేరకు ఆనాడు అక్కడ ఉన్నాడు. మరునాడు విమానాన్ని తీసుకొని పోవడానికి ప్రయత్నించాడు కాని అది కదలలేదు. దుఃఖ పడుతున్న విభీషణున్ని "నేనిక్కడనే ఉండడానికి సంకల్పించుకొన్నందువల్ల విమానం కదల లేదు" అని శ్రీరంగనాథుడు సమాధాన పరచాడు.

"స్వయం వ్యక్తేషు క్షేత్రేషు శ్రీమద్రంగం ప్రశస్యతే". స్వయం వ్యక్త క్షేత్రాలలో శ్రీరంగం గొప్పది.

**"క్షీరాబ్ధేర్మండలాద్భానోః యోగినాం హృదయాదపి ।
రతింగతో హరిస్తస్మాత్ రంగ మిత్యభిధీయతే ॥"**

పాలకడలి కంటెనూ, సూర్యమండలం కంటెనూ, యోగుల హృదయం కంటెనూ భగవానుడు ఆనందం పొందిన క్షేత్రం శ్రీరంగం. భూలోక వైకుంఠమే శ్రీరంగం 'వైకుంఠం రంగ మందిరం'.

రంగ్యతే-(గమ్యతే భక్తైః) ఇతి = రంగః నిత్యులూ, ముక్తులూ, ముముక్షువులూ ప్రాప్యం (ఫలం) గా పొందే క్షేత్రం శ్రీరంగం.

సీతాదేవి అశోక వనంలో "హారామ! సత్యవ్రత! దీర్ఘబాహో!" అని మొరపెట్టింది కదా! అలాగే, ఈ సంబోధన పదాలచేత దేశికుల ఆర్త ధ్వని స్ఫుటమవుతున్నది.

**4. విషయవర్గతో దుర్జయాత్ :-** "విషయాలు" అంటే, శబ్ద స్పర్శ రూప రస గంధాలు. విషయం కలది విషయి - ఇంద్రియం - అనబడుతుంది.

జ్ఞానేంద్రియాలు 5. కర్మేంద్రియాలు 5. మనస్సు అంతరింద్రియం. ఏకాదశేంద్రియాలు జీవోపకరణాలు.

"స్పర్శం తనుర్వేద రసంచ జిహ్వా ఘ్రాణంచ గంధాన్ శ్రవణౌచ శబ్దాన్ ।
రూపాణి చక్షు ర్నచ తత్పరం యత్ గృహ్ణం త్యన ధ్యాత్మ విదో మనుష్యాః ॥
(భారతం. శాంతిపర్వం. 202 అ. 4)

చర్మం స్పర్శను, నాలుక రసాన్ని, ముక్కు వాసనను, చెవులు శబ్దాన్ని, కన్నులు రూపాన్ని అనుభవిస్తాయి. ఈ పంచేంద్రియాలకు పరమాత్మ గోచరించదు. ఆధ్యాత్మికులైన మానవులు పరమాత్మ తత్త్వాన్ని అనుభవిస్తారు.

ఇంద్రియాలను విషయభోగాను భవాలనుంచి మళ్ళించి, అంతర్ముఖంగా వర్తింపజేసే ప్రపన్నులకు పరమాత్మ సాక్షాత్కారమవుతుంది.

విషయ భోగాలను అనుభవించే ఇంద్రియాలకు ఎప్పుడూ తృప్తి ఉండదు. కాబట్టి వాటిని జయించడం సుకరం కాదు.

"ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః" (భ.గీ. 2-60) బలమైన ఇంద్రియాలు మనస్సును బలాత్కారంగా వశపరచుకొంటాయి.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ ।

ఇంద్రియాణి హయానాహుః" (కఠోపనిషత్)

దేహం ఒక రథం. ఇంద్రియాలే గుఱ్ఱాలు, దేహి రథికుడు. అశ్వాలు రథాన్ని ఈడ్చుకొని పోయి మనిషికి దుఃఖాన్ని కలిగిస్తాయి.

**5. వృజినోత్తరః :-** విషయ భోగాలను అనుభవించడానికి మనిషి చేయరాని పాపాలను చేసి చెడిపోతాడు.

గజేంద్రుడు, ఒక్క మకరం మాత్రమే పట్టుకొని పీడిస్తే, బాధను భరించలేక పోయడు. "గ్రాహైరివాహం విషయైర్వికృష్టః (అష్టభుజాష్టకం. 1) మరినేనో అనేక నక్రాల వంటి విషయాలచే పీడితుడ నవుతున్నాను - అన్నారు దేశికులు.

"కురంగ మాతంగ పతంగ భృంగ మీనా హతాః పంచభిరేవపంచ ।

ఏకః ప్రమాదేవ కథం నహన్యతే యః సేవతే పంచభిరేవ పంచ॥" (గరుడపు)

లేడి, ఏనుగు, పక్షి, తుమ్మెద, చేప అనే ఈ ఐదు జంతువులు ఒక్కొక్కటి ఒక్కొక్క విషయమందే ఆశపడి చెడిపోతుంటాయి. మానవుడు వివేక శూన్యుడై తానొక్కడే త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణాలనే పంచేంద్రియాలచేత స్పర్శ రూప శబ్ద రస గంధాలు అనే ఐదు విషయాలను అనుభవిస్తుంటే ఎలా చెడిపోక ఉంటాడు?

"ననిందితం కర్మ యదస్తి లోకే సహస్రశో యన్న మయా వ్యధాయి ।

సోఽహం విపాకావసరే ముకుంద! క్రందామి సంప్రత్యగతిస్తవాగ్రే ॥"

(స్తో.ర.23) లోకంలో దూషింపబడిన కర్మ వ్యాపార మేది కలదో ఆ నింద్య వ్యాపారాన్ని నేను అనేక విధాలుగా చేయనిది లేదు. ఓ ముకుందా! అకృత్య కరణాలచే పరిపూర్ణుడనైన నేను, అవి ఫలించే కాలమందు వేరేగతిలేని వాడనై, ఇప్పుడు నీ యెదుట మొఱపెట్టుతున్నాను, అన్నారు ఆళవందార్.

**6. త్వదను భూతి విచ్ఛేదతః బిభేమి :-** విషయ భోగాభిలాషను సమూలంగా వదలుకొన్న ముముక్షువు భగవంతుణ్ని, సర్వ దేశ సర్వకాల సర్వావస్థలయందు సంశ్లేషించిన వాడై సర్వ విధ కైంకర్యాలచే ఆనందింపజేయగల అనుభూతిని పొందుతాడు. కాని నిషిద్ధ కర్మలను అనుష్ఠించి పాపిష్ఠుడనై నేనే (శ్రీరంగమందు)

అట్టి భగవదనుభూతి యొక్క విశ్లేషం వల్ల భయపడుతున్నానన్నారు దేశికులు.

"స్వదోషాను సంధానం భయహేతుః"- అన్నట్లు తన పాతకాలను తలచుకొన్నంతలో పట్టుకొన్న భయమిది. చేసిన కర్మలకు ఫలాన్ని ఇచ్చి అనుభవింప జేసేవాడు భగవంతుడే కదా!

"నానతియావకై శుషత్తి ఓ రైవరైక్కాట్టి, ఉన్నడిప్పోతు నా నణుకా వకైశెయ్తు పోతుకొణ్డామ్". (తి.వా.మొ. 7-1-4) స్వామీ ! ఈ ఆత్మకు విషయ ప్రావణ్యాం నాశనానికి కారణం, భగవదనుభవం ఉజ్జీవనమనినే నెరుగకుండా, అ ప్రధానమైన ఐదింటిని - శబ్దాది విషయాలను - చూపి (ఉన్మత్తజ్గాయ్ తిన్నప్పణ్ణి) ఉమ్మెంతకాయ తిన్న రీతిగా భ్రమింపజేసి, నీ శ్రీ పాద పద్మాలను నేను చేరనట్లు చేసి, వెంట ఉంటే దయ గలుగుతుందని దూరంగా పోయావు. "ఓరైన్దివైపెయ్తు" అన్న చోట - "శ్రీ ప్రహ్లాదనై ప్పామ్బుగళై క్కూడవిట్టు కట్టి నలిన్దాప్పోలే యిరుక్కిఱతు కాణుమ్, ఇవత్తై యుణ్డాక్క యెన్నుక్కలిలే నీ విట్టతు" నంబిళ్ళై వ్యాఖ్య. శ్రీ ప్రహ్లాదుణ్ని పాములతో కూర్చి కట్టి పీడించినట్లున్నది సుమా ఈ పంచేంద్రియాలను సృష్టించి నా పాలిట నీవు విడిచింది. "పోతికణ్డాయ్" (2) "ఉన్నైయను భవిక్క వేణుమెన్ను పోన్ద పిరాట్టియై మాయమానైక్కాట్టి ప్పిరిత్తు ఏకాక్షి, ఏకకర్ణికళ్ కైయిలేకాట్టి క్కొడుత్తు ఉన్నైక్కొణ్డు కన్డాప్పోలే కిడా యితువుమ్॥" (నం.వ్యాఖ్య)

నిన్ను అనుభవించాలని వచ్చిన సీతమ్మను, మాయలేడిని జూపి, యెడబాయ జేసి, ఏకాక్షి, ఏక కర్ణుల చేతికప్పగించి, నిన్ను యెడబాసే విధంగా చేసినట్లున్నది సుమా ఇది కూడా.

"వెల్కిఱ్పన్ ఉన్ తిరువరుళిల్లైయేల్" (7) ఇంద్రియాలను జయింప దుష్కరం.

"ఉన్నైయణ్డై కొళ్ళాతే పాణ్డవర్ కళ్ దుర్యోధననై వెల్లు మన్తన్డో నానిన్ద్రి యంగళై వెల్లువతు" (ఈడు) నీ అనుగ్రహాన్ని పొందక, నిన్ను అండగా తీసుకోక పాండవులు దుర్యోధనుణ్ని జయించితే కదా నేను ఇంద్రియాలను జయించేది.

"శుమడు తన్దాయ్" (10) ఉన్నైయనుభవిక్కైక్కుఱుప్పాక దేహత్తై తన్దాయానాయ్‌నీ. అతుతానే యెనక్కిషవుక్కుడలా యిత్తు. శరీర మాకిఱ

శుమ్మాట్టైతన్దాయ్. "ఐవర్తిశైతి శైవలిత్తు" బరువునిచ్చావు. నిన్ను అనుభవింపదగిన దేహాన్నీయ లేదు నీవు. అదే నాకు చాలా దుఃఖకారణమయింది. శరీరమనే బరువునిచ్చావు. అవి ఒకటో రెండో అయితే నేను మోయలేనా? ఈ పంచేంద్రియాలు ఒక దిక్కులో పోనిస్తే నేను మెల్లగ పోలేకుందునా? ఒక దుర్బలుని తలమీద భారమెత్తి పలు దెసలకు ఈడ్చుకొని పోతూ, తమ తమ మార్గాలను వెదకుతున్నట్లున్నాయి. ఇంద్రియాలు. విషయాలలోపలికి పోతూ, అది నా కర్మ ప్రాబల్యంచేత నీవు దూరమవుతున్నావని కదా ఇప్పుడు నేను భయపడుతున్నది; అని నమ్మాళ్వార్లు ఒక్క దశకంలో మొఱపెట్టుకొన్నదంతా దేశికులు ఈ శ్లోక పూర్వార్థంలో సంగ్రహించారు.

**7. నియత నాథవాన్ :-** ఇది అత్యంత పారతంత్ర్యం కలవాని మాట. "ఒన్శు శొల్లాయే"- "నీయఞ్జా తేకొళ్" ఎన్ను, 'ఎన్నై మాశుచః' ఎన్నవేణుమ్". ఒక్క మాట చెప్పు. నీవు భయపడకుమనీ, నన్ను 'దుఃఖించకు' అనాలి, అని ఆళ్వార్లు ప్రార్థించారు.

"తదహం త్వదృతే న నాథవాన్ మదృతే దయనీయవాన్న చ ॥ (స్తో.ర. 51)

స్వస్వాములకిద్దరికీ లాభమున్న పరమార్థం ఇది. నీవు తప్ప రక్షకుడు కలవాడను కాను; నేను తప్ప దయనీయుడు కలవాడవు కావు; అని ఆళవందారు స్తుతించారు.

అలాగే "ఈ దేశిక స్వామి నేను రక్షకుడుగా కలవాడు" అని యథార్థాన్ని నీవు ప్రకటిస్తూ నన్ను రక్షింపుమన్నారు.

"అథ సోఽ భయంగతోభవతి". "నమే భక్తః ప్రణశ్యతి" అని శ్రుతి స్మృతులు చెప్పినట్లు, జీవుడు అభయం పొందినవాడవుతాడు. సనాధజీవితం నిర్భరమవుతుంది కాబట్టి మనోదార్ఢ్య మేర్పడుతుంది. దానివల్ల పంచేంద్రియాలు పరుగులు దీయవు. తత్ఫలితంగా, విషయ భోగ్యతా బుద్ధి లేనివాడు సర్వశేషికి సర్వ విధ కైంకర్య రతుడవుతాడు.

ప్రతివ్యక్తి ప్రతిదినం ప్రార్థించదగిన శ్లోకమిది.

యథార్థం ప్రకటించాలి అని భగవంతుణ్ని కోరడానికి పూర్వార్థమే కారణమవడం వల్ల ఇది వాక్యార్థ హేతుక కావ్యలింగాలంకారం.

18. నిసర్గ నిరనిష్టతా తవ నిరం హసః శ్రూయతే
తత స్త్రియుగ! సృష్టివత్ భవతి సంహృతిః క్రీడితమ్ ।
తథాఽపి శరణాగత ప్రణయ భంగ భీతో భవాన్
మదిష్ట మిహయద్భవేత్ కిమపి మాస్మత జ్జీహపత్ ॥

**అర్థం :-** త్రియుగ = (3×2=6) షాడ్గుణ్యాం కలవాడా! నిరంహసః = పాపరహితుడవైన; తవ = నీకు; నిసర్గ, నిరనిష్టతా = స్వభావం చేతనే శోకరాహిత్యం; శ్రూయతే = వినబడుతున్నది. తతః = అందువల్ల; సృష్టివత్ = సృష్టివలె; సంహృతిః = సంహారం; క్రీడితం = క్రీడగా, భవతి = అవుతున్నది. తథా అపి = అయినప్పటికీ; శరణాగత ప్రణయ భంగభీతః = శరణు పొందిన వారియందలి ప్రీతికి ఆటంకం కలుగుతుందనే భయం కలవాడవైన; భవాన్ = నీవు; ఇహ = ఇక్కడ; మత్+ఇష్టం = నాకు ఇష్టం; యత్ = ఏది; భవేత్ = అగునో; తత్ = అది; కిమపి = ఏదైనప్పటికి; మాస్మ జీహపత్ = విడిచి పెట్టకు.

**తా॥** శ్రీ రంగనాథా! షాడ్గుణ్య పూర్ణుడా! పాప రహితుడవైన నీకు అనిష్టాలు లేవని ఉపనిషత్తు చెప్తుతున్నది. కాబట్టి జగత్తును సృష్టించడమెట్లో సంహరించడం కూడా నీకు ఆటగా ఉన్నది. అయినప్పటికీ, శరణాగతులయందు నీకు ఉండే ప్రణయానికి భంగం కలుగుతుందని భయపడే నీవు, నా కిష్టమైనదేదో అది ఎటువంటిదైనా విడువకు.

వ్యాఖ్య:- పరమ పురుషుని లీల వర్ణితం.

**1. త్రియుగ :-** భగవానుడు ఆరు గుణాలు కలవాడు అనే అర్థమే కాక ముగ్గురు వ్యూహావతారులకు రెండేసి గుణాలు ఉన్మిషితాలయ్యే అర్థమూ కలిగిన పదమిది.

"జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతే జాంస్య శేషతః ।
భగవచ్ఛబ్ద వాచ్యాని వినాహేయైర్గుణాదిభిః ॥"

1. జ్ఞానం - సర్వవస్తు సాక్షాత్కారం.
2. శక్తి - అఘటిత ఘటనా సామర్థ్యం
3. బలం - శ్రమ లేకుండా అన్ని ధరించడం.

4. ఐశ్వర్యం - నియమించే కర్తృత్వం
5. వీర్యం - నిర్వికారత్వం
6. తేజస్సు - పరాభిభవన సామర్థ్యం.

వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ - అనే చతుర్వ్యూహాలలో వాసుదేవునియందు సకల కల్యాణగుణాలకు ఉపలక్షకంగా, ఈ షడ్గుణాలు ప్రకాశిస్తాయి.

"తత్ర జ్ఞాన బలా ద్వంద్వా ద్రూపం సాంకర్షణం విదుః।
ఐశ్వర్య వీర్య సంభే దాద్రూపం ప్రాద్యుమ్న ముచ్చతే।
శక్తి తేజస్సముత్కర్షా దనిరుద్ధీతను ర్హరేః॥" (అహిర్బుధ్న్య సంహిత)

1. సంకర్షణ రూపమందు - జ్ఞానం, బలం.
2. ప్రద్యుమ్న వ్యూహమందు - ఐశ్వర్యం, వీర్యం.
3. అనిరుద్ధ మూర్తియందు - శక్తి, తేజస్సు స్ఫుటంగా ప్రకాశిస్తాయి. తక్కిన నాల్గు వ్యక్తం కావు. జగద్వాపార నిర్వాహకాలు షడ్గుణాలు.

పరవాసుదేవుడే శ్రీరంగ శేషశాయి.

**2. నిరంహసః నిసర్గ నిరనిష్టతా :-** "అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకో విజిఘత్సః అపిపాసః సత్యకామం, సత్యసంకల్పః". అని ఉపనిషద్వాక్యం. పాపం, ముదిమి, మృత్యువు, దుఃఖం, ఆకలి, దప్పిక, ఇవి లేకుండడం, సత్యకామం, సత్యసంకల్పం అనే గుణాష్టక విశిష్టమైనది భగవత్స్వరూపం.

"అజాయమానో బహుధా విజాయతే". (శ్రుతి) పుట్టుక లేనివాడు అనేక రూపాలుగా అవతరించే స్వభావం కలవాడు.

జీవులకు దేవమనుష్యాది శరీర పరిగ్రహ రూపమైన జన్మ పుణ్య పాపకర్మవశాన సంప్రాప్తమవుతుంది. కాని, భగవానుడు కర్మ పరాధీనుడు కాడు. అకర్మవశ్యుడు.

"జగతాముపకారాయ న సాకర్మ నిమిత్తజా".

"ఇచ్ఛా గృహీతాభిమతోరు దేహః" అని విష్ణు పురాణ వాక్యాలు. భగవన్మూర్తులు

కర్మను బట్టి ఏర్పడినవి కావు. లోకోపకారం కోసం తన సంకల్పం చేత పరిగ్రహింపబడిన రూపాలు అని శ్రీ పరాశర మహర్షి సూక్తి.

"న భూత సంఘ సంస్థానః దేహోఽ స్య పరమాత్మనః"

(మహాభారతం) భగవానుని అవతార రూపం పాంచ భౌతికం కాదని పారాశర్య సూక్తి.

"ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ

మాయయా". అసాధారణమైన నా దివ్య శరీరం కలవాడనై, నా సంకల్పాను సారంగా జన్మిస్తాను – అని గీతాచార్యుడే బోధించాడు. శ్రీ శంకరాచార్యులు (వి.స.నా) 'అమూర్తి మాన్' అనే చోట 'కర్మనిబద్ధనా మూర్తిః అస్య న విద్యతే – ఇతి అమూర్తిమాన్" కర్మ చేత ఏర్పడిన రూపం స్వామికి లేదు కాబట్టి 'అమూర్తిమాన్' నామానికి అర్థమని భాష్యంలో వివరించారు. అలాగే 'శేష పర్యంకశాయినః అస్యమహతీ మూర్తిః – ఇతి మహామూర్తిః". శేష తల్పమందు పవళించే విగ్రహం కలవాడని 'మహామూర్తి' నామాన్ని వ్యాఖ్యానించారు.

"నమాం కర్మాణి లింపంతి"– లోక సంగ్రహార్థం నేను ఏ కర్మల నాచరించినా అవి నాకు అంటవు (భ.గీ.4-14) అని శ్రీ కృష్ణ భగవానుని సూక్తి. కర్మాధీనుడు కానందువల్ల పాప రహితుడు. అవాప్త సమస్త కాముడు కాబట్టి, అనిష్టం– శోకం– లేక పోవడం స్వాభావికం.

**3. సృష్టివద్భువతి సంహృతిః క్రీడితమ్ :-**

"యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి,

యత్ప్రయంతి అభి సంవింశంతి". ఈ ఉపనిషదర్థమే "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై" అనే పోతన పద్యంలోనూ ఉంది.

"బహుస్యాం ప్రజాయేయ". నేను అనేకంగా అవుతాను– అని సంకల్పించుకొని యుగారంభంలో విశ్వసృష్టి చేస్తాడు. అట్లే 'యస్మింశ్చ ప్రళయంయాంతి పునరేవయుగక్షయే'– యుగాంతమందు ప్రళయాన్నీ కల్పిస్తాడు. అఖిల భువన జన్మస్థే మభంగాది లీలలన్ని దేవదేవునికి ఒక క్రీడ. "దివ్-క్రీడా విజిగీషా వ్యవహారమోద

మద స్వప్న కాంతిగతిషు" అనే ధాత్వర్థం వల్ల 'దేవ దేవ' పదానికి 'మేటి ఆటగాడు' అని అర్థం. భగవానునికి ఇది "బాల క్రీడేయమతులా"– నిస్తులమైన పిల్లలాట కదా!

ఇట్టి స్వరూప స్వభావాలు కల్గినవాడే అయినా, భగవానునికి ఒక భయం ఉంది.

**4. శరణాగత ప్రణయభంగ భీతః :–** అశోక వనంలో సీతమ్మ 'విదితః సహి ధర్మాత్మా శరణాగత వత్సలః'– ఓ రావణా! శ్రీరాముడు సర్వధర్మాలు తెలిసినవాడు, నీవే తప్ప నితః పరంబెరుగ, నన్ను రక్షించుమని వచ్చిన వ్యక్తిని దయతో కాపాడే వాడని ప్రసిద్ధి కదా! నీవు ఘోరమైన చావు తెచ్చుకో కూడదనుకొంటే శ్రీరామునితో స్నేహం చేయుమని చెప్పింది. రావణుడు వినలేదు. తర్వాత "ఆపంథానంతు గచ్ఛంతం సోదరోఽ పి విముంచతి". విభీషణుడు, పెడదారిని పట్టిన అన్నయ్యను విడిచి పెట్టి, శ్రీరామయ్యను శరణుజొచ్చాడు కదా!

అప్పుడు ఒక్క హనుమంతుడు తప్ప, తక్కిన వానర పరివారమంతా విభీషణునికి ఆశ్రయ మీయవద్దని శ్రీరామునికి చెప్పారు. శరణు జొచ్చినవాణ్ని రక్షించకుంటే ధర్మ భంగమవుతుందని మధనపడ్డాడు. రాముడు, అంతలో కండు మహర్షి చెప్పిన కపోతో పాఖ్యానం స్మృతికి వచ్చింది రామునికి. ఆ పావురాల కథను తన పరివారానికి వినిపించాడు. 'రిపూణామపి వత్సలః'– శత్రు బంధువే అయినప్పటికీ, శరణాగతుడైన విభీషణుని పట్ల వాత్సల్యం ఉబికిన శ్రీరాముడు సుగ్రీవుణ్ని పంపి విభీషణుణ్ని రప్పించి ఆశ్రయమిచ్చాడు.

ఇక సముద్రాన్ని దాటి లంకలోకి చేరిన తర్వాత సుగ్రీవుడు మేడ మీద ఉన్న రావణున్ని చూచి సహించలేక చంగున లంఘించి రాక్షస రాజును నాలుగు తన్నులు తన్ని తిరిగి రాగానే శ్రీరాముడు, ఒంటరిగా సాహసింపతగునా? త్వయి కించిత్ సమాపన్నే కింకార్యం సీతయా మమ?" సుగ్రీవా! నీకేమైనా అయితే సీతతో నాకేం పని? అంటూ తన మనో వ్యథను వెల్లడించాడు.

ఓ షాడ్గుణ్యమూర్తీ! రంగనాథా! నేను కూడా శరణాగతుడనే కదా! నీ ప్రణయానికి భంగం వాటిల్లకుండా నాకు ఇష్టమేదో దాన్ని నీవే తెలుసుకో, వదలకు.

"అరియాద ప్పిళ్ళైగళోమ్. శీరియరుళాదే;" (తి.ప్పావై) జ్ఞానం లేని పిల్లలం, నీ కోపమూ కృపలో ఒక అంశమే కాదా?" నా హితంకారయేద్ధరిః" శ్రీహరి కీడు చేయడు అనే విశ్వాసాన్ని చెరచకు. భరన్యాసాన్ని అంగీకరించు ప్రభూ!

"యచ్ఛ్రేయస్స్యాత్ నిశ్చితం బ్రూహితన్మే" అన్నట్లు నాకు ప్రియమై, శ్రేయస్కరమైన దాన్ని ఉపదేశించుమని దేశికులు వేడుకొన్నారు. నీకు తెలియదా? స్వామీ! శ్రీరంగ మందిర మందు నాతో నీవు అన్ని విధాలా సేవను చేయించుకోవాలి అనే నా అభీష్టాన్ని వదలక కృపతో నెరవేర్చుమని మొఱపెట్టాడు.

సాభిప్రాయ విశేషణాలవల్ల పరికరాలంకారం.

**19.** **కయాధు సుత వాయస ద్విరదపుంగవ ద్రౌపదీ**
**విభీషణ భుజంగమ వ్రజగణాంబరీషా దయః ।**
**భవత్పద సమాశ్రితా భయ విముక్తి మాపుర్యథా**
**లభేమహి తథా వయంసపదిరంగధుర్య! త్వయా ॥**

**అర్థం :–** రంగధుర్య = శ్రీరంగనాథా! కయాధు–ఆదయః । కయాధుసుత = ప్రహ్లాదుడు; వాయస = కాకాసురుడు; ద్విరదపుంగవ = గజేంద్రుడు; ద్రౌపదీ = ద్రౌపది; విభీషణ = విభీషణుడు; భుజంగమ = కాళీయుడు; వ్రజగణ = వ్రేపల్లెవాసులు; అంబరీష+ఆదయః = అంబరీషుడు మొదలైనవారు; భవత్+పద, సమాశ్రితాః = నీ శ్రీ పాదాలనాశ్రయించిన వారై; యథా = ఎట్లు; భయవిముక్తిం = భయం నుంచి విముక్తిని; ఆపుః = పొందినారో; తథా = అట్లే, వయం = మేము; త్వయా = నీ చేత; సపది = ఇప్పుడు; లభేమహి = (భయ విముక్తిని) పొందుతాం.

**తా॥** శ్రీరంగనాథా! ప్రహ్లాదుడు, కాకాసురుడు, గజేంద్రుడు, ద్రౌపది, విభీషణుడు, సుముఖుడు, కాళీయుడు; గోకుల గణం, అంబరీషాదులు నీ శ్రీచరణ రాజీవాలను ఆశ్రయించి భయ విముక్తిని పొందినట్లే, మేము కూడా నీ చేత భయ విముక్తిని వెంటనే పొందాలి.

**వ్యాఖ్య:–** భగవానుడు ఆశ్రితులకు వలె, తనకూ అభయాన్ని ప్రసాదించాలని కవి ప్రార్థన.

**1. కయాధు సుతుడు :-** "ప్రహ్లాదోహవై కాయాధవః" (శ్రుతి) హిరణ్యకశిపుని పత్నియైన కయాధువు కన్న కొడుకు ప్రహ్లాదుడు. ఇతడు రాక్షస జాతిలోని బాలుడే అయినా "ప్రహ్లాద నారద పరాశర పుండరీక" అనే మహాభక్తులలో అగ్రగణ్యుడు. తండ్రికి ముక్తిని కలిగింప జేయడమే కాక, ఇతని వంశంలో జనించే వారిని చంపనని శ్రీ లక్ష్మీ నృసింహ భగవానునిచే అభయాన్ని పొందిన పరమభక్తుడు ప్రహ్లాదుడు. రక్షకుడు శ్రీమన్నారాయణుడే అన్న మహా విశ్వాసం మూర్తీభవించిన బాలుడు ప్రహ్లాదుడు.

**2. వాయసం :-** ఇంద్రుని కుమారుడు జయంతుడు. తండ్రి స్వీకరించే యజ్ఞ హవిస్సును జయంతుడే గ్రహించి ఎంగిలి చేసినందువల్ల ఋషులు ఇతనిని కాకాసురుడవై బ్రతుకుమని శపించారని విజ్ఞులచే విన్న సంగతి. కాకాసురుడు, సీతారాములు చిత్రకూటాశ్రమంలో ఉన్నప్పుడు, సీతమ్మ వక్షోజాలను (మాంసమందలి ఆశచే) పొడిచి బాధించిన పచ్చి అపరాధుడు. "తృణమప్యస్త్రమభవత్," శ్రీరాముడు ఒక గడ్డి పరకను మంత్రించి బ్రహ్మాస్త్రంగా వానిపైన విడిచాడు. ఆకాకి, భగ భగమంటూ బ్రహ్మాస్త్రం వెంటబడగా ముల్లోకాలనూ, వాటికి అధిపతియైన తన తండ్రి చేతనూ రక్షింపబడ లేక విడువబడి, పలుసార్లు తిరిగి వేసారి, తుదకు రాముడే శరణమంటూ వేడుకొన్నది. రామునికి అభిముఖుడు కాగానే సీతమ్మ తల్లి చల్లని చూపు ప్రసరించింది. బ్రహ్మాస్త్రమూ మెత్తబడింది.

"త్రీన్ లోకాన్ పరిక్రమ్య తమేవ శరణం గతః".

వధార్హుడైన అర్ద్రాపరాధిని కూడా, (రామాస్త్రం అమోఘమైనందువల్ల ఒక కంటిని మాత్రం పోగొట్టి) "కాకుస్థః కృపయా పర్యపాలయత్". శ్రీరాముడు దయతో కాపాడినాడు.

**3. ద్విరద పుంగవుడు :-** గజేంద్రుడు క్రీడార్థియై జలాశయంలోకి దిగిన వెంటనే అతని కాలును మొసలి పట్టుకొన్నది.

"గజ ఆకర్షతే తీరే, గ్రాహ ఆకర్షతేజలే". గజం గట్టుకులాగితే, మకరం నీటిలోకి లాగుతుంది. పెక్కేండ్లు పోరాడి తావులు తప్పిన గజం, జగత్తుకు మూల

కారణుణ్ని "నీవే తప్ప ఇతః బరం బెరుగ మన్నించన్ దగున్ దీనునిన్, రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!" అని ప్రార్థించింది. ఆర్తత్రాణ పరాయణుడు నారాయణుడు వేగంగా వచ్చి, నక్రాన్ని చక్రంతో నరికి గ్రాహగ్రస్త గజపాదానికి చికిత్స చేశాడు.

"ప్రజయిన్ వాయిలే ములైయైక్కొడుత్తు గ్రంధియై చికిత్సప్పిక్కుమాప్పోలే"

(తల్లి, బిడ్డ నోటిలో చన్ను పెట్టి దాని గడ్డకు చికిత్స చేసినట్లు, స్వామి తన తలపాగ దీసి నోటిలో పెట్టుకొని ఊదిన వేడితో గజేంద్రుని కాలు నొప్పిని కాపి, చేతితో చల్లగా నిమిరి కాపాడిన కరుణామయుడు. ఆర్తితో మొఱపెట్టుకొన్న గజేంద్రుణ్ని, భగవంతుడు కాక, అతని వేగాన్ని పురిగొల్పిన తొందరయే రక్షించిందని శ్రీ పరాశర భట్టర్ త్వరకే మోకరిల్లారు.

"ఆ వాహన పరిష్క్రియం పతగరాజ మారో హతః,

కరిప్రవర బృంహితే భగవత స్త్వరా యైనమః- (శ్రీరం.రా.స్త. ఉ.శ.57)

4. ద్రౌపది :- ద్రుపద రాజ పుత్రిక ద్రౌపది. ఆమె యాజ్ఞసేని.

**"సదసి విదురభీష్మ ద్రోణ శారద్వతానాం**

**పతిభిరమరకల్పైః పంచభిః పాలితాఽపి ।**

**అహహ! పరిభవస్య ద్రౌపదీ పాత్రమాసీత్,**

**బలవతి సతి దైవే బంధుభిః కిం విధేయం ॥**

విదురుడు నీతిపరుడు, భీష్ముడు కురువంశ పితామహుడు, ద్రోణుడు ఆచార్యుడు, కృపుడు ప్రాథమిక విద్యాధ్యాపకుడు - ఇట్టి మహా పురుషులున్న సభలో పాండవులూ ఉన్నారు. దేవతలతో సమానులైన ఐదుగురు భర్తలచే పోషింపబడుతున్నదైనా ద్రౌపది, మూగ వారివలె చూస్తూ, నేల గీతలు గీస్తున్న మగలచే రక్షింపబడకున్నది.

దుశ్శాసనుడు కౌరవుల నిండు సభలో ద్రౌపది వలువలను ఈడుస్తున్నాడు. అయ్యో! అవమానానికి గురి అయింది ద్రౌపది. భగవానుడు బలవంతుడైయుండగా బంధువులతో నేమి పని? అనుకొన్న ద్రౌపది, రెండు చేతులెత్తి మొరపెట్టుకొన్నది ఇలా!

"శంఖ చక్ర గదాపాణే! ద్వారకా నిలయాచ్యుత!
గోవింద, పుండరీకాక్ష! రక్షమాం శరణాగతామ్॥"

శ్రీ కృష్ణుడు, కనబడకుండానే, ద్రౌపదికి వస్త్రాల నిచ్చి మాన సంరక్షణ చేశాడు.

**5. విభీషణుడు :-** "విభీషణస్తు ధర్మాత్మా". విశ్రవో బ్రహ్మ వల్ల కైకసి యందు జన్మించిన తృతీయ పుత్రుడు. శైలూషుని పుత్రికయైన సరమకు భర్త. ఇతడు రావణునితో సీతమ్మను శ్రీరామునికి ఇమ్మన్నాడు. 'ధిక్, కులపాంసనుడా! అన్న రావణుణ్ని విడిచి, సముద్రానికీవలనున్న శ్రీరాముణ్ని శరణు జొచ్చాడు. శ్రీరాముడు విభీషణుణ్ని లంకారాజ్యానికి పట్టాభిషిక్తుణ్ని చేశాడు. ఇతని పూర్ణశరణాగతి వల్ల శ్రీమద్రామాయణానికి శరణాగతి శాస్త్రమని పేరు కలిగింది.

**6. భుజంగం :-** సర్పం. (1) సుముఖుడు చికురుడనే సర్పరాజ పుత్రుడు. ఇంద్రుని సారథియైన మాతలి తన కూతురైన గుణకేశినినీతనికిచ్చి వివాహం చేయ తలచాడు. గరుత్మంతుడు సుముఖుడ్ని చంపడానికి వెంటబడగా, ఇంద్రుడు చెప్పిన రీతిగా, విష్ణుమూర్తిని ఆశ్రయించాడు. 'భగవన్! నీకు వాహనమైన నాకు ఆహారంగా ఉండే, సుముఖుణ్ని విడిచి పెట్టుమన్న గరుడుణ్ని విష్ణుమూర్తి తన తర్జని (చూపుడు వ్రేలు) తో బెదరించి సుముఖుణ్ని రక్షించాడు.

**(2) కాళీయుడు :-** కద్రువ కుమారుడు. రమణక ద్వీపమందు ఉండేవాడు. జనులు చెట్ల మొదళ్ళలో పెట్టెడి భక్ష్యాలను పక్షిరాజు, పాములు పంచుకొని తినుచుండేవి. గరుడుని కీయక కాళీయుడే అన్ని భక్షించినందువల్ల అతని మీద గరుడుడు దాడి చేశాడు. 'సౌభరి అనే ముని యమునా జలంతో తపస్సు చేస్తుండగా గరుడుడు చేపలను మ్రింగుతుండేవాడు. చేపలు ప్రార్థించినందువల్ల 'ఇక్కడి జలంలోకి గరుడుడు దిగితే చచ్చుగాక' అని సౌభరి శపించాడు.

రమణక ద్వీపాన్ని విడిచిపెట్టి యమునా నదీ హ్రదయందు కాళీయుడు చేరినందువల్ల, జలమే కాక గాలికూడా విషమయమయింది. ఆ మడుగు వద్ద, మీద సంచరించే పశువులూ, పక్షులూ మరణించాయి. ప్రజలు ఆ ప్రాంతానికి వెళ్ళక భయపడేవారు.

శ్రీకృష్ణుడు కదంబ తరువునెక్కి కాళీయ హ్రదంలోకి దూకాడు. కాళీయుడు కృష్ణుణ్ని చుట్టుకొని పోరాడాడు. కృష్ణుడు కాళీయుని తోకను పట్టి లాగి , పడగలపై నాట్యం చేసి ఛిన్నాభిన్నం చేశాడు. కాళీయుడు రక్తం క్రక్కి మూర్ఛావస్థను పొందగానే అతని పత్నులు శ్రీ కృష్ణుని చుట్టూ చేరి ప్రార్థించారు.

**"వేదాన్త వేద్య! దేవేశ! దుష్టదైత్యనిబ ర్హణ ।**
**ప్రాణాంస్త్య జతి నాగోఽ యం భర్తృ భిక్షా ప్రదీయతామ్".**

(వి.పు. 5అం.7.59)

'ఓ దేవ దేవా! కాళీయుని ప్రాణం పోతుంది. మాకు పతి భిక్షను ప్రసాదించు' మని మొఱపెట్టారు నాగపత్నులు.

మూర్ఛ నుంచి తేరుకొన్న కాళీయుడూ

**"హత వీర్యో, హత విషో దమితోఽ హం త్వయాఽ చ్యుత !**
**జీవితం దీయతా మేక మాజ్ఞాపయ కరోమికిమ్ ॥"** (వి.పు.76)

అచ్యుతా! (ఆశ్రితులను జార విడువని దేవా!) నన్ను మర్దించావు. శక్తి ఉడిగింది. విషం నశించింది. ప్రాణదానం చేయు స్వామి! నేనేమి చేయాలో ఆజ్ఞాపించుమని కోరాడు. శ్రీకృష్ణుడు "నా త్రస్థేయం త్వయా సర్ప ! కదా చిద్యము నా జలే । సపుత్ర పరివారస్త్వం సముద్ర సలిలం వ్రజ ॥" (77) నీవు ఈ యమునా కుండ జలమందు ఎప్పుడూ ఉండకూడదు. నీ కుటుంబంతో పాటు సముద్ర జలంలో నివసించడానికి వెళ్ళుమన్నాడు.

**"మత్పదానిచ తే సర్ప! దృష్ట్వామూర్ధని సాగరే ।**
**గరుడః పన్నగ రిపు స్త్వయి న ప్రహరిష్యతి ॥"** (78)

ఓ భుజంగమా! సముద్రంలో ఉండే రమణక ద్వీపమందు నీ తలమీద ముద్ర పడిన నా అడుగులను నాగాన్తకుడైన గరుడుడు చూచి, నిన్ను కొట్టలేడు, అని ఆజ్ఞాపించి, కాళీయుణ్ని సంరక్షించాడు భగవానుడు.

**7. వ్రజగుణం :-** వ్రేతల సమూహం. వీరు నిరక్షర కుక్షులు. శ్రీ కృష్ణునికి కలిగే బాలారిష్టాలకు - నిత్యగండాలకు- బాగా భయపడేవారు. బాలకృష్ణుడు తనను

తాను రక్షించుకొంటూ, వ్రజగణానికి కలిగిన భయాన్ని పోగొట్టాడు. ఇంద్రుడు కోపంతో ఏడు రేబవళ్ళు ఎడతెగకుండా రాళ్ళవాన గురిపిస్తే, బాలకృష్ణుడు ఒక దొడ్డ కొండనెత్తి తన చిటికెన వ్రేలు మీద మోపి, ఆ కొండ గొడుగు క్రింద గో, గోప గణాన్ని చేర్చి రక్షించాడు.

వ్రే (తల) పల్లెలో ఉన్నవారు సామాన్య చేతనులు కారు. "రామచంద్రం దృష్ట్వా సర్వాంగ సుందరం మునయో వనవాసినః విస్మితా బభూవుః". అరణ్య వాసులైన మునులందరు సుందరుడైన రామచంద్రుణ్ని చూచి విస్మితులయ్యారు. ఆలింగనాన్ని కోరారు. "కృష్ణావతారేయూ యం గోపికా భూత్వామా మాలింగథ". కృష్ణావతారమందు మీరు గోపికలై నన్ను ఆలింగించు కొనండి అని రాముడన్నాడు. కాబట్టి వ్రజ గణమంతా దేవ మౌని పటలమే. "గోప్యోగావఋచః - తా పసా స్తత్ర తేద్రుమాః"- ఋషులే గోపికలు, వేద ఋక్కులే గోవులు. అక్కడున్న చెట్లు కూడా తాపసులే, 'అని ఉపనిషద్వాణి.

రాసక్రీడలో ఒక్కొక్క గోపికకు ఒక్కొక్క కృష్ణుడై ఆనందింపజేశాడు. లోపలి ఆనందం దేహమంతా అల్లుకొన్నందువల్ల గోపికలాడారు, పాడారు, వారి ఆనందం అంబరాన్ని అంటే సరికి, కృష్ణుడు అదృశ్యుడయ్యాడు. 'మల్లియలారా! మీ పొదలమాటున లేడుగదమ్మా! అంటూ, నల్లనయ్యను తెల్లని మల్లెపూల చెట్ల పొదలలో వెదకసాగారు. చివరకు విరహాన్ని భరించలేక గొల్లలు గొల్లున ఏడ్చారు. అప్పుడు -

**"తాసా మా విరభూత్ శౌరిః స్మయమాన ముఖాంబుజః ।**
**పీతాంబర ధరః స్రగ్వీ సాక్షాన్మన్మథ మన్మథః ॥"** (భాగ. 10.32-2)

పీతాంబర ధారియైన వనమాలి అందరి మనస్సులను మథించే మన్మథుని మనస్సును కూడా మథనం చేసే సుందర రూపంతో చిన్నగా నవ్వుతూ ఆ గోపికల మధ్యన ఆవిర్భవించాడు. వాస్తవంగా, అది బ్రహ్మానంద హేల.

నపారయేऽ హం నిరవద్యసంయుజాం నుసాధుకృత్యం విబుధాయుషాపివః ।
యామా భజన్ దుర్ధరగేహ శృంఖలాం సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా॥"

మీరు గృహస్థమనే సంకెళ్ళను త్రెంచుకొని నాకు ప్రేమతో సేవ చేశారు.

నేను అమరత్వ జీవనంతో అనంతకాలం దాకా మీరు చేసిన త్యాగాలకు బదులు తీర్చుకొంటాననుకొన్ననూ బదులు తీర్చుకోలేను. మీ సౌమ్య స్వభావాలతోనే నన్ను ఋణ విముక్తుని చేయగలరు, అని శ్రీ కృష్ణ భగవానుడు ప్రకటించి, వ్రజవాసులను పూర్ణ కాములుగా ఉజ్జీవింపజేశాడు.

**8. అంబరీషుడు :-** ఇక్ష్వాకు వంశజుడైన నా భాగ మహారాజ పుత్రుడు. అంబరీషుడు ఏకాదశీ వ్రత నిష్ఠాపరుడు.

ఒక ద్వాదశి నాడు దుర్వాసుడు వచ్చాడు. అంబరీషుడా మునిని సత్కరించాడు. స్నానానంతరం పారణ చేయాలని ప్రార్థించాడు. యమునా నదిలో స్నానం చేయడానికి పోయిన దుర్వాసుడు త్వరగా రాలేదు. ద్వాదశ తిథి ఇక రెండు ఘడియల్లో పూర్తి కానున్నది. ఆలోపుగా పారణ చేయాలి. కాని మునిరానందువల్ల ధర్మ సంకటమేర్పడింది. "ఆహు రబ్భక్షణం విప్రాః ఆశితా నశితం చయత్" తీర్థోదకం పానం చేస్తే, అధర్మమంటదని భాగవతోత్తములు చెప్పినందువల్ల అంబరీషుడు తీర్థం పుచ్చుకొన్నాడు.

దుర్వాసుడు వచ్చి, ధర్మాన్ని అతిక్రమించాడన్న కోపంతో అంబరీషుని మీదికి కాలాగ్నితో సమానమైన కృత్యను (శక్తిని) సృజించి పంపాడు.

**"ప్రదిష్టం భృత్య రక్షాయాం పురుషేణ మహాత్మనా ।**
**దదాహ కృత్యాంతాం చక్రం కృద్ధా హి మివ పావకః ॥"**

(భాగ. 9. స్కం. 4అ. 51)

శ్రీమన్నారాయణుడు తన భక్తుణ్ని రక్షించుకోవడానికి చక్రాన్ని ఆదేశించగా, అది కృత్యను, కోపంతో ఉన్న సర్పాన్ని అగ్ని కాల్చి వేసినట్లు, భస్మం చేసింది. తన వెంటబడిన చక్రానికి భయపడి పోయి, దుర్వాసుడు బ్రహ్మ రుద్రాదులను రక్షించండి' అని వేడుకోగా వారు "తమేవ శరణం యాహి". చక్రినే శరణు పొందుమన్నారు. 'కృతాగసం మామవ విశ్వభావన'. "ఓ విశ్వ భావనా! అపరాధిని నన్ను కాపాడమని దుర్వాసుడు శ్రియఃపతి పాదాలను ఆశ్రయించాడు". నేను భక్త పరాధీనుడను, కాబట్టి నీవు అంబరీషుణ్నే క్షమించుమని వేడుకొమ్మన్నాడు భగవానుడు. దుర్వాసుడు

అంబరీషుని కాళ్ళు పట్టుకొన్నాడు. "సుదర్శన నమస్తుభ్యం" అని అంబరీషుడు ప్రార్థించగా చక్రం దుర్వాస మునిని దహించక శాంతించింది.

**9. 'ఆదయః'**- ఇంక (అహల్య, ధ్రువుడు) మొదలైన, భక్తులెందరో, పలురకాల భయాలతో నీ పాదాల నాశ్రయించి భయ విముక్తులయ్యారనడానికి, ఎనమండు గురిని మాత్రం సాక్షులుగా పేర్కొన్నారు దేశికులు.

**10. లభేమహి తథావయం సపది :-** రంగనాథా! మేమూ వారి లాగా, నీ పాదాలను ఆశ్రయించిన వాళ్ళమే కదా! కాబట్టి, మాకు వెంటనే కృపతో భయ విముక్తిని కలిగించు స్వామి!

మొదట నీ భద్రతను గూర్చి, తర్వాత మా క్షేమాన్ని గూర్చి చాలా భయపడుతున్న మాకు అభీతిని ప్రసాదించుమని దేశికులు (భక్తులను కలుపుకొని) ప్రార్థించారు.

**20. భయం శమయ, రంగధామ్న్యని తరాభిలాష స్పృశాం**
**శ్రియం బహుళయ ప్రభో! శ్రిత విపక్షము న్మూలయ ।**
**స్వయం సముదితం వపుస్తవ నిశా మయంతః సదా**
**వయం త్రిదశ నిర్వృతిం భువి ముకుంద! విందే మహి ॥**

**అర్థం :-** ప్రభో = శ్రీరంగ ప్రభూ! ముకుంద = ముకుందా! రంగధామ్ని = శ్రీరంగ క్షేత్రమందు; అనితర+అభిలాష, స్పృశాం = వేరే విషయాల మీద కోరిక తగులని వారి యొక్క; భయం = భీతిని, శమయ = పోగొట్టుము. శ్రియం = సంపదను; బహుళయ = ఎక్కువ జేయుము; శ్రిత, విపక్షం = ఆశ్రితుల యొక్క విరోధి వర్గాన్ని; ఉన్మూలయ = పెరికి వేయుము; స్వయం, సముదితం = స్వయం వ్యక్తమైన; తవ = నీ యొక్క; వపుః విగ్రహాన్ని; వయం = మేము; సదా = ఎల్లప్పుడు; నిశామయంతః = చూస్తున్న వాళ్ళమై; త్రిదశ నిర్వృతిం = దేవతల ఆనందాన్ని; భువి= భూలోకమందు, విందేమహి = పొందుము గాక.

**తా॥** ప్రభో! ముకుందా! శ్రీరంగ క్షేత్రమందే తప్ప ఇతర విషయాలయందే మాత్రమభిలాష లేని పరమ భాగవతుల భయాన్ని నశింపజేయుము. శ్రీ వైష్ణవ

శ్రీనిబాగా వృద్ధిపరచుము. ఆశ్రితుల శత్రువులను నిర్మూలించుము. స్వయం వ్యక్తమైన నీ దివ్య మంగళ విగ్రహాన్ని కళ్ళారా సేవిస్తూ, నిత్యసూరుల ఆనందాన్ని మేమీ భూలోకమందే అనుభవిస్తాము.

వ్యాఖ్య:- శ్రీరంగనాథుణ్ని సేవిస్తూ మేమీ లోకమందే, వైకుంఠంలో నిత్యసూరులు అనుభవించే ఆనందాన్ని పొందుతామని ప్రార్థన.

**1. శ్రీరంగధామ్ని :-** శ్రీరంగ క్షేత్ర వైభవాన్ని దేశికులు ఒక పాశురమందు వివరించారు.

"గృహ దేహ త్విట్ ప్రభావా ధామాని" -

"ధామ స్థానేచ జన్మని" - (నిఘం) ధామన్ శబ్దానికి నానార్థాలున్నాయి. ఇవన్నీ ఇక్కడ వర్తిస్తాయి.

**"ఆ రాత వరుళము తం పొతిన్ద కోయిల్,**
**అమ్బుయత్తో నయోత్తి మన్నర్క్కళిత్త కోయిల్ ।**
**తోరాత తని వీరన్ తొషుత కోయిల్,**
**తుణైయాన విభీ ఱణుక్కుత్తుణైయా జ్కోయిల్,**
**శేరాత పయనెల్లాం శేర్క్కుజ్కోయిల్,**
**శెషు మఱైయిన్ ముదలెషుత్తు చ్చేర్న్ద కోయిల్ ।**
**తీరాత వినై యనైత్తుమ్ తీర్క్కు జ్కోయిల్**
**తిరువరంగ మెనత్తిగషుజ్కోయిలానే॥"**

ఎంత అనుభవించినా ఇంకా అనుభవించాలనే ఆశను పుట్టించే కృపా రూపమైన అమృతం పొంగి పొరలి వచ్చే దివ్యక్షేత్రం; పద్మభవుడైన చతుర్ముఖ బ్రహ్మ చేత అయోధ్యాధిపతుల కొసగబడిన దివ్యస్థానం; పరాజయ మెరుగని అసహాయ శూరుడైన శ్రీరాముని చేత స్వయంగా ఆరాధింపబడిన దివ్య మందిరం. సీతాపతికి సహాయభూతుడైన విభీషణునికి సాంసారిక దుఃఖ నివారణకై సహకరించే భగవదారాధన స్థలం; దుర్లభమైన ఫల పురుషార్థాలనిచ్చే భగవంతునికి ఆవాసభూమి; అనంత వేదాలకు ఆద్యక్షరమైన ప్రణవంతో కూడియున్న దివ్యదేశం; తీర్చనలవి కాని పాపాలన్నిటినీ నశింపజేసే దేవళం; సిరిటెంకి యని అందరిచే పొగడబడుతూ,

దేదీప్యమానమైన శ్రీరంగ ధామమది.

దేశికులు పందొమ్మిది శ్లోకాలలో సామాన్యంగా సాంసారిక దుఃఖాల వల్ల కలిగే భయాన్ని పోగొట్టుమని పలు రకాలుగా ప్రార్థించారు. కాని, ఈ శ్లోకంలో ముఖ్యంగా ఈ స్తోత్ర కావ్య రచనకు కారణమైన మ్లేచ్ఛుల దాడివల్ల కలిగిన భీతిని నిర్మూలించి, శ్రీరంగనాథుని భద్రతనూ, శ్రీరంగ క్షేత్రం యొక్క పవిత్రతనూ పరిరక్షించుమని ప్రత్యేక ప్రార్థన చేశారు.

**2. అనితరాభిలాషస్పృశాం భయంశమయ :-** శ్రీరంగ క్షేత్రమందున్న వారికి శ్రీరంగనాథుని యందే మనస్సు లగ్నమై యుంటుంది. వారు ప్రాపంచిక భోగాలను అనుభవించాలనే ఆశ లేశమైనా లేని పరమైకాంత భక్తులు.

**"ఏకాన్తిభిర్ద్వాదశభిః సహస్రైః పీఠైశ్చతుస్సప్తతిభిః సమేతః ।**
**అన్యైరనం తైరపి విష్ణు భక్తైః శ్రీరంగ ఆస్తే యతి సార్వభౌమః ॥"**

శ్రీమద్రామానుజ యతీంద్రులు పంద్రెండు వేల ఏకాన్తులతోనూ, డెబ్బయి నాల్గు పీఠాధిపతులతోనూ, అసంఖ్యాకులైన శ్రీ వైష్ణవులతోనూ కూడి శ్రీరంగధామమందే నిత్య నివాసమున్న వైభవమది.

"తూయ శుడర్చ్చోది తనదెన్నుళ్ళైత్తాన్" విమల తేజోమయుడైన శ్రియః పతి నా మనస్సునందు సుప్రతిష్ఠితుడని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

"ఊర్ పేరు మరంగమే" (నాచ్చి-తిరు) పవిత్ర క్షేత్రం పేరు శ్రీరంగమే. ఇక్కడి దైవమూ శ్రీరంగమే, అని డెందంలో అమందానందం కందళించిన గోదాదేవి శ్రీ సూక్తి ఇది.

"ఇతరా వసథేషు మాస్మ భూదపిమే జన్మ చతుర్ముఖాత్మనా". (స్తోత్రం. 55)

నీకు నిరంతర కైంకర్యం చేసే భాగవతాగ్రగణ్యుల యిండ్లలో ఒక పురుగునై పుట్టినా మేలే కాని ఇతరుల భవనాల్లో చతుర్ముఖ బ్రహ్మ రూపంతో ఉండే జన్మ మాత్రం నాకు కలుగకుండే కృపను ప్రసాదించుమన్నారు శ్రీయామున మునులు.

"పొన్న రంగ మెన్నిల్ మయలే పెరుగు మిరా మానుశన్"-

శ్రీరంగమని ఎవరైనా అంటే, శ్రీ మద్రామానుజులవారు ఆ పేరు విన్నంతనే

ఆ దివ్య క్షేత్రమందున్న ప్రేమ అతిశయించి, ముగ్ధులయ్యేవారు.

"న జాతు పీతామృతమూర్ఛితానాం నాకౌకసాం నందన వాటికాసు ।
రంగేశ్వర! త్వ త్పుర మాశ్రితానాం రథ్యాశునా మన్యత మోభవేయమ్ ॥"

శ్రీ రంగనాథా! నందన వనంలో విహరించే అమృతాహారులైన దేవతల జన్మలాంటి జన్మను ఎప్పుడూ కోరను. నీ దివ్య దేశమందలి వీధుల్లో సంచరించే శునకాలలో ఒక శునకంగా జన్మించి నా శ్రేయస్కరమే, అని శ్రీ పరాశర భట్టర్ ప్రార్థన.

"మధ్యే రంగం మమచహృదయే వర్తతే సావరోధః". (భ.ధ్యాన సోపానం. 11)

శ్రీరంగ నాథుడు పత్నులతో కూడి శ్రీరంగమందిరమందు వెలసియుంటూనే, నా ఎదలో కూడా నివసించాడని దేశికులు మురిసిపోయారు.

ఈ విధంగా శ్రీరంగ ధామమందే తప్ప వేరే విషయాల వాసన కూడా సోకని పరమై కాంతులకు భగవదనుభవానికి విఘాతం కలిగించే భయాన్ని,,తురుష్కుల దాడి వల్ల శ్రీరంగనాథుని భద్రతా విషయమై కలిగిన మహా భయాన్నీ పోగొట్టుమని వేడుకొన్నారు.

**3. శ్రియం బహుళయ :-** శ్రీ వైష్ణవ శ్రీని అధికం చేయుమన్నారు. భగవద్విషయ దివ్య ప్రబంధాను సంధానం చేసే భాగవత సమృద్ధిని కల్పించుమన్నారు.

"శ్రీమన్! శ్రీరంగ శ్రియం అనుపద్రవాం అనుదినం సంవర్ధయ". శ్రియః పతీ! శ్రీరంగైశ్వర్యాన్ని అంటే, భగవత్కైంకర్య రూప సంపదను ఉపద్రవం లేకుండా, దిన దినం హృద్యాభిరామంగా వృద్ధిని పొందించు, మని భగవద్రామానుజులు వారి నిత్య ప్రార్థన.

"శ్రీరంగ నాథో జయతు శ్రీరంగ శ్రీశ్చ వర్ధతామ్" అనీ;

"స్వయముపచిను నిత్యం రంగధామన్! సురక్షాం, శమిత విమత పక్షాం శాశ్వతీం రంగలక్ష్మీమ్ ॥" అని స్తుతించడమూ అట్టిదే.

'లక్ష్మణుడు లక్ష్మి వర్ధనుడు' అంటే సీతారాములకు లక్ష్మణుడు ఆర్జవంతో ఉత్తరోత్తరాభివృద్ధిగా దాస్యం చేసిన వాడనే కదా అర్థం.

**4. శ్రిత విపక్షమున్మూలయ :-** భగవంతుణ్ని ఆశ్రయించిన వారి శత్రువులను నశింపజేయాలి అన్నారు. శత్రువులు కంటక వృక్షాల వంటి వాళ్ళు. చెట్టును నరికితే అది మళ్ళీ పంగలతో పెరుగుతుంది. కాబట్టి మూలం అంటే తల్లి వేరును కనిపెట్టాలి. మూలం నేల లోపలి పొరల్లో బలంగా నాటుకొని ఉంటుంది. శక్తి యుక్తులతో ఆ మూలాన్ని పెటికి వేస్తే ఆ కంటక వృక్షం నశిస్తుంది. అలాగే పగ కలుగడానికి మూలమైన ధనాశ, భోగలాలస, గుణాలను దోషాలుగా భావించే ఈర్ష్యాసూయా ద్వేషాలను పెంచే దుర్గుణమైన కామమే ప్రబల విరోధి. "ద్విడ్విపక్షాహితా మిత్రదస్యు శాత్రవ శ్రతవః"- (అమరం) ఆలోచనలను, మాటలను, పనులను సాగనీయక హింసించడమే విపక్ష లక్షణం. భగవత్కైంకర్యానికి విరుద్ధంగా ఉండే స్వరూప, స్వభావాలను సవాసనగా నశింపజేయాలి. పూర్వార్ధంలో శ్రీరంగమందు వైష్ణవ శ్రీ పూర్వం వలె వైభవంగా శోభించాలని సుశ్లోకితం.

స్వయం వ్యక్త మూర్తులున్న క్షేత్రాలు :- ఆద్య మేతత్ స్వయం వ్యక్తం విమానం రంగ సంజ్ఞితమ్ । శ్రీ ముష్ణం వేంకటాద్రిశ్చ సాలగ్రామంచ నైమిశమ్ । తోతాద్రిః పుష్కరం చైవ నరనారాయణా శ్రమం । అష్టౌమే మూర్తయః సంతి స్వయం వ్యక్తా మహీతలే॥ అని ప్రసిద్ధం.

**5. స్వయం సముదితం వపుః :-** శ్రీరంగనాథుడు దేవతలచేగానీ, ఋషులచేతగానీ ప్రతిష్ఠింపబడినవాడు కాదు. తనంతతానే అభివ్యక్తమైనవాడు, ఆవిర్భవించినవాడు. విభీషణుడు కోరినా, కావేరి నడుమ శేష పీఠం నుంచి కదలనని తానే సంకల్పించుకొన్న దివ్య మూర్తి.

ముకుందుడు - భుక్తినీ, ముక్తినీ ప్రసాదించేవాడు. అర్చారూపం అప్రాకృతమే. పరత్వానికి కొదువలేదు.

**6. నిశామయంతః సదా త్రిదశ నిర్వృతిం భువి విందేమహి :-** వైకుంఠంలో ఉండే నిత్యసూరులు, ముక్త పురుషులు 'సదా పశ్యంతి సూరయః" అన్నట్లు పరమానంద రూపాన్ని సేవిస్తూ ప్రకాశిస్తారు. భగవంతుని కల్యాణ గుణాలకు వైకుంఠంలో కంటె భూలోకంలో ఎక్కువగా ప్రకాశించే అవకాశముంది. కర్మ బద్ధులు, ఆపన్నులు,

దయనీయుల పైననే కదా వాత్సల్య సౌశీల్య కారుణ్య సౌలభ్యాది గుణాల ప్రకాశావశ్యకత. నిత్య సూరులు వైకుంఠ నాథుణ్ని సేవిస్తున్నట్లే భూలోకంలో మేము కూడా శ్రీరంగనాథుణ్ని సేవిస్తుంటాం.

నిరంతరం నిర్విశత స్త్వదీయం అస్పృష్ట చింతా పదమాభిరూప్యమ్ ।
సత్యంశ పే వారణ శైలనాథ ! వైకుంఠ వాసేఽ పి నమేఽ భిలాషః ॥"

(వరదరాజ పంచాశత్. 49)

ఓ హస్తిగిరి నాథా! మనస్సుకు స్పష్టంగా గోచరించని నీ దివ్య సౌందర్యాన్ని నిరంతరం దర్శించే భాగ్యమున్న నాకు పరమ పదమందు ఉండాలని కూడా ఆశలేదు. ఒట్టేసి చెబుతున్నాను అన్నారు దేశికులు.

భగవంతునితో సమాన రూపం ధరించి, భగవత్సేవ జేస్తూ బ్రహ్మానందం పొందడమే పరమ పరుషార్థం. ఇదే మోక్షం.

"ఇదం హిరంగం త్యజతా మిహాంగం పునర్నచాంగం యది చాంగమేతి ।
పాణౌరథాంగం శయనే భుజంగం యానే విహంగం చరణేంబుగాంగమ్ ॥"

శ్రీరంగంలో దేహాన్ని త్యజించిన వారు కూడా పునర్జన్మను పొందరు. చేతిలో చక్రం, పాపరే దేసెజ్జ, గమనానికి గరుడవాహనం, చరణం నుంచి జాలువారే గంగ కలిగియున్న భగవానునితో సామ్య రూపాన్నే పొందుతారు.

"సోఽ శ్నుతే సర్వాన్ కామాంత్సహ బ్రహ్మణా విపశ్చితా".

శ్రుతి రీతిగా, భగవద్గుణాలను అనుభవిస్తారు.

అక్కడ గానీ, ఇక్కడగానీ, ఎక్కడైనా "సంకల్ప ఏవ భవతో నిపుణః సహాయః" (37) అన్నట్లు భగవంతునికి చాతుర్యం గల అతని సంకల్పం మాత్రమే సహాయపడుతుంది. కాబట్టి "యమే వైషవృణుతే తే నలభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూమ్ స్వామ్ ॥" (ముం. ఉప. 6ఖం-3)

భగవానుడు తన సంకల్పం చేత తనకిష్టుడైన భక్తునికే తన దివ్య స్వరూపాన్ని ప్రకటిస్తాడు. ఈ ఉత్తరార్థ భావానికి ఆళ్వార్ల శ్రీ సూక్తులే పారితోషకాలు.

"నల్వీడు పెఱినుమ్ కొళ్వ తెణ్ణుమో వెళ్ళియోర్ కుఱిప్పే" (తిరువాశిరియం)

ఆనందమయ మోక్ష ఫలాన్ని పొందిననూ జ్ఞానుల ఉద్దేశ్యం కిరీటాం గదహారాది దివ్యాభరణాలంకృతమైన భగవంతుని సుందర విగ్రహాన్ని సేవించడానికే కదా! (నమ్మాళ్వార్ల సూక్తి)

ఆ పరమ పురుషార్థాన్ని శ్రీరంగధామమందూ పొందవచ్చు.

"ఏరార్ ముయల్విట్టుక్కాక్కై ప్పిన్పో వతే". (శిఱియ తిరుమడల్)

'అందమైన కుందేలును విడిచిపెట్టి, కాకిని వెంబడించి పోవడం' జ్ఞానులకు తగునా? నేల మీద తిరుగాడే కుందేలును సులభంగా పట్టుకోవడం లాంటిది అర్చామూర్తి. ఆకాశంలో చెట్లకొమ్మల్లోనూ సంచరించే కాకిని పట్టుకోవడం దుర్లభం. పరత్వం దుర్లభమై భోగ్యం కాకుండేది. (పరకాల సూక్తి).

"గోవిదఱ్కోర్ కుత్తేవల్
ఇమ్మై ప్పిఱవిశెయ్యాదే ఇనిప్పోయ్
చ్చెయ్యుమ్ తవన్దానెన్". (నాచ్చి.తిరు.. 13-9)

గోవిందునికి అంతరంగ కైంకర్యాన్ని ఈ జన్మలోనే చేయకుండా, ఇక మరొక లోకానికి పోయి చేసే సేవ ఏమి ఉంది? భక్త్యంగకమైన ప్రేయోఽలంకారమిది.

పరమ పదమందు అనుభవించే ఆనందం కంటె, ఈ భూలోకంలోనే అర్చామూర్తిని ఆరాధించి అధికానందాన్ని పొందుతామన్నారు దేశికులు.

**21.** **శ్రియః పరబృఢే త్వయి శ్రిత జనస్యసంరక్షకే**
**సదద్భుత గుణోద ధావితి సమర్పితోఽ యంభరః ।**
**ప్రతిక్షణ మతః పరం ప్రథయ రంగధామాదిషు**
**ప్రభుత్వమను పాధికం ప్రథిత హేతిభిర్హేతిభి: ॥**

**అర్థం :-** శ్రియః = లక్ష్మీదేవి వల్ల; పరిబృఢే = వృద్ధిని పొందిన వాడవైన; శ్రిత జనస్య = ఆశ్రయించిన జనం యొక్క; సంరక్షకే = రక్షణ చేయువాడవైన; సత్+అద్భుత గుణ+ఉదధౌ = శ్రేష్ఠమైన, ఆశ్చర్యమైన గుణాలకు సముద్రుడవైన; త్వయి = నీయందు; ఇతి = ఇట్లు; అయం = ఈ, భరః = భారం; సమర్పితః = ఉంచబడినది. అతః పరం= ఇకమీద; ప్రథిత, హేతిభిః = ప్రసిద్ధమైన జ్వాలలు కల్గిన; హేతిభిః =

ఆయుధాల చేత; అనుపాధికం = స్వతః సిద్ధమైన; ప్రభుత్వం = ప్రభుశక్తిని; ప్రతిక్షణం = ఎల్లప్పుడు; రంగధామ+ఆదిషు = శ్రీరంగం, మొదలైన దివ్య దేశాలయందు; ప్రథయ= వెల్లడించుము.

**తా॥** ఓ రంగనాథా! నీవు లక్ష్మీపతివి, ఆశ్రిత జన సంరక్షకుడవు, ఆశ్చర్యమైన కల్యాణ గుణ సముద్రుడవు, అని నీ యందు ఈ భారం సమర్పింపబడింది. ఇకపైన ప్రసిద్ధ జ్వాలలు కల్గిన దివ్యాయుధాల చేత సహజమైన నీ ప్రభుశక్తిని ప్రతిక్షణం శ్రీరంగాది క్షేత్రాల యందు ప్రకటించుము.

వ్యాఖ్య:- శ్రీరంగాది దివ్య స్థలాలయందు పూర్వ వైభవాన్ని స్థాపించుమని ప్రపత్తి చేశారు.

**1. శ్రియః పరిబృఢే :-** శ్రీదేవి సహాయంతో నారాయణుని జగద్వ్యాపారం మూడు పూవులు, ఆరు కాయలుగా సాగుతున్నది. "జగత్సమస్తం యదపాంగ సంశ్రయమ్" ప్రపంచమంతా లక్ష్మీదేవి యొక్క కడకంటి చూపు నాశ్రయించి యున్నదని ఆళవందార్ సూక్తి. లోకమాతయైన లక్ష్మీదేవి సర్వోపద్రవ వారిణి. సర్వేశ్వరుని శ్రీ పాదాలను పొందించడంలో ఘటకురాలు కాబట్టి పురుషకారిణి. "శ్రియం జ్ఞాత్వా జ్ఞాతవ్యో భగవాన్ హరిః". ఆకారాన్ని బట్టి వస్తువును తెలుసుకొనే రీతిగా, ఆకార త్రయ సంపన్నురాలైన లక్ష్మీదేవి ద్వారా భగవంతుణ్ని తెలుసుకోవాలి.

"స్వామీత్వీశ్వరః పతిరీశితా, అధిభూ ర్నాయకోనేతా ప్రభుః పరివృఢోఽధిపః".

(అమరం) 'ఏలిక' కు ఇవన్నీ పర్యాయ పదాలే అయినా, ప్రతి పదానికి ప్రత్యేకార్థముంటుంది. పరిబృంహతి - వర్ధతే - ఇతి = పరిబృఢః (బృహ, బృహి వృద్ధౌ) వృద్ధిని పొందేవాడు, అని అర్థం. అప్రమేయం హితత్తేజః యస్యసా జనకాత్మజా" జానకీ జాని తేజస్సు అప్రమేయమని మారీచుడు రావణునితో అన్నాడు కదా! ఈ పదమే శ్లోకానికి ప్రాణం.

**2. శ్రిత జనస్య సంరక్షకే :-** శరణా గతులైన వారిని రక్షించేవాడు శ్రియఃపతియే.

"లక్ష్మ్యా సహహృషీ కేశో దేవ్యా కారుణ్య రూపయా ।
రక్షకః సర్వ సిద్ధాంతే వేదాం తేషుచ గీయతే॥"

దయా రూపిణియైన లక్ష్మీదేవితో కూడియున్న భగవానుడే రక్షకుడని వేదాన్త శాస్త్రమందు, సర్వసిద్ధాంతాలయందు తెల్పబడుతున్నది.

**3. సదద్భుత గుణోదధౌ :-** "త్వమసి స్వభావతః, సమస్త కల్యాణ గుణామృతోదధిః" అన్నారు ఆళవందార్. "కల్యాణ గుణ గణైక మహార్ణవ" అని శ్రీ మద్రామానుజులు ప్రార్థించారు.

**"యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక!**

**తథా గుణాహ్యనంత స్యాప్యసంఖ్యే యా మహాత్మనః ॥"**

సముద్రంలోని రత్నాలు లెక్కింపరాని వైనట్లే అనంతుని గుణాలూ లెక్కింపజాలనివి.

**సంఖ్యాతుం నైవశక్యంతే గుణా దోషాశ్చ శార్జ్గిణః।**

**అనంత్యాత్ ప్రథమోరాశిః, అభావా దేవ పశ్చిమః ॥"**

భగవంతునికి కల్యాణ గుణా,లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. హేయగుణాలు లేనే లేవు. కాబట్టి ఆయన గుణాలను గానీ దోషాలను గానీ లెక్కింప నెవరితరమూ కాదు.

"పత్తుడై అడియవర్క్కు ఎళియవన్"- భక్తులకు సులభుడు. ఎన్ని అవతారాలనెత్తినా వికారం చెందని సత్తా కలవాడు భగవానుడు.

పిఅర్ కళుక్కు అణియ విత్తకన్". భక్తి లేని వారికి తెలుసుకోవడానికి విస్మయనీయుడు. అర్జునునికి తననే ఇచ్చుకొన్నాడు. దుర్యోధనునికి పనికి రాని తన సైన్యాన్ని ఇవ్వడం ఆశ్చర్యం కదా!

"శత్రూణా మప్రకంప్యోఽపి లఘుత్వమగమత్కపేః"- పగవాడైన రావణునికి మూర్ఛిల్లిన లక్ష్మణుని శరీరం ఎత్తడానికి బరువయింది. అదే శరీరం భక్తి కల్గిన హనుమంతునికి తేలిక అయింది. ఒక్క పనిలోనే వారి వారి మనః స్థితిని బట్టి సౌలభ్య, దౌర్లభ్యాలను ప్రదర్శించడం ఆశ్చర్యమే కదా!

"అధిక తర గుణానంతదివ్యావతారాత్". (ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి)"

"స ఉశ్రేయాన్ భవతి జాయమానః". సర్వేశ్వరుడు కృపతో అవతరించి

నప్పుడు కల్యాణ గుణాలకు ప్రకాశమేక్కువగా ఏర్పడుతుందని శ్రుత్యర్థం.

ఈ మూడు విషయాలు భగవంతునికి స్వాభావికమైనవే. కాబట్టి ఇట్టి వానికే "సమర్పితోఽయం భరః". ఈ శ్రీరంగ క్షేత్ర భారం (భగవానునికే) సమర్పింపబడింది. "స్వామి స్వీకృత యద్భరోయ మలస స్తత్ర స్వయం నిర్భరః". అకించనుడైన జీవుడు, తన భారాన్నంతా భగవంతుడు స్వీకరించినందువల్ల, నిశ్చింతగా ఉంటాడు.

"మయి నిక్షిప్త కర్తవ్యః కృత కృత్యో భవిష్యతి". సర్వ కృత్యాలను నాపైన ఉంచే వ్యక్తి కృతకృత్యుడు కాగలడని, సర్వభారాన్ని తనపై పెట్టుకొనే భగవానుడు సాత్యకి తంత్రమందు తెల్పాడు.

**4. ప్రభుత్వమను పాధికం :-** నాణీయో నజ్యాయోఽ స్తి కశ్చిత్. (శ్రుతి) సమస్త వస్తువుల యొక్క స్వరూప, స్థితి, ప్రవృత్తి, నివృత్తుల వైభవాన్ని తన అధీనమందు కలిగియున్న శ్రీమన్నారాయణుని కంటె చిన్నది లేదు. పెద్దదీ లేదు. ఆయన అధికారం స్వభావ సిద్ధమైనదే. మంత్రోత్సాహ ప్రభుశక్తులలో ప్రభుశక్తి దుర్జనులను ధండించి సజ్జనులను కాపాడే సామర్థ్యం కలది.

**"న సంపదాం సమాహారే, విపదాం వినివర్తనే ।**
**సమర్థో దృశ్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్ ॥"**

ఆపదలను నివారించి సంపదల నొసగే సమర్థుడు పురుషోత్తముడు తప్ప లోకంలో మరొకడు కనబడదు కదా! బలవంతులు దుర్బలులను బాధింపకుండే రీతిగా, వారి వారి అనిష్టాలను పరిహరించి, ఇష్ట ప్రాప్తిని కల్గిస్తూ కాపాడే కరుణామయుడు కమలాపతి.

"ప్రథిథ హేతిభిర్హేతిభిః" - 'హేతి' శబ్దానికి చీకటిని నశింపజేసే జ్వాల, సంహరించే శస్త్రమని అర్థ ద్వయం.

"అర్చిర్హేతి శ్శి భాస్త్రియాం"-

"రవే రర్చిశ్చ శస్త్రంచ వహ్నిజ్వాలాచ హేతయః". (అమరం)

"హేతిభిశ్చేత నావద్భిరు దీరిత జయస్వనమ్" (రఘువంశం, 6సర్గ) సుదర్శన, పాంచజన్య, కౌమోదకీ, నందక, శార్ఙ్గములనే దివ్యాయుధాలు భగవానుని

హృదయాన్ని గ్రహించే ఇంగిత జ్ఞానం కలిగి, జయాన్ని సంపాదిస్తాయి. "జయి జయా దృష్టశక్తౌ నిషణ్ణా"- (సుదర్శన శతకం.96)

జ్వాలలచే జాజ్వల్య మానమైన సుదర్శన యంత్ర (స్వరూప) మందున్న అష్ట శక్తులలో "చక్రస్య ప్రాగ్భా గేజయాం దేవీం" (అహిర్బుధ్న్యసం) అన్నట్లు మొదట తూర్పు దిక్కు జయ శీలం కలిగిన జయలక్ష్మియే ఉన్నది. "సముద్ర తనయాం జయామ్". శ్రీదేవికి 'జయ' అని మరొక పేరుంది కదా!

**5. ప్రథయ ప్రతిక్షణం ప్రభుత్వం రంగధామాదిషు :-** జయ లక్ష్మి వైభవం గల దివ్యాయుధాల చేత భగవానుని ఆధిపత్యాన్ని శ్రీరంగమందే కాదు, అర్చామూర్తులున్న హస్తి శైలం, వేంకటాద్రి, యాదవాద్రి మొదలైన దివ్య దేశాలయందు సర్వదా ప్రకటించాలని భరన్యాసం చేశారు శ్రీ వేదాంత దేశికులు.

కారణం చెప్పి అవశ్యకార్యాన్ని చేయుమనడం విశేషోక్త్యలంకారం

**22.** **కలిప్రణిధి లక్షణైః కలిత శాక్య లోకాయతైః**
**తురుష్కయవనాదిభి ర్జగతి జృంభమాణం భయమ్ ।**
**ప్రకృష్ట నిజశక్తిభిః ప్రసభ మాయుధైః పంచభిః**
**క్షితి త్రిదశ రక్షకైః క్షపయ రంగనాథ! క్షణాత్ ॥**

**అర్థం :-** రంగనాథ = శ్రీరంగనాథా! కలి ప్రణిధి లక్షణైః = కలి పురుషుని భటుల చిహ్నాల చేత; కలిత, శాక్య, లోకాయతైః = కూర్చబడిన బౌద్ధుల చేతను, చార్వాకుల చేతను; తురుష్క, యవన+ఆదిభిః = తురుకలు, యవనులు మొదలైన విదేశీయుల చేతను; జగతి = లోకమందు, జృంభమాణం = చెలరేగుతున్న; భయం = భీతిని; ప్రకృష్ట నిజశక్తిభిః = అధికమైన, స్వశక్తి గల; క్షితి త్రిదశ రక్షకైః = భూదేవతలను కాపాడే; పంచభిః; ఆయుధైః = పంచాయుధాల చేత; క్షణాత్ = క్షణ కాలంలో; ప్రసభం = బలాత్కారంగా; క్షపయ = నశింపజేయుము.

**తా॥** శ్రీరంగనాథా! కలి పురుష లక్షణాలు కలిగిన బౌద్ధులు, లోకాయతులు, తురుకలు, యవనులు మొదలైన వారి చేత లోకమందు విజృంభిస్తున్న భయాన్ని అధికమైన స్వశక్తి కలవి కాబట్టి వైదిక జనులను రక్షించే పంచాయుధాలచేత క్షణంలో

బలాత్కారంగా నశింపజేయుము.

వ్యాఖ్య :- పంచాయుధాలచే విపక్షుల వల్ల కలుగుతున్న భయాన్ని నివారించుమని ప్రార్థన.

గత శ్లోకంలో సాధుపరిత్రాణం కోసం ప్రార్థించి, ఈ శ్లోకమందు దుష్కృద్వినాశం ప్రార్థింపబడుతున్నది.

**1. కలిప్రణిధి లక్షణైః :-** కలి ప్రభావం వల్ల సనాతన ధర్మం క్షీణిస్తుంది.

**"న ప్రీతిర్వేద వాదేషు పాషండేషు యదా రతిః ।**
**కలేర్వృద్ధి స్తదా ప్రాజ్ఞైరనుమేయా విచక్షణైః ॥**
**కిం దేవైః కిం ద్విజైర్వేదైః కిం శౌచేనాంబుజన్మనా ।**
**ఇత్యేవం విప్ర! వక్ష్యంతి పాషండో పహతా జనాః ॥** (వి.పు.6)

"ఓ మైత్రేయా! ఎప్పుడు ప్రజలకు పాషండులయందు ప్రేమ, వైదికుల యందు ద్వేషం కలుగుతుందో అప్పుడు కలియుగ లక్షణం పెరుగుతున్నదని ప్రాజ్ఞులు భావిస్తారు. దేవతలతోను, బ్రాహ్మణులతోను, వేద శాస్త్రాలతోను, నీటిచే కలిగే శుద్ధితోను ఏమి ప్రయోజనం? అని పాషండ మతులు వాగుతుంటారు.

**"వివాహో న కలౌ ధర్మ్యో నశిష్య గురుసం స్థితిః ।**
**నదా మ్పత్యక్రమో నైవ వహ్ని దేవాత్మ కః క్రమః ॥"**

కలి కాలాన లోకంలో ధర్మ వివాహాలు, గురుశిష్య సంబంధాలు, దాంపత్య ధర్మాలు, దేవ యజ్ఞ క్రియా కలాపాలు పాటింపబడవు.

**"కంద మూల ఫలాహారాస్తాపసా ఇవమాన**
**వాః । ఆత్మానం ఘాతయిష్యం తిహ్యనా**
**వృష్ట్యాది దుఃఖితాః ॥"** మానవులు కఱువు కాటకాల వల్ల – దుఃఖపడుతారు. తాపసుల లాగా దుంపలు, వేర్లు, పండ్లు తింటారు – ఆత్మ హత్యలూ చేసుకొంటారు.

**"అసంస్కృతాః క్రియాహీనా రజసాత మ సావృతాః ।**
**ప్రజాస్తే భక్షయిష్యంతి మ్లేచ్ఛారాజన్య రూపిణః ॥"** (భాగ.12)

సంస్కారం లేని వారై, నిత్య కర్మానుష్ఠానం లేని వారై, రజస్తమో గుణలావరించి

రాజుల రూపంలో ఉండే మ్లేచ్ఛులు ప్రజలను రక్షించడానికి మారుగా భక్షిస్తుంటారు. "అష్టశూలాజన పదాః శివశూలా ద్విజాతయః । కామిన్యః కేశ శూలిన్యః సంభవంతి కలావిహ" అన్న విక్రేతలు, వేద విక్రేతలుంటారు. స్త్రీల కేశ శూలినులవుతారు.

"విత్త మేవ కలౌ నృణాం జన్మాచార గుణోదయః ।
ధర్మన్యాయ వ్యవస్థాయాం కారణం బలమేవహి ॥ (భాగ. 12-2-2)

కలికాలంలో నరులకు పుట్టుకనూ, ఆచారాన్నీ, గుణాలనూ కలిగించేది ధనమే. ధర్మ, న్యాయ వ్యవస్థలకు ధన బలమే కారణం కదా!

"ప్రణిధిః ప్రార్థనే చరే". (అమరం) 'ప్రణిధి' శబ్దానికి 'ప్రార్థన, గూఢచారి' అని రెండు అర్థాలున్నాయి.

**2. కలిత శాక్యలోకాయతైః :-** కలిపురుషుని భటులలాంటి వారు బౌద్ధులు, చార్వాకులు. బౌద్ధులలో వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచారులు, మాధ్యమికులు అని నాలుగు తెగలవారున్నారు.

**1. వైభాషికులు :-** వీరి సిద్ధాంతంలో జగత్తు పరమాణు సంఘాతం, ప్రత్యక్ష సిద్ధం. జగత్తు గూర్చిన జ్ఞానం క్షణకం. అజ్ఞానమే ఆత్మ. క్షణికమనే బుద్ధియే మోక్షం. ఇంద్రియాలకు గోచరించేది జగత్తు.

**2. సౌత్రాంతికులు :-** వైభాషికులకు ప్రత్యక్షం చేత సిద్ధించేది జగత్తు. సౌత్రాంతికులకు మాత్రం అనుమానం చేత సిద్ధించేది జగత్తు. జ్ఞాన భేదాన్ని బట్టి జగత్తును అనుమానిస్తారు.

**3. యోగాచారులు :-** జ్ఞాత (తెలుసుకొనేవారు) జ్ఞేయం (తెలుసుకోదగినది) భ్రమ చేత సిద్ధించేవి. నిజంగా ఈ రెండు లేవు. ఉన్నది ఒక్క జ్ఞానమే. అది క్షణికమని గ్రహించడమే మోక్షం అంటారు.

**4. మాధ్యమికులు :-** ప్రమాణం (వస్తువు ఉన్నదని తెలిపేది), ప్రమేయం (ప్రామాణిక వస్తువు), ప్రమాత (వస్తువును తెలుసుకొనేవాడు) ఈ మూడు ఉన్నవనుకోవడమే భ్రమ. శూన్యమైన సాధనం చేత శూన్యాన్ని తెలుసుకోవడమే మోక్షం అంటారు.

బౌద్ధులు వేద ప్రామాణ్యాన్ని అంగీకరించరు. కాబట్టి వీరు వేదబాహ్యులు.

**2. లోకాయతులు :-** వీరు నిరీశ్వరవాదులు. నాస్తికులు. చార్వాకులని కూడా వీరికి పేరు. వీరు ఆకాశాన్ని అంగీకరించరు. నేల, నీరు, తేజస్సు, గాలి అనే నాలుగు భూతాల కలయిక వల్ల - తమలపాకు, సున్నం, వక్క, కలిపి తాంబూలం వేసుకొన్నప్పుడు ఎఱుపు రంగు ఏర్పడే రీతిగా - చైతన్య మనే ధర్మం ఆవిర్భవిస్తుంది. ఆ చైతన్యమే ఆత్మ. చైతన్యమున్న శరీరానికి సుఖ దుఃఖాలు కలుగుతాయి. ఆ నాలుగు భూతాలు విడిపోవడమే మరణం, అంటే చైతన్యం నశించడమే మోక్షమంటారు. వీరు వేదాలనుగానీ, దైవాన్ని గానీ అంగీకరించరు.

**3. తురుష్క యవనాదిభిః :-** తురుష్కులను ముస్లిములంటారు. వీరికి దేవాలయాలు, దేవతా విగ్రహ పూజల మీద విశ్వాసం లేదు.

**4. యవనులు :-** (గ్రీకు) Ionian అనే పదమే బహుశః యవన పదమయి ఉండవచ్చు. వీరు విదేశీయులు, హిందు ధర్మానికి వ్యతిరేకులు.

పద్నాల్గవ శతాబ్దిలో తురుష్కులు శ్రీరంగ క్షేత్రమందు దాడి జరిపారు. వారి వల్ల భారత దేశమంతట భయం విజృంభించింది.

**5. ప్రకృష్ట నిజశక్తిభిః ప్రసభమాయుధైః పంచభిః :-** "శంగువిల్ వాళ్ తణ్డు శక్కరక్కైయఙ్గు"- శంఖం,చాపం, ఖడ్గం, గద, చక్రం అనే పంచాయుధాలను శ్రీహస్తాలయందు కలవాడు రంగనాథుడు. (ఉత్సవ మూర్తి) పంచాయుధాలకు సహజమైన శక్తి అధికంగా ఉంది. అవి ప్రతిభట శ్రేణులకు భయంకరమైనవి. విష్వక్ భయాన్ని శమింపజేసేవి. సర్వేశ్వరుని సంకల్పాధీనమై ప్రవర్తించేవి. కాబట్టి

**6. క్షితి త్రిదశ రక్షకైః, క్షణాత్ క్షపయ :-** భూదేవతల - వేదమూర్తుల - ను సంరక్షించే ఆ పంచాయుధాలను ప్రయోగించడానికి సంకల్పించు శ్రీరంగనాథా! భయాన్ని తొలగించు 'క్షణం' అంటే కాల విశేషం.

"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషా దధి" (తై. ఉ.) స్వయం ప్రకాశుడైన పరమ పురుషుని నుంచి సమస్త నిమేషాలు జనించాయి.

**"అష్టాదశ నిమేషాస్తుకాష్ఠా, త్రింశత్తు తాః కలా।**
**తాస్తుత్రింశత్ క్షణః, తేతు ముహుర్తో ద్వాద శాస్త్రియామ్ ।**

'నిమేష' మంటే రెప్పపాటు కాలానికి సంజ్ఞ. 18 నిమేషాలు ఒక కాష్ఠ. 30 కాష్ఠలు ఒక కల. 30 కలలు ఒక క్షణం. 12 క్షణాలు ఒక ముహూర్తం. 30 ముహూర్తాలయితే ఒక అహోరాత్రం - దినం. ($1^1/_4$ ముహూర్తం = 1 గంట.)

స్వామీ! ఏ మాత్రం ఆలసించక, లోకమంతట వ్యాపించిన భయానికి కారకులైన దుర్జనులను నీ పంచాయుధాలచేత క్షణ(కాలం) లో నశింపజేయుమని మొఱ పెట్టారు శ్రీ వేదాంతాచార్యవర్యులు.

"కొళ్ళక్కుఱైవిలన్ వేండిత్తెల్లాంతరుమ్". శ్రీరంగనాథుడు కోరినదెల్ల ప్రసాదిస్తాడని ప్రపన్నుని కల్యాణ కాంక్ష. పరిణామాలంకారం.

**23.** **దితిప్రభవ దేహభి ద్దహన సోమ సూర్యాత్మకం,**
**తమః ప్రమథనం ప్రభో ! సముదితాస్త్ర బృందం స్వతః ।**
**స్వవృత్తి వశవర్తి తత్రి దశవృత్తి చక్రం పునః,**
**ప్రవర్తయతు ధామ్నితే మహతి ధర్మ చక్ర స్థితిమ్ ॥**

**అర్థం :-** ప్రభో = శ్రీరంగనాథా! దితి ప్రభవ దేహభిత్ = దైతేయుల దేహాలను ఛిన్నం భిన్నం చేయునట్టి; దహన, సోమ, సూర్య+ఆత్మకం = అగ్ని, చంద్ర, సూర్య రూపమైనట్టి; తమః ప్రమథనం = చీకట్లను చీల్చునట్టి; సముదిత+అస్త్ర బృందం = జనించిన అస్త్ర సముదాయం కలిగినట్టి; స్వవృత్తి-వృత్తి । స్వవృత్తి = తన వృత్తికి; వశవర్తి = అధీనమైన; త్రిదశ = దేవతల యొక్క; వృత్తి = వ్యాపారం కలిగియున్న; చక్రం = సుదర్శన చక్రం; స్వతః = స్వయంగానే; (శ్రీరంగ) క్షేత్రమందు; ధర్మ చక్ర స్థితిం= ధర్మ చక్రం యొక్క స్థితిని; పునః = మళ్ళీ; ప్రవర్తయతు = ప్రవర్తింపజేయుగాక.

**తా॥** ఓ శ్రీరంగ ప్రభూ! రాక్షసుల తనువులను తుత్తునియలు చేసేదీ, అగ్ని చంద్ర సూర్యాత్మకమైనదీ, అంధకారాన్ని ధ్వంసం చేసేదీ, అస్త్ర శస్త్రాలను అనేకంగా కలిగించేది, దేవతల వృత్తి తన వశమందు కలదియైన సుదర్శన చక్రం, నీ మహా క్షేత్రమైన శ్రీరంగమందు మళ్ళీ ధర్మ స్థితిని కలిగించుగాక.

వ్యాఖ్య:- ఒక్క సుదర్శన చక్రం చాలు; దానిచే శ్రీరంగ క్షేత్రమందు మళ్ళీ ధర్మాన్ని స్థాపించాలనీ ఆర్తి ప్రకటితం,

**1. దితి ప్రభవ దేహభిత్ :-** 'దితి' అనే కశ్యప ప్రజాపతి భార్యయందు జన్మించినవారు రాక్షసులు. "సుర ద్విషాం ప్రాణ వినాశి" అన్నట్లు విష్ణు చక్రం స్వీయ శక్తి చేత దైత్యుల దేహాలను చీల్చి చెండాడే స్వభావం కలది. భగవంతుని సంకల్పానికి ప్రతినిధి సుదర్శన చక్రం.

"కరుతు మిడమ్ పొరుతు". అన్న విధంగా భగవంతుని మనస్సును తెలిసి వర్తించేది సుదర్శనం.

"తదా దేవస్య సంకల్పః సుదర్శన సమాహ్వాయః ". రాక్షసాంతకుడైన శ్రీమన్నారాయణుని దివ్య సంకల్పమే సుదర్శనం.

"ఆషిప్పిరాన్ తన్నై"- చక్రధారియైన ఉపకారకుడు శ్రియఃపతి- అనే నమ్మాళ్వార్ల శ్రీ సూక్తికి శ్రీ నంబిళ్ళై గారు "కైయుమ్ తిరువాషియుమ్ ఆన అషకై ఆశ్రితర్క్కాక్కి, అత్తైక్కొణ్డు విరోధియై పోక్కు వార్కు విరోధియై పోక్కి"- శ్రీహస్తమందున్న సుదర్శన చక్రం చేత ఆశ్రితులను రక్షిస్తాడు; భగవంతుని వల్ల శత్రు నిరసనను కోరేవారికి తన చక్రంతోనే శత్రువులను నశింపజేసి ఆనంద పరచే ఉపకారకుడు చక్రపాణి - అని వ్యాఖ్యానించారు.

దీని వల్ల, భగవంతునికి ఆభరణంగానూ, ఆయుధంగానూ ఉన్న శ్రీ సుదర్శనుని ఉభయ విధ స్వరూపం ప్రకటింపబడింది.

**2. దహన సోమ సూర్యాత్మకం :-** అగ్ని, చంద్ర, సూర్య దేవతలు అనే త్రివిధ తేజో మూర్తుల రూపమూ కలవాడు సుదర్శన భగవానుడు. కాశీ నగరాన్ని దహించినప్పుడు అగ్ని రూపుడు. ఉత్తర కడుపులోని శిశువు (పరీక్షిత్తు) ను బ్రతికించినప్పుడు చంద్రరూపుడు. అర్జునునితో కూడివైదికుని పుత్రులను అన్వేషించే సమయాన సూర్యకృత్యాన్ని నిర్వహించాడు.

"సోమ సూర్య దహన ప్రభోజ్జ్వలం చక్రమే తదుదితం" (అహిర్బుధ్న్య సంహిత)

"హృదయాకాశే సౌర సౌమ్యాగ్నేయ సాత్త్వికాని మండలాని" (యోగశాస్త్రం)

**"రవి మధ్యే స్థితః సోమః, తస్య మధ్యేహుతాశనః।**
**తేజో మధ్యే స్థితం సత్త్వం, సత్త్వ మధ్యే**
**స్థితోఽచ్యుతః".** (మైత్రాయణీ యోపనిషత్తు)

హృదయమందు సూర్యమండలం, దాని మధ్యన చంద్రమండలం, దాని నడుమ అగ్ని మండలం ఉంటుంది. ఈ మూడు మండల తేజస్సుల మధ్య ఉండే సత్త్వ మండలమందు భగవంతుడు నివసిస్తాడని అర్థం.

**"సక్తాచిరం మనసి సంయమినాం నివాసాత్**
**సూర్యేందు వహ్ని మయ మండల వాసనేవ ॥"** (550)

యోగుల చిత్తంలో చిరకాలం నివసించడం వల్ల సూర్యసోమాగ్ని మండల త్రయ వాసన తగులు కొన్నదో అన్నట్లు శ్రీరంగనాథ పాదుకాదేవి తేజోమయంగా ఉన్నదని దేశికులు ఉత్ప్రేక్షించారు. సర్వ తేజస్సుల సమాహారమే సుదర్శనం.

**3. తమః ప్రమథనం :-** స్వాలోక లుప్త త్రిభువన తమసః' అన్నట్లు తన కిరణాల ప్రకాశం చేత ముల్లోకాల చీకటిని చీల్చేవాడు, తన దయా దృష్టిచేతనే లోక త్రయమందున్న వారి అజ్ఞానాన్ని నశింప జేసేవాడని అర్థ ద్వయం.

"తమో ధ్వాంతే గుణేశోకే" (మేదినీ నిఘంటువు)

"ఇడరిన్ఱియే యొరునాళ్ ఒరుపొషుదిల్ ఎల్లావులకమ్ కషియ, పడర్ పుగష్ పార్తనుమ్ వైదికనుమ్ ఉడనేఱత్తిణ్‌తేర్ కడవి" (తి.వా.మొ.ళి.3-10-5) ఒక బాపనయ్య పత్నికి నల్గురు పిల్లలు క్రమంగా పుట్టిన వెంటనే చనిపోతే రక్షించుమని శ్రీ కృష్ణుణ్ని ప్రార్థించాడు. కృష్ణుడు యాగ దీక్షలో ఉన్నాడు. పార్థుడు తాను రక్షిస్తానని యత్నించి విఫలుడయ్యాడు. దీక్షానంతరం శ్రీ కృష్ణ భగవానుడు అర్జునుణ్ని, బాపనయ్యను తనతో పాటు రథం మీద ఎక్కించుకొని ఒకనాడు ఒక్కపూట సమస్త లోకాలను దాటాడు. ఆవలపెం జీకటిని విక్రమ క్రమణ చక్ర ప్రకాశంచే అడ్డులేకుండా దాటి, వైకుంఠానికి చేరాడు. వైకుంఠుని దేవేరులు గోపాలకృష్ణమూర్తి సౌందర్యాన్ని చూడగోరి తీసుకపోయిన నల్గురు పిల్లలను పరమ పదం నుంచి తెచ్చి, బాపనయ్యకు ఇచ్చి అతనిని ఆనందింపజేశాడు. నాచన సోమననాథుని పద్యమిది.

మఱియుం జీకటి కొండ చందమయినన్ మా కెల్ల బాతాళమున్,
దఱియం జొచ్చు తెఱంగు దోచె నచటన్ దైత్యాంతకుదుద్ధతి,
న్నఱకెన్ దత్తిమి రంబు నంబుదములోనం దోచు దంబోళిద,
గ్గఱు చుట్టంబన విక్రమ క్రమణ చక్ర క్రీడ శోభిల్లగన్ ॥"

(ఉత్తర హరి వంశం.ద్వి.ఆ-49)

పెంజీకటినే లేకుండా చేసింది చక్రమే కదా! "అజ్ఞానాంధస్య మే దేవ! విష్ణోర్మార్గం ప్రదర్శయ". శ్రీ వైష్ణవుడు 'కోటి సూర్యసమ ప్రభగల చక్ర దేవా! అజ్ఞానాంధుడనైన నాకు వైకుంఠుని చేరే దారిని చూపు' మని ప్రార్థించి ఆచార్యుల చేత చక్రాంకితుడవుతాడు.

**4. సముదితాస్త్ర బృందం :-**

"అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిం యం ప్రచక్షతే".

సుదర్శన భగవానుడు స్వేచ్ఛగా అనేకాస్త్ర శస్త్రాలను సృజిస్తాడని దేశికులు షోడశాయుధ స్తోత్రం చేశారు.

**"చక్రం కుంతం కృపాణం పరశుహుతవహా వంకుశం దండ శక్తీ,**
**శంఖం కోదండ పాశౌ హల ముసలగ దావజ్ర శూలాంశ్చహేతీన్"**

(సుదర్శన శతకం-80)

చక్రం, ఈటె, ఖడ్గం, గొడ్డలి, ఆగ్నేయాస్త్రం, అంకుశం, దండం, శక్తి, శంఖం, విల్లు, పాశం, నాగలి, రోకలి, గద, వజ్రం, బల్లెం అనే పదహారు ఆయుధాలు పదహారు బాహువుల యందు కలవాడు సుదర్శనుడు.

**5. స్వవృత్తి వశవర్తిత్రిదశ వృత్తి :-** సురజన త్రాస ఖండనుడు చక్రత్తాళ్వాన్.

"కూఱాయ్ నీఱాయ్ నిలనాకిక్కొడు వల్లశురర్ కులమెల్లామ్,
శీఱ్గా వెరియుమ్ తిరునేమి వలవా తెయ్ వక్కోమానే!"

(తి.వా.మొ.6-10-2)

'ఓ దేవనాయకా! క్రూరులై బలిష్టులైన అసురుల కులాన్ని అంతటిని తునా తునకలుగా, బుగ్గి బూడిద చేసి, కోపంతో జ్వలించే చక్రం కుడిచేతి యందు కలవాడా-

అన్నట్లు, దేవతల ఉనికి, మనుగడ అంతా తన అధీనంలో ఉన్నట్టిది చక్రం.

6. పునః ప్రవర్తయతు ధామ్నితే మహతి ధర్మ చక్ర స్థితిమ్ :- పంచ లక్షణ శోభితమైన సుదర్శన చక్రాన్ని అంగరంగ భోగాలతో వైభవంగా వెలిగే శ్రీరంగధామమందు ఉపద్రవాన్ని కలిగించిన దుర్జనుల మీద ప్రయోగించి, మళ్ళీ భాగవత ధర్మస్థాపనం చేయుమని భగవంతుణ్ని వేడుకొన్నారు దేశికులు. ఉల్లేఖాలంకారం.

**24. మనుప్రభృతి మానితే మహతి రంగధామాదికే,**
**దనుప్రభవ దారుణైర్దర ముదీర్యమాణం పరైః ।**
**ప్రకృష్ట గుణక! శ్రియా వసుధయా చ సంధుక్షితః,**
**ప్రయుక్త కరుణోదధిః ప్రశమయ స్వశక్త్యా స్వయమ్ ॥**

**అర్థం :-** ప్రకృష్ట గుణక = అసంఖ్యేక కల్యాణ గుణాలు కల శ్రీరంగనాథా! మను ప్రభృతి మానితే = మనువు మొదలైన వారిచే పూజింపబడిన; మహతి = గొప్పదైన, రంగధామ+ఆదికే = రంగ విమానం, మొదలైన స్థలమందు; దను ప్రభవ దారుణైః = దానవుల కంటె క్రూరులైన; పరైః = పగతురచేత; ఉదీర్యమాణం = కలిగింపబడుతున్న; దరం = భయాన్ని; శ్రియా = లక్ష్మీదేవి చేత; వసుధయా, చ = భూదేవి చేత కూడా; సంధుక్షితః = ప్రబోధింపబడినవాడవై; ప్రయుక్త, కరుణా+ఉదధిః = ప్రసరింపబడిన కరుణ అనే సముద్రం కలవాడవై, స్వశక్త్యా = స్వీయ శక్తి చేత; స్వయం = స్వయంగా (నీవే); ప్రశమయ = శమింప జేయుము.

**తా॥** అనంత కల్యాణ గుణ పూర్ణుడవైన రంగనాథా! మను మహారాజు మొదలైన వారిచే పూజింపబడిన శ్రీరంగ విమానాది క్షేత్రాలయందు దానవులకంటె క్రూరులైన శత్రువులచే భయం కలిగింపబడుతున్నది. శ్రీదేవిచే, భూదేవి చేతనూ ప్రేరితుడవై, దయా సముద్రాన్ని చిప్పిల జేయువాడవై నీ శక్తి చేత, నీవే ఆభయాన్ని శమింపజేయుము.

**వ్యాఖ్య :-** భగవానుడే స్వశక్తి చేత శత్రువుల వలన కలుగుతున్న భయాన్ని శమింప జేయాలని ప్రార్థన.

22వ శ్లోకంలో పంచాయుధాలను, 23వ శ్లోకంలో సుదర్శన చక్రాయుధాన్ని

ప్రార్థించి, ఈ 24వ శ్లోకంలో భగవచ్ఛక్తిని ప్రార్థించారు.

హేయగుణాలే లేని భగవంతుని కల్యాణ గుణాలలో దయా గుణం ప్రధానమైనది. దయాగుణ స్పర్శ లేకుండా ఏ గుణమూ శోభించదు కాబట్టి 'ప్రకృష్ట గుణకుడు' పరమాత్ముడు.

**1. మనుప్రభృతి మానితే :-** వైవస్వతమను మహారాజ వంశమందు ఇక్ష్వాకుడు, మాంధాతాది మహీపతులచేతనూ, శ్రీరంగ విమానం పూజింపబడింది. శ్రీమన్నారాయణుడు రంగ విమానాన్ని చతుర్ముఖ బ్రహ్మకిచ్చాడు. ఇక్ష్వాకు మహారాజు తపస్సు చేయగా, సర్వేశ్వరుడు బ్రహ్మచేత ఇక్ష్వాకునికి దాన్ని ఇప్పించాడు. "ఇక్ష్వాకు రాజవ్యాజేన సాకేతం సముపేయుషే" అని ప్రసిద్ధి.

ఇక్ష్వాకులకు కులదైవమైన శ్రీరంగ విమానాన్ని సీతారామ దంపతులూ పూజించారు. "సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణము పాగమత్" అన్నాడు వాల్మీకి. శ్రీరాముడు తన పట్టాభిషేకానంతరం ఆ విమానాన్ని విభీషణునికి కానుకగా ప్రసాదించాడు.

"ఆద్యం స్వయం వ్యక్త మిదం విమానం రంగ సంజ్ఞితం" రంగ మనే పేరు గల్గిన విమానం స్వయం వ్యక్తమే. అయోధ్య నుంచి విభీషణుడు తెచ్చి "అనంత పీఠే శ్రీరంగం స్థాపయామాసరాక్షసః" ఉభయకా వేరుల నడుమ శేష పీఠం మీద శ్రీరంగ విమానాన్ని స్థాపించాడు. కాబట్టి బ్రహ్మది దేవతలూ, సప్తర్షులూ, ఆళ్వార్లూ, ఆచార్యులూ అర్చారూపమే మోక్షానురూపమని ఆరాధించారు. కావేరి విరజానదియే, శ్రీరంగం వైకుంఠమే. మంజూషలో మరకత మణిలాగా సకల జన, మనో నయనానందకరంగా ప్రకాశిస్తూ రంగమందు దర్శనమిస్తున్నాడు. శ్రీరంగనాథుడు. "మహతి రంగధామాదికే" అనడం వల్ల, శ్రీరంగమే కాక కరిశైలం, అంజనగిరి మొదలైన గొప్ప దివ్య దేశాలయందు భయం వ్యాపించింది.

2. దను ప్రభవ దారుణైః దరముదీర్యమాణం పరైః :- కశ్యప ప్రజాపతి పరమేష్ఠి యొక్క ఆజ్ఞ చేత దక్ష ప్రజాపతి పుత్రికలైన అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, నిశ్వ, కపిల, వినత, కద్రువలను పెండ్లాడి, సురాసుర నర

మృగ వృక్షాది సంతానం వల్ల సృష్టిని పెంపొందించాడు.

'దను' అనే పత్ని యందు ప్రభవించిన వారు దానవులు-రాక్షసులే. శ్రీరంగాది క్షేత్రాలయందు దాడి చేసి భయోత్పాతాన్ని కలిగించిన శత్రువులు రాక్షసులకంటె క్రూరులు. రాక్షసులు వేదాలను అధ్యయనం చేస్తారు. యజ్ఞాలు చేస్తారు. తపస్సు చేసి వరాలను పొందిన తర్వాత తమోగుణ ప్రేరితులై, అఖర్వ గర్విష్ఠులై లోక కంటకులవుతారు. రాక్షసులు దయలేనివారు.

"దేవామనుష్యా అసురా ఉషిత్వా బ్రహ్మచర్యం దేవా ఊచుర్బ్రవీతునో భవానితి తేభ్యోహైత దక్షరం 'ద' ఇతి --- తదేతత్త్ర యగ్ం శిక్షేత్ దమం దానం దయామితి॥" (బృ.ఉప)

ఒకప్పుడు దేవతలు, రాక్షసులు, మానవులు తరించే పద్ధతిని చూపుమని బ్రహ్మను ప్రార్థించారు. మీరందరు 'ద' ను పాటించండి అన్నాడు బ్రహ్మ. అందరికి ఒకే అక్షరమా! అని విస్మితులై, వివరించుమన్నారు; దేవతలు భోగ లాలసులు కాబట్టి 'దమం' అంటే ఇంద్రియ నిగ్రహాన్ని పాటించాలి. రాక్షసులు 'దయ' కలిగి ప్రవర్తించాలి. మానవులు దీనులకు 'దానం' చేయాలి. తరిస్తారని బ్రహ్మ వివరించినట్లు ఉపనిషత్తు బోధిస్తున్నది.

భయ జనకులైన మ్లేచ్ఛులు వేదాలను విశ్వసించరు. విగ్రహారాధనకు విరోధులు. నిర్దయులు, హింసాపరులు కాబట్టి రాక్షసుల కంటె క్రూరులు కదా!

**3. శ్రియా వసుధయాచ సంధుక్షితః :-**

**"తేవి మారావార్ తిరుమగళ్ బూమి".**

**హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ".** పరమ పురుషునికి లక్ష్మీదేవి, భూదేవి -ఇద్దరు భార్యలు, అని ఉభయ వేదాన్తాలు విశదం చేస్తున్నాయి. లక్ష్మీదేవి చంచల. "ప్రాదుర్భా వైరసి సమతనుః" - "విష్ణోర్దేహానురూపాం వైకరోత్యేషాఽత్మనస్తనుమ్"- అన్నట్లు విష్ణుమూర్తి ఏ అవతారమెత్తినా, ఆయన రూపానికి తగిన రూపాన్ని లక్ష్మీదేవి ధరించి ఆయనను ఎడబాయక ఉంటుంది. భూదేవి అచల. ఈమె ప్రతిష్ఠ ద్రడిష్ఠం. భూమి సకల పదార్థాలను తనలో ఇముడ్చుకొని యున్నది. "వర్తతే సావరోధః" అన్న విధంగా,

రెండు ఆడ హంసల నడుమ ఉన్న రాజహంసలాగా, శ్రీరంగనాథుడు ఉభయ నాచ్చియార్లతో ఉల్లసిల్లుతుంటాడు. శ్రీదేవి, భూదేవి చెరొక ప్రక్కన ఉండి రంగనాథుణ్ని ప్రేరేపిస్తుంటారు.

శరణాగతులు అపరాధులయితే వాళ్ళను నరకంలోకి త్రోసి వేస్తానని కోపిస్తాడు భగవానుడు. అపుడు ప్రక్కనున్న లక్ష్మీదేవి "ఏమండి! తప్పులు లెక్కపెట్టి వాళ్ళను త్రోసివేస్తే, ఇక మీ దయ ప్రసరించేదెక్కడ?" దోషోయద్యపితస్యస్యాత్ సతామేత దగర్హితం". వాళ్ళయందు దోషాలు ఉన్నా, వాళ్ళను గర్హించక కాపాడడం సత్పురుషుల గొప్పతనం కదా!" అని ప్రబోధిస్తుంది.

కరుణను ప్రసరించకుండా అడ్డగించేవి వాళ్ళు చేసిన దుష్కృతాలే కదా! అంటూ భగవంతుడు ముఖం మరొక ప్రక్కకు త్రిప్పుకొంటాడు.

**"పార్శ్వే పరత్ర భవతీ యదితత్ర నాసీత్**
**ప్రాయేణ దేవి! వదనం పరివర్తితం స్యాత్ ॥"**

ఆ ప్రక్కన భూదేవియే ఉండకుంటే మనలను జూచే నాథుడేడి? ఆమె ఉంది కాబట్టి మనం బ్రతుకుతున్నాం. ఆ వైపు ఉన్న వసుధాదేవి, "అలా అంటున్నారేమిటండీ! స్నేహబుద్ధితో వచ్చిన వాణ్ని ఎప్పుడు విడువను" " ఏత ద్వ్రతం మమ"– "నమే మోఘం వచో భవేత్". ఇది నా నియమం; నా మాట మొక్క పోదు– అని మీరే అన్నారు కదండి. కాబట్టి శరణార్థుల దోషాలను క్షమించి, వెంటనే వారి భయాన్ని పోగొట్టండి, అని భూదేవి వాదిస్తుంది.

**4. సంధుక్షితః :–** ఉభయ పార్శ్వస్థలైన దేవేరుల ప్రేరణవల్ల, యంత్రస్థమై అణచబడిన చెరుకుగడ నుంచి చెరుకు రసం చిప్పిలినట్లు, భగవంతుని కరుణా రసం ప్రసరిస్తుంది. లక్ష్మీదేవి చేసే పురుషకారాన్ని భూదేవి భగవానుని చేత సఫలం చేయిస్తుంది. దయా మూర్తికి అంగమేక్షమ. ఓర్పులేని దయకు గుణ పూర్తి ఉండదు.

"నిర్వృత్త ప్రణయా తివాహన విధౌనీతాః పరీవాహతాం"– దయ అనేది ప్రవహించడానికి తూము, అలుగులాంటి జలనిర్గమన మార్గం అవశ్యంగా ఉండి తీరాలి. సముద్ర జలం ప్రసరించే విధానమిది – "యాభిరాదిత్యస్తపతి తాభిః పర్జన్యో

వర్షతి" (శ్రుతి) సూర్యుడు ఏకిరణాలచే తపింప చేస్తాడో, ఆ కిరణాల చేతనే ఏర్పడిన మేఘం వర్షిస్తుందని శ్రుత్యర్థం.

**"తుంగత్వ మితరానాద్రౌ నేదం సింధావగా ధతా!**

**అలంఘనీయతా హేతుః ఉభయం తన్మనస్విని ॥"**

పర్వతానికి ఎత్తు ఉంది కాని లోతు లేదు. సముద్రానికి లోతు ఉన్నది కాని ఎత్తు లేదు. మనస్వియైన పురుషుని యందు పర్వతం లాగా ఔన్నత్యమూ ఉంది. సముద్రంలాగా గాంభీర్యమూ ఉంది అంటాడు మాఘకవి.

"లక్ష్మీనాథాఖ్య సింధౌ"- "ఆషియుళ్ పుక్కుముగందుకొడా ర్తేతి" అన్నట్లు సముద్రమందు ప్రవేశించి, ఉదకాన్ని పుక్కిట పెట్టుకొని పైకి లేచిన మేఘం వర్షించి భూమి తాపాన్ని శమింపజేస్తుంది. అలాగే కరుణా సముద్రుడైన భగవంతుని సన్నిధిలో ప్రపత్తి చేసి భగవత్కృపను పొందిన ఆచార్యుడు సాంసారికి భయాన్ని పోగొట్టి సమాజ శ్రేయస్సు కోసం పాటు పడుతాడు.

**5. ప్రశమయ స్వశక్త్యా స్వయమ్ :-** భగవానుని శక్తి అపారమైనది, అమోఘమైనది. పైగా దేవేరులచే ప్రేరితుడైన కరుణాపయోనిధి స్వయంగా తన శక్తి చేతనే శత్రు భయాన్ని పోగొట్టి లోక కల్యాణాన్ని సమకూర్చాలని దేశికులు ప్రార్థించారు.

**25. భుజంగమ విహంగమ ప్రవర సైన్య నాథాః ప్రభో !**

**తథైవ కుముదాదయో నగర గోపుర ద్వారపాః ।**

**అచింత్య బల విక్రమా స్త్వమివ రంగ సంరక్షకాః,**

**జితంత ఇతి వాదినో జగదనుగ్రహే జాగ్రతి ॥**

**అర్థం :-** ప్రభో = శ్రీరంగ రాజా! అచింత్య బల విక్రమాః = ఊహింపరాని బలం, పరాక్రమం కలిగినట్టి; భుజంగమ, విహంగమ, ప్రవర, సైన్యనాథాః = పాములలో, పక్షులలో శ్రేష్ఠులైన ఆదిశేషుడు, గరుత్మంతుడు, సేనాధిపతియైన విష్వక్సేనుడు, తథా+ఏవ = అట్లే; కుముద+ఆదయః = కుముదుడు మొదలైనవారు; నగర, గోపుర, ద్వార పాః = నగర, గోపుర, ద్వారాలను కాపాడేవారు; జితం, తే, ఇతి, వాదినః = 'జయం నీకు' అని చెబుతున్న వారై? రంగసం రక్షకాః = శ్రీరంగ రక్షకులై,

త్వం, ఇవ = నీవలెనే, జగత్+అనుగ్రహే = జగత్తును అనుగ్రహించడమందు; జాగ్రతి = మేల్కొని ఉన్నారు.

**తా॥** ఓ శ్రీరంగనాథా! ఊహింపనలవి కాని బలపరాక్రమాలు కలిగిన ఆదిశేషుడు, గరుత్మంతుడు, విష్వక్సేనుడు, అలాగే కుముదాది నగర గోపుర ద్వారపాలకులు నీకు జయం పలుకుతూ శ్రీరంగ రక్షకులైన వలెనే జగద్రక్షణయందు మెలకువతో ఉన్నారు.

వ్యాఖ్య:- భగవానుని పరివారమంతా శ్రీరంగ రక్షకులై జగద్రక్షణ చింతనా పరులని ప్రశంసితం.

శ్రీరంగనాథుని సమస్త పరివారం అధిక బలపరాక్రమాలు కలది. ఆ బలంగానీ, విక్రమంగానీ మన ఊహకు అందనిది.

**1. భుజంగమ ప్రవరుడు :-** సర్పరాజైన ఆదిశేషుడు జగదాధారుడు. తల్లి కద్రువ పన్నాగం అన్యాయమని తన తోబుట్టువులను వదిలి, భగవంతునికి సర్వవిధ కైంకర్య రతుడైన అనంతుడు. "శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శింగాసన మాయ్" (ముదల్.53) "నివాసశయ్యాసన". (స్తో.ర.40) ఆళ్వార్లు, ఆచార్యులూ పలికినట్లు, నివాసం, శయ్య, ఆసనం, పాదుకలు, వస్త్రం, దిండు, ఛత్రం మొదలైన రూపాలుగా మారుతూ, శ్రియః పతికి సకల సేవలను సర్వదా చేసే పాపతేడు.

**2. విహంగమ ప్రవరుడు :-** పక్షిరాజైన గరుత్మంతుడు వేదాత్ముడు. యజుర్వేదం "సుపర్ణోஉసి గరుత్మాన్" (4-1-42) అని గరుడుణ్ని వేద స్వరూపునిగా స్తుతించింది. శ్రీ యామునాచార్యులు "దాసః సఖా వాహనమా సనంధ్వజో యస్తే వితానం వ్యజనం త్రయీ మయః॥" (స్తో.ర41) స్తుతించినట్లు గరుడుడు కూడా శ్రియఃపతికి సమయోచితమైన సేవచేసే బహు రూపియైనా, వాహనంగానూ, ధ్వజంగానూ లబ్ధ ప్రతిష్ఠుడు.

దేశికులవారు 'త్రయీమయః' అనే పదానికి "తస్యగాయత్రీ జగతీచ పక్షా వభూతామ్, ఉష్ణిక్చ త్రిష్టుప్ చ పృష్ఠౌ, అనుష్టుప్ చ పంక్తిశ్చ ధుర్యౌ, బృహత్యేవోక్తిరభవత్, స ఏవం ఛందో రథ మాస్థాయ ఏతమధ్వా నం అనుసమచరత్". అని వ్యాఖ్యానించారు. వేదం భగవత్స్వరూపాన్ని భక్తులకు ప్రత్యక్షం చేసే విధంగా, వేదాత్ముడైన గరుడుడు

భగవంతునికి వాహనమై ఆ ప్రభవును భక్తులదగ్గరికి తెచ్చి దర్శనం చేయిస్తాడు.

"ఉపస్థితం తేన పురోగరుత్మతా"- శ్రీరంగ నాథుణి కెదురుగా ఉండి ఆ స్వామి దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని చూచి గరుడుడానందపడుతుంటే "అగ్రేతిష్ఠన్ను దగ్రో మణిముకుర ఇవానన్య దృష్టేర్మురారేః"- (గరుడ పంచాశత్-8) అన్నట్లు భగవానుడు తనకు మణి దర్పణంగా ఉన్న ఈ వేదాత్మునియందు తన రూపలావణ్యాది మహిమను చూచుకొంటూ మురిసిపోతాడు.

**3. సైన్యనాథుడు :-** "ఇనః సూర్యే నృపౌ పత్యౌ" - అనే నిఘంటువు వల్ల 'ఇన' శబ్దానికి పతి, లేదా ప్రభువు అని అర్థం. "ఇనేన సహవర్తతే, ఇతిసేనా". ప్రభువుతో కూడి యుండేది. 'సేన'. "సేనా యాం సమవేతాః సైన్యాః"- సేనయందు కూడిన వారెల్ల 'సైన్య' పదవాచ్యులు. అథవా "సైన్యస్య నాథః- సైన్య నాథః" సైన్యనాథుడు విష్వక్సేనుడు.

"యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్"- "కరి ముఖ జయత్సేనౌ కాలాహ్వ సింహ ముఖౌచనః" (శ్రీరంగరాజ.పూ.శ-52) అన్న విధంగా, గజానన, జయత్సేన, కాలప్రకృతి, సింహముఖులనే భటులకు విష్వక్సేనుడు నాయకుడు.

"యోనిర్వహతి అనిశ మంగుళి ముద్రయైవ". (50) శ్రీశ్రియఃపతులు స్వేచ్ఛగా విహరిస్తున్నప్పుడు, సమస్త చరాచర నిర్వహణను విష్వక్సేనుడు తన (తర్జని) వేలిముద్రతోనే నెరవేరుస్తాడు. భగవద్రామానుజులు "శ్రీమతి విష్వక్సేనే న్యస్త సమస్త వైభవమ్"- శ్రీ వైకుంఠనాథుడు జగద్రక్షణ భారాన్ని విష్వక్సేనుల కప్పగిస్తాడని వైకుంఠ గద్యలో తెల్పారు. భగవంతుడు ఆరగించగా మిగిలిన పదార్థాన్ని ప్రసాదంగా స్వీకరించడంవల్ల విష్వక్సేనుడు శేషాశనుడని పేరు పొందాడు.

**4. కుముదాదయః :-** శ్రీమద్రామానుజ యతీంద్రులు నిత్యగ్రంథమందు వైకుంఠ నగరంలో ఎనిమిది దిక్కుల రక్షణకైంకర్య పరులైన కుముదాదులను ప్రస్తుతించారు. తూర్పున కుముదుడు, ఆగ్నేయాన కుముదాక్షుడు, దక్షిణాన పుండరీకుడు, నైరుతి యందు వామనుడు, పడమర శంఖ కర్ణుడు, వాయవ్యాన సర్ప నేత్రుడు, ఉత్తరాన సుముఖుడు, ఈశాన్యమందు సుప్రతిష్ఠితుడు అనే నిత్య సూరులు నగర పాలకులు.

**"కుముదః కుముదాక్షచ్చ పుండరీకోథ వామ నః ।**

**శంఖ కర్ణః సర్పనేత్రః సుముఖః సుప్రతిష్ఠితః ॥"**

వైకుంఠానికి ప్రతిరూపమే శ్రీరంగం కాబట్టి ఈ గణనాయకులు "ప్రహరణ పరివార వాహనాధ్యులు, పుర పరిపాలన నిత్యజాగరూకు"లని శ్రీ పరాశర భట్టర్ స్తుతించారు.

**5. ద్వారపాః :-**

**"చండ ప్రచండౌ ప్రాగ్ద్వారే యామ్యే భద్ర సుభద్రకౌ ।**

**పశ్చిమే జయ విజయా వుదగ్ధా తృవిధాతృకౌ" ॥**

అనే ప్రమాణాన్ని బట్టి దేవాలయానికి పూర్వ ద్వారమందు చండుడు, ప్రచండుడు; దక్షిణాన భద్రుడు, సుభద్రుడు; పడమర జయుడు, విజయుడు; ఉత్తర ద్వారమందు ధాత, విధాత అనే పేర్లు గలవారు రక్షణ భారాన్ని నిర్వహిస్తారు. శ్రీ వైకుంఠ గద్యంలో "భగవత్పారిషద గణనాయకైః ద్వారపాలైః కృపయా స్నేహ గర్భయాదృశాஉవలోకితః, సమ్యగభినంది తై స్తై స్తై రే వానుమతో భూత్వా, భగవంత ముపేత్య"- అంటూ, భగవత్పారిషదులైన గణ నాయకులకు, ద్వారపాలకులకు నమస్కరించి, వారి అనుమతితో భగవత్సన్నిధిలో ప్రవేశించే విధానాన్ని శ్రీమద్రామానుజులు సూచించారు.

**6. జితంత ఇతి వాదినః :-** "జితంతే" మంత్రాన్ని జపించే నిత్యసూరులు, భగవానుని కల్యాణ గుణాలకు ఓడిపోయిన చేతనులు గుణ దాస్యమూ, స్వరూప దాస్యమూ అవలంబించి, భగవంతుణ్ని జయ జయ ధ్వనులచే కీర్తిస్తూ శ్రీరంగ రక్షణ చేస్తుంటారు. శ్రీమన్నారాయణుని పరిచారకులందరు తమ స్వామిలాగా, జగద్రక్షణమందు జాగరూకులై యుండువారే.

**"నాకస్య పృష్ఠ మభి సంవసానో వైష్ణవీం**

**లోక ఇహ మాదయంతామ్".** (శ్రుతి)

పరమ పదవాసులైన నిత్యసూరులను 'లోకంలో విష్ణుభక్తిని పెంపొందించండి' అని శ్రియఃపతి ఆజ్ఞాపించాడు. కాబట్టి,

"శేషోహవై వాసుదేవాత్ సంకర్షణో
నామబీజ ఆ సీత్ -- స ఏవ సౌమిత్రి రైక్ష్వా
కః -- రౌహిణే యో వాసుదేవః -- స
ఏవ భగవాన్ యుగే తురీయేఽ పి
బ్రహ్మకు లేజాయ మానః, సర్వా
ఉపనిషదః ఉద్ది ధీర్షుః, -- సర్వానపి వైష్ణవాన్
ధర్మాన్ విజృం భయన్ సర్వాన పి పాషండాన్
నిచఖాన"- శ్రీ కృష్ణోపనిషత్). ఆది శేషుడే త్రేతాయుగమందు లక్ష్మణుడుగానూ, ద్వాపర మందు బలరాముడుగానూ, కలియుగమందు రామానుజాచార్యులుగా అవతరించాడు. పాషండులను (పాప ఖండులు - ఖండమంటే లింగం- గుర్తు. మూర్తీభవించిన పాతకాలు) అణచివేసి ద్వైత సిద్ధాంత నిర్ధారకులై, విశిష్టా జగద్గురువుగా భాసించిన వారు శ్రీమద్రామానుజ యతీంద్రులు.

ద్విజకుల తిలకుడైన గరుత్మంతుడు శ్రీ విష్ణు చిత్తులు - పెరియాళ్వారు - గా అవతరించి, శ్రీమన్నారాయణ పరత్వాన్ని స్థాపించాడు. ప్రణవ రూపమైన తిరుప్పల్లాణ్డును పాడి గరుడ వాహనుడైన శ్రియఃపతికి మంగళా శాసనం చేశాడు. తనకు లభించిన గోదాదేవిని పెంచి, శ్రీరంగనాథునికి ఇచ్చి పెండ్లి చేసి 'మామగారు' గా బహుమానితులైన వారీ భట్ట నాథులు.

విష్వక్సేనులు శ్రీ శఠకోపమునులుగా అవతరించారు. ద్రావిడ వేద సంహితాద్రష్టలై, ప్రపన్న జనులచేత 'నమ్మాళ్వార్లు' అని కీర్తింప బడినారు.

కుముద గణేశులు మధురకవులుగా అవతరించి, నమ్మాళ్వార్లను ఆశ్రయించి "గురుం ప్రకాశయేత్ ధీమాన్" అన్నట్లు చరమ పర్వనిష్ఠులై ఆచార్య వైభవాన్ని ప్రకటించారు.

అటు నిత్య విభూతిలోనూ, ఇటు లీలా విభూతిలోనూ 'అహగ్గ్ శ్లోక కృత్' అన్నట్లు భగవత్ప్రవణులై, సకల చేతనులను ఉజ్జీవింప జేసిన మహానుభావులు అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు. స్వభావోక్త్యలంకారం.

26. విధిస్త్రి పురమర్దనస్త్రిదశ పుంగవః పావకో,
యమప్రభృతయోఽ పి యద్విమత రక్షణే నక్షమాః ।
రిరక్షిషతియ త్రచ ప్రతి భయం నకించిత్ క్వచిత్,
స నః ప్రతిభటాన్ ప్రభో ! శమయ రంగధామాదిషు ॥

**అర్థం :-** ప్రభో = శ్రీరంగనాథా! విధిః = బ్రహ్మ; త్రిపురమర్దనః = త్రిపురాంతకుడైన పరమశివుడు; త్రిదశ పుంగవః = దేవేంద్రుడు; పావకః = అగ్నిదేవుడు; యమ, ప్రభృతయః = యముడు మొదలైన దేవతలు; యత్+విమత, రక్షణే = ఏ నీయొక్క శత్రువులను రక్షించడమందు; న, క్షమాః = సమర్థులుకారో; యత్ర = ఎక్కడ; చ = ఎవరినైనా; రిరక్షిషతి = రక్షింపగోరినావో; క్వచిత్ = ఏవిధమైన; ప్రతిభయం = భయం కలిగించేది(శత్రు భయం); కించిత్ = కొంచెమైన; న = లేదో; సః = అటువంటి నీవు; రంగధామ+ఆదిషు = శ్రీరంగం మొదలైన చోటులందు; నః = మా యొక్క; ప్రతి భటాన్ = శత్రువులను; ప్రశమయ = శమింప జేయుము.

**తా॥** ప్రభో! రంగనాథా! బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు మొదలైన దేవతలు నీ విరోధిని కాపాడే సమర్థులు కారు. నీవు రక్షింపదలచిన వానికి శత్రు భయమూ ఉండదు. అలాంటి నీవు శ్రీరంగాది క్షేత్రాలయందు మా శత్రు భయాన్ని శమింపజేయుము.

**వ్యాఖ్య:-** శ్రీరంగనాథుడు సర్వరక్షకుడని ప్రతిపాదించే శ్లోకమిది.

బ్రహ్మాండంలో గొప్పవారైన బ్రహ్మాది దేవతలకు ఆయా పదవులనిచ్చి ఒక్కొక్కరికి ఒక్కొక్క స్థాయిని కల్పించినవాడు శ్రీహరి. “నహి పాలన సామర్థ్యం ఋతే సర్వేశ్వరం హరిమ్”. బలవంతులు దుర్బలులను బాధించకుండా వారి వారికి ఇష్ట ప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని చేస్తూ కాపాడే సామర్థ్యం శ్రియఃపతికి తప్ప మరొకరికి లేదు కదా!

“భక్తాన్ ఆత్మ శరీరవత్”- తనను ఆశ్రయించిన జీవులను భగవానుడు తన శరీరంలాగా ఆదరించి రక్షిస్తాడు. భగవానుడు రక్షింపదలచిన వ్యక్తికి ఏ ప్రబల శక్తి కూడా హాని చేయజాలదు. అలాగే తాను దండింప తలచిన అపరాధిని రక్షించడానికి

దేవతలెవ్వరూ సాహసించలేరే. అధికార పురుషులందరూ స్వామికి భృత్యులే కదా!

హనుమంతుడు రావణునితో పల్కిన మాట ఇట్టిదే.

"బ్రహ్మ స్వయం భూశ్చతురాననో వా, రుద్ర స్త్రి నేత్ర స్త్రి పురాంత కోవా।

ఇంద్రో మహేంద్ర స్సుర నాయకోవా, త్రాతుం నశక్తాః యుధిరామ వధ్యమ్ ॥"

బ్రహ్మ రుదేంద్రుల కొక్కొక్కరికి మూడేసి పదాలను ప్రయోగించి, వారి ప్రభావాన్ని ఉత్తరోత్తరంగా ఉత్కర్షించాడు శ్రీరామ దూత. అయినా, చతుర్ముఖ బ్రహ్మ, త్రిపురాంతకుడైన రుద్రుడు, దేవరాజైన మహేంద్రుడు ప్రత్యేకంగా గానీ, అందరు కూడుకొని గానీ, యుద్ధంలో శ్రీరామునిచే వధింపదగిన వ్యక్తిని రక్షింప సమర్థులు కారు– అని తెల్పాడు.

దేశికులు ఈ శ్లోకంలో ఇంకొక ఇద్దరిని – అగ్నిని, యముణ్ని – జతపరచారు.

భగవదాశ్రితులను దండధరులైన యమాదులు కూడా భయపెట్ట జాలరని విశదం చేశారు. అందరినీ సమాన దృష్టితో రక్షించేవాడు సర్వేశ్వరుడు, అయినా, సాధు రక్షణలో దుష్టులను దండించడం ఒక అంగం. అందరి హృదయాలలో పరమాత్ముడు ఉన్నాడు. కానీ లోక కంటకుల ఎదలో "కంటకాగ్ర ఇవస్థితః" ముండ్ల మీద నిలిచినట్లుంటాడు.

భక్తులకు విరోధులే భగవద్విరోధులు. బ్రహ్మ రుద్రేంద్రులకు భయం కలిగినప్పుడు వారి ఆపదను నివారించడానికి ఆశ్రయింపబడినవాడు స్వామియే కదా! "భయంకరం ప్రతి–భయం" (అమరం)

"వేదా పహార గురుపాతక దైత్య పీడా ద్యా పద్విమోచన మహిష్ఠ ఫల ప్రదానైః । కోఽన్యః ప్రజా పశుపతీ పరిపాతి".

(స్తో.ర) వేదాలు అపహరింపబడినప్పుడు ప్రజాపతియైన బ్రహ్మనుగానీ, బ్రహ్మహత్యా పాతకం నుంచి పశుపతిని గానీ, రాక్షసుల పీడ నుంచి స్వర్గాధిపతిని గానీ, కాపాడినవాడు శ్రీహరి కాక మరెవ్వడైన కలడా? అని శ్రీ మద్యామున మునులు సావష్టంభంగా ప్రశ్నించారు. అందరి భయాలను తీర్చే వాడు స్వామియే కాబట్టి, దేశికుల వారు ఈ శ్లోకమందు శ్రీరంగనాథుని పరత్వాన్ని సూచిస్తూ, దివ్య క్షేత్రాలలో

దాడి జరిపిన శత్రువులను నశింపజేసి, ఆశ్రితుల భయాన్ని శమింపజేయుమని వేడుకొన్నారు.

**27. సకైటభ తమో రవి ర్మధుపరాగ జంఝామరుత్,**
**హిరణ్య గిరి దారణ స్త్రుటిత కాలనేమి ద్రుమః ।**
**కిమత్ర బహునా! భజత్ భవ పయోధి ముష్టింధయః**
**త్రివిక్రమ! భవత్క్రమః క్షిపతుమంక్షు రంగద్విషః ॥**

**అర్థం :-** త్రివిక్రమ = ఓ త్రివిక్రమా! కైటభతమో రవిః+కైటభ = కైటభుడనే; తమః = తమస్సుకు - చీకటికి; రవిః = సూర్యునిలాంటిది; మధు-మరుత్ । మధు = మధువనే; పరాగ = రజస్సుకు- ధూళికి; జంఝూ మరుత్ = పెనుగాలిలాంటిది; హిరణ్య-ణః । హిరణ్య = హిరణ్యకశిపుడనే; గిరి = పర్వతాన్ని; దారణః = చీల్చే వజ్రాయుధం లాంటిది; త్రుటిత-ద్రుమః ।త్రుటిత = కొట్టి వేయబడిన; కాలనేమి = కాలనేమి అనే; ద్రుమః = చెట్టు గలదియు; అత్ర = ఇక్కడ; కింబహునా = ఎక్కువ మాటలతో ఏమి లాభం? భజత్-ధయః । భజత్ = సేవించే వారి యొక్క; భవ = సంసారము అనే; పయోధి = సముద్రాన్ని; ముష్టింధయః = పుడిసిట బట్టి పీల్చేదియైన; సః = అట్టి; భవత్, క్రమః = నీయొక్క పాద విక్షేపం; రంగద్విషః = శ్రీరంగమందలి శత్రువులను; మంక్షు = శీఘ్రంగా; క్షిపతు = నశింపజేయుగాక.

**తా॥** త్రివిక్రముడవైన శ్రీ రంగనాథా! నీ పాద విక్షేపం కైటభుడనే చీకటికి సూర్యుని లాంటిది. మధువనే పరాగానికి ప్రభంజనం లాంటిది. హిరణ్యకశిపుడనే భూధరానికి దంభోళి వంటిది. కాలనేమి అనే వృక్షాన్ని ఛేదించేది. వేయి మాటలెందుకు; మేమనుభవిస్తున్న సంసారమనే సముద్రాన్ని పుడిసిలితో పీల్చి వేసే నీ క్రమం శ్రీరంగక్షేత్రాన్ని ద్వేషించే విరోధులను అణచి వేయుగాక.

వ్యాఖ్య:- భగవంతుని పరాక్రమం (పాద విక్షేపం) పరిపంథులను ఆవశ్యంగా అణచి వేస్తుందని దేశికుల అధ్యవసాయం.

'త్రివిక్రమ' శబ్దం మూడడుగులతో భూమ్యంత రిక్షాలను కొలిచి స్వాధీన పరచుకొన్న ఉపేంద్రుణ్ని తెలుపుతుంది. "ఇదం విష్ణుర్విచ క్రమే, త్రేధా నిదధేపదం" అని శ్రుతి బోధిస్తుంది.

"ఓంగి యులకలన్ద ఉత్తమన్". (తిరుప్పావై)

"క్రము-పాద విక్షేపే" - వీరుడు రణరంగంలో అడుగులు వేసే సామర్థ్యాన్ని క్రమమంటారు.

"శక్త్యాం చరణ విక్షేపే పరిపాట్యామపిక్రమః" (నా.రత్నమాల)

**1. కైటభ తమోరవిః :-** చీకటిని చీల్చి వేసేవాడు సూర్యుడు. తమోగుణం కలవాడు కైటభుడనే రాక్షసుడు. సూర్యుడు అంధకారాన్ని ధ్వంసం చేసే రీతిగా శ్రీరంగనాథుని అడుగు కైటభుణ్ని తొక్కి పెడుతుంది.

**2. మధు పరాగ జంఝామరుత్ :-** మధువనే రాక్షసుడు రజోగుణం కలవాడు. పరాగానికి రజస్సు పర్యాయపదం. మహావాయువు దుమ్మును- రేపుతుంది. అలాగే భగవచ్చరణ న్యాసం మధువును ఎగుర గొడుతుంది.

**"పూర్వమేవచ పద్మస్య పత్రే సూర్యాంశుస ప్రభే ।**
**నారాయణకృతౌ బిందూ అపామాస్తాం గుణోత్తరౌ ॥"**
(భారతం.మోక్ష ధర్మపర్వం.347అ. 24)

నారాయణుని నాభియందలి తామర పూవునందు చతుర్ముఖుడు కూర్చున్నాడు. అంతకు ముందే తామరాకు మీద రజస్తమో గుణాలకు ప్రతీకగా ఉన్న రెండునీటి చుక్కలు భగవత్ప్రేరణ చేత పడియున్నాయి.

**"తతో విగ్రహ వన్తౌ తావేదాన్ దృష్ట్వాఽ_సురోత్తమా।**
**సహసా జగృహతుర్వేదాన్ బ్రహ్మనః పశ్యతస్తదా ॥"** (29)

ఆ రెండు జల బిందువులు రెండు మూర్తులుగా మారి (శరీరధారులై) - మధుకైటభులనే రాక్షసులయ్యారు. వారు నాళం ద్వారా ఎగప్రాకి నలువ దగ్గరికి చేరారు. నలువ దగ్గర ఉన్న వేదాలను, చూస్తుండగానే పట్టుకొని పోయి రసాతలంలో దాచారు. నలువ నారాయణునితో మొరపెట్టుకొన్నాడు. "తండ్రీ! వేదాలే నా నేత్రాలు. అంధుడనై, సృష్టి చేయ లేకున్నాను. దయతో వేదాలను తెచ్చి ఇమ్ము" అన్నాడు. నారాయణుడు హయగ్రీవావతారాన్ని దాల్చి వేదాలను తెచ్చి బ్రహ్మకిచ్చాడు. యథా ప్రకారం కడలిలో శేషతల్పాన శయనించి, యోగనిద్రలో ఉన్నాడు నారాయణుడు.

దాచిన చోట వేదాలు లేవని గమనించిన మధుకైటభులు వచ్చి శేషశాయి పై కయ్యానికి కాలు సాచారు. "బ్రహ్మణో పచితం కుర్వన్ జఘాన మధుసూదనః" ॥ బ్రహ్మ పట్ల ఉండే అభిమానంతో నారాయణుడు మధుకైటభులను సంహరించాడు.

"నీరాషియుట్కిడందు నేరా నిశాశర్‌మేల్, పేరాషి కొణ్డ పిరాన్"–

జలధి పైన శయనించిన భగవానుడు, కయ్యానికి దూగిన (మధుకైటభులపై) నిశాచరుల మీద సహస్రార చక్రాన్ని ప్రయోగించిన, ఉపకారకుడు – అని ఆళ్వార్ల శ్రీ సూక్తి.

**3. హిరణ్య గిరి దారణః :–** హిరణ్యాక్షునికీ హిరణ్య కశిపుడనే నామానికీ ఏక దేశంగా 'హిరణ్య' నామం గ్రహింపబడింది. (భీమ సేనుణ్ని భీముడన్నట్లు) పర్వతాలను తెగగొట్టినది వజ్రాయుధం. హిరణ్య కశిపుడనే పర్వతాన్ని భగవత్పాద విక్షేపం పగుల గొట్టింది.

**"తతః ఖడ్గధరం దైత్యం జగ్రాహ నరకే సరీ ।**
**సంధ్యా కాలే సభా ద్వారే స్వాంకే నిక్షిప్య భైరవమ్ ॥**
**హిరణ్యకశి పోర్వక్షో విదార్యా తీవ రోషితః ।**
**ఉద్ధృత్యచాంత్రమాల్యాని నఖైర్వజ్ర సమ ప్రభైః ॥"**
**"అన్ది యంబోది లరి యురువాగి అరియైయషిత్తవన్"** (తిరుప్పల్లాణ్డు)
**"ఎంగుముళన్ కణ్ణనెన్ద మగనైక్కాయ్‌న్దు**
**ఇంగిల్లై యాలెన్ఱు ఇరణియన్ తూణ్‌పుడైప్ప**
**అంగప్పొషుదే అవన్ వీయత్తోన్ఱియ, ఎన్**
**శింగప్పిరాన్ పెరుమై ఆరాయుమ్ శీర్మైత్తే ॥"**

(తి.వా.మొ. 2-8-9). చక్రి సర్వోపగతుడని చెప్పిన ప్రహ్లాదుని మీద మండిపడి 'ఇక్కడ లేడే' అంటూ హిరణ్యకశిపుడు స్తంభాన్ని కొట్టగా, అక్కడనే అప్పుడే ఆవిర్భవించిన నరసింహ స్వామి వైభవాన్ని పరిచ్ఛేదించి తెలియశక్యమా! అన్నారు నమ్మాళ్వార్లు.

**"పొన్ పెయరోన్ నాగత్తైకూరారాన్ద వళ్ళు గిరాల్ కీణ్డు,**
**కుడల్ మాలై శీరార్ తిరుమార్పిన్ మేల్కట్టి"–**

హిరణ్యకశిపుని దేహాన్ని తన వాడియైన గోళ్ళ చేత చీటి, పేగులను లాగి తన వక్షస్థలమందు మాలలుగా దాల్చాడు – అని ఆళ్వార్ల దివ్యవాణి.

**4. త్రుటిత కాలనేమి ద్రుమః :–** చెట్టును గొడ్డలితో నటికినట్లు, భగవానుడు కాలనేమి అనే రాక్షసుణ్ని నటికి వేశాడు. చెట్టును కొట్టివేస్తే మళ్ళీ పెరుగుతుంది కదా! ఉగ్రసేనునికి క్షేత్రజుడైన కుమారునిగా జన్మించిన కంసుణ్ని మళ్ళీ శ్రీ కృష్ణ భగవానుడే వధించాడు. (కంసుడు పూర్వ జన్మలో కాలనేమియే).

**5. కింబహునా? :–** భగవానుని నైసర్గిక శక్తిని నిరూపించడానికి ఇన్ని ఉదాహరించడమేల?

**6. భవ పయోధి ముష్టింధయః :–** అగస్త్య మహర్షి సముద్రాన్ని ఆచమానం చేసినట్లు, సంసార వారిధిని ఒక్కపట్టున పీల్చి వేసే పటుత్వం (క్రమం) ఉంది భగవానునిపాద విక్షేపానికి.

కాబట్టి, శ్రీరంగం మీద దాడి చేసిన శత్రుమూకను త్వరగా ఆలీఢ పాదంతో అణచి వేయగల భగవచ్చరణ శక్తిని ప్రార్థించారు దేశికులు.

**"యః పార్థివాని విమమే రజాగ్ంసి, యోఽ**
**స్క భాయ దుత్తరగ్ం సదస్థం విచక్రమాణ**
**స్త్రేధోరుగాయః"** అనే శ్రుత్యర్థాన్ని బోధించే 'త్రివిక్రమ' పదం, సమగ్రంగా ఈ శ్లోక భావ వైభవాస్పదం.

రూపకామ ప్రాణితమైన ఉల్లేఖాలంకారం.

**28. యతి ప్రవర భారతీ రసభరేణ నీతం వయః**
**ప్రఫుల్ల పలితం శిరః పద మిహాక్షమం ప్రార్థయే ।**
**నిరస్త రిపుసంభవే క్వచన రంగ ముఖ్యే విభో!**
**పరస్పర హితైషిణాం పరిసరేషు మాంవర్తయ ॥**

**అర్థం :–** విభో = శ్రీరంగనాథా! యతి–భరేణ! యతిప్రవర = యతులలో శ్రేష్ఠుడైన శ్రీమద్రామానుజాచార్యుల యొక్క; భారతీ = శ్రీ సూక్తులయందలి; రస భరేణ = రసాస్వాదన చేత; వయః = వయస్సు; నీతం = గడుపబడింది. శిరః = తల; ప్రఫుల్ల

పలితం = బాగా నెరసింది. ఇహ = ఇక్కడ; క్షమం = సముచితమైన; పదం= స్థానాన్ని; ప్రార్థయే = కోరుతున్నాను. నిరస్త రిపు సంభవే = నిరసింపబడిన శత్రు భయంగల; రంగముఖ్యే = ముఖ్యమైన శ్రీరంగమందు; పరస్పరహిత+ ఏషిణాం = ఒండోరుల మేలు కోరేవారి యొక్క; పరిసరేషు = ప్రాంతాలయందు; క్వచన = ఒక చోట; మాం = నన్ను; వర్తయ = ఉంచుము.

**తా॥** యతీశ్వరులైన భగవద్రామానుజుల శ్రీ సూక్తులయందలి రసాన్ని ఆస్వాదించడం చేతనే వయస్సు గడిచింది. తల ముగ్గు బుట్ట అయింది. సముచిత స్థానమందు నివసింప కోరుతున్నాను. శత్రు భయం లేని శ్రీరంగ క్షేత్రమందు పరస్పర శ్రేయస్సును అభిలషించే వారున్న చోట నన్ను వర్తింప జేయవయ్యా! శ్రీరంగనాథా!

వ్యాఖ్య:- భాగవతోత్తములున్న చోట తన శేష జీవితం గడచే విధంగా అనుగ్రహించుమని దేశికులు ప్రార్థించారు.

**'విభు' శబ్దం సర్వవ్యాప్తిని తెల్పుతుంది.**

**"కలన్దపాలుళ్ నెయ్యేపోల్".** (తి.వా.మొ)

"సర్వ వ్యాపిన మాత్మానం క్షీరేసర్పి రివార్పితమ్"

(శ్వే.ఉప) పాలలో నెయ్యి లాగా అంతట వ్యాపించియున్న వాడు పరమాత్ముడు.

1. యతి ప్రవర భారతీ రస భరేణనీతం వయః :- యతిరాజ శ్రీ సూక్తులనే స్త్రీల యందు శృంగార రసాన్ని అనుభవించడంతోనే యౌవనం గడిచింది.

"బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ". (అమరం)

యతిరాజులైన భగవద్రామానుజుల వారు అనుగ్రహించిన శ్రీ భాష్య, వేదార్థ సంగ్రహ, గీతాభాష్యాది గ్రంథాల యందలి సూక్తి సుధను పానం చేయడంతోనే యౌవనం గడిచిపోయింది. అతిభోగ్యమైన సంప్రదాయార్థాలు గల యతి సార్వభౌముల శ్రీ సూక్తులను అనేక పర్యాయాలు ఆవర్తి చెప్పడం వల్ల జీవితంలో ముఖ్యమైన కాలం గడిచిందని 'రహస్యత్రయసారం' (నిగమనాధికారం) లోనూ దేశికులు విశదం చేశారు.

